





ముఖచిత్రం : ఆహిరి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

## తప్పక చూడండి

మాదాల రంగారావు
సారథ్యంలో



యువతరం పిక్చర్స్



నిర్మాతలు: టి.కృష్ణ, కె.రాధాకృష్ణ

## విజయవంతంగా ప్రదర్శింపబడుచున్న చిత్రం

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 45 జూన్ 1982 సంచిక 6

ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని స్కూళ్ళలోనూ తప్పనిసరిగా తెలుగు భాషను బోధించడానికి ఏర్పాట్లు త్వరలోనే చేస్తామని విద్యామంత్రి కేశవరావుగారు ఇటీవల ప్రకటించారు. ఇది చాలా ముఖ్యమైన కార్యక్రమం. తెలుగుదేశంలో చదువుకొనే ప్రతి బాల బాలికలకూ తప్పనిసరిగా తెలుగు వ్రాయడమూ, చదవడమూ వచ్చితీరవలసిందే.

అయితే, తెలుగుభాషను బోధించే కార్యక్రమంలో, ఇతర భాషలను అణగదొక్కే ప్రయత్నం ఏమీ జరగకూడదు. పదవతరగతి చదువు పూర్తి అయేటప్పటికి ప్రతి బాలబాలికకూ తెలుగు పరిగణనీయమైనంతగా తెలిసివుండటమే కాక, ఇంగ్లీషు కూడా దాదాపు తెలుగుతో సమానంగా తెలిసి ఉండేటట్టుగా మన విద్యాశాఖాధికారులు ఏర్పాటు చెయ్యాలి ఇంగ్లీషు భాషను మనం యీనాడు విడిచిపెట్టడానికి వీలులేదు. ప్రపంచంలో సగానికి సగం ప్రజలు తమ వ్యవహారాలను ఇంగ్లీషు భాషలోనే జరుపుకుంటున్నారు. మనకు అన్ని దేశాలతోనూ సన్నిహిత సంబంధం ఉండడమేకాక, వ్యాపార సంబంధాలున్నాయి. ఆ దేశాల నుంచి వెలువడే విజ్ఞాన విషయాలను మనం ఆకళింపు చేసుకోవాలంటే మనకు ఇంగ్లీషు భాషాజ్ఞానం బాగా ఉండాలి. బాగా ఇంగ్లీషు భాషాజ్ఞానం కావలసినవారు

పదవతరగతి తరువాత ఆ భాషను క్షుణ్ణంగా చదువుకోవచ్చును. దానికి ప్రాతిపది కగా పదవతరగతి లోపల తగిన ప్రాధమిక జ్ఞానం ఆ భాషలో మన బాలబాలిక లకు వుండాలి. ఒకానొకప్పుడు, స్కూలుఫైనలు వరకు, ఇంగ్లీషు, తెలుగులు క్షుణ్ణంగా బోధింపబడేవి. దానివల్ల నష్టపడినవా రెవరూలేరు. ఆ ధోరణిలోనే యీనాడు కూడా, నిర్బంధంగా, ప్రతి బాలబాలికకూ తెలుగు ఇంగ్లీషు భాషం బోధ జరిగితే, అది ప్రయోజనకరమేగాని నష్టదాయకం కాదు. ఈ రెండు భాష లతోపాటు, ఏ అయిదవతరగతిలోనో ప్రారంభించి పదవతరగతి వరకూ మరొక భాషను కూడా ఒకపాటి పరిజ్ఞానం వచ్చేవరకు బోధించాలి. అది హిందీ కావచ్చు, మరాఠీకావచ్చు, తమిళంకావచ్చు; మరేభాష అయినా కావచ్చు. మూడభాషలను నేర్చుకోవడం ఏ బాలబాలికకూ విశేషమైన కష్టంతో కూడినపనికాదు. అయితే మూడుభాషలను ఒకేసారి ఒక్కే తరగతిలో ప్రారంభిస్తే, నేర్చుకోవడం కష్టమే. మొదటినుంచీ తెలుగును, మూడవతరగతి నుంచీ ఇంగ్లీషును, అయిదవ తరగతి నుంచీ మూడవభాషను నేర్పితే, కష్టంలేకుండా పిల్లలు నేర్చుకోగలరు. దానివల్ల క్రమంగా అధికార వ్యవహార భాషగా ఒక శ్రేణివరకు తెలుగును వాడకలో పెట్టవచ్చును.

ప్రభుత్వ కార్యక్రమాలన్నిటినీ, ప్రభుత్వ ఉత్తరువులన్నిటినీ, ప్రభుత్వ ఉత్తర ప్రత్యుత్తరాలన్నిటినీ పూర్తిగా తెలుగులోనే నడపాలనే నిర్బంధం మంచిది కాదు ఇంగ్లీషులో ఉత్తర ప్రత్యుత్తరాలను జరిపినందువల్లగాని ఇంగ్లీషులో ఉత్తరాలను వ్రాసినందు వల్లగాని మనకు వామర్దా ఏమిలేదు, నష్టం ఏమీలేదు. మన నిత్యజీవితంలోనే ఎన్నో వందల ఇంగ్లీష్ పదాలను తెలుగు పదాలుగా వాడుతున్నాము. ఎన్నో పెర్షియన్ అరబ్బీపదాలు తెలుగుపదాలు అయిపోయి నవి. అంచేత అధికార భాషగా వాడడానికి ఇంగ్లీష్ పదాలకు సమానమైన తెలుగుపదాలను సూచించే సంఘంవారు ఈ విషయాన్ని బాగా మనసులో వుంచు కోవాలి. కోర్టు, ఆఫీసు, కలెక్టరు, పోలీసు, సూపరింటెండెంటు, ఇంజనీరు, స్టేషన్, రోడ్డు, టికెట్టు, బస్సు, కారు, సైకిల్, టేబిలు, పెన్సిలు, పెన్, వాచి, ఫైలు, కిలోమీటరు, కిలోగ్రాము, డాక్టరు, ఇంజెక్షన్, గ్లాసు, నర్సు టెలిఫోను, టెలిగ్రాము, మొదలైన కొన్ని వందల పదాలు తెలుగుపదాలు అయాయి. వాటికి అర్థంగా కొత్త తెలుగుపదాలను సృష్టించి ఎవరికీ అర్థంకాని భాషను తయారుచెయ్యడం మంచిదికాదు.


POND'S
Calamine
Lotion



ఈనాడు మన తెలుగుభాషలో మాటికి యాభైవంతులకు పైగా వున్న సంస్కృత పదాలుకాక ఎన్నోవేల యితర భాషాపదాలు తెలుగులో కలిసి తెలుగుపదాలుగా వ్యవహారంలో వున్నాయి. అవలు కుర్చీ, మేజా, హాజరు, తివాసీ, కార్ఖానా, పాగా, వాస్తా, తాసిల్దారు, శిరస్తదారు. కచేరి. ఫర్మానా, వర్కారు, షికారు పుకారు లాంటి పదాలు కొన్నివేలు తెలుగుపదాలయినవి. వీటిన్నిటినీ మనం, ప్రజల వాడకంలోంచి బహిష్కరించలేము. కాబట్టి మన పొరుగు రాష్ట్రంలోలాగ కాకుండా, వాడుకలో వున్నపదాలను వాడుకలోనే వుంచ నియ్యడం మంచిది. ఏ భాష అయినా, యితరభాషలనుంచి అనేకపదాలను గ్రహించడంవల్లనే అభివృద్ధి పొందుతుంది. ఈనాటి ఇంగ్లీషు భాషలో, ప్రపంచంలోని అన్నిభాషల పదాలు, తెలుగుపదాలతోసహా, వున్నాయి. మన భావాలు విస్తరిల్లాలంటే, ఇతరుల భావాలను గ్రహించడం ఎంత అవసరమో అలాగే మన భాష అభివృద్ధి పొందాలంటే ఇతర భాషలలోని పదాలను గ్రహించడం అవసరం. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని, అధికారభాషగా వుపయోగించే పదాలను నిర్ణయించడం అవసరం.

## గమనిక

ఈ సంచికలో ఆర్. సంధ్యాదేవి సీరియల్ నవల "సౌందర్య దీపం" అనివార్య కారణాల వలన ప్రచురించలేకపోతున్నాం.

వేడి మీ
శక్తిని పిండి
పిప్పేస్తున్నప్పుడు...



ఇది [illegible]
[illegible]
గ్లూకోన్-డి
యొక్క
కొత్త పేరు

తీసుకోండి **గ్లూకోన్-డి** ®

**అదనపు శక్తి కోసం—**
**అలా మీకు కావలసినప్పుడల్లా**

వేడి వాతావరణం మిమ్మల్ని ఎక్కువ అలసటతో నీరసంగా చేసేస్తుంది. అప్పుడే మీకు కావాలి, చల్లదనాన్ని, ఉత్సాహాన్ని యిచ్చే గ్లూకోన్-డి, మీ కుటుంబాని కంతకీ. పళ్లరసం, పాలు, టీ, కాఫీ, నీళ్లు— దేనిలోనైనా కలిపి తాగండి. లేక అలాగే తీసుకోండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

అందరికీ పరిచయమున్న అదే
ఆకుపచ్చ ప్యాక్‌లో దొరుకుతోంది.




విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్‌తో బలపరచబడిన
అసలైన గ్లూకోజ్ పౌడర్ — గ్లాక్సో సమర్పణ

# ఆధునిక నీతి కథలు



తాళ్లూరు నాగేశ్వరరావు

జానకిరామయ్య ఎలిమెంటరీస్కూలు హెడ్‌మాష్టరుచేసి రిటైర్ అయ్యాడు. ఆయన ఉద్యోగకాలంలో 'దుక్కి-టెద్దు' లాగా పనిచేసే మంచి ఉపాధ్యాయుడు అని పేరు మాత్రం తెచ్చుకున్నాడు గానీ సంపాయించి వెనక వేసింది అయిదు పచ్చనోట్లుకూడా లేవు. అయితే ఆయనకు పిల్లలు ఎక్కువ మంది లేరు. భార్య జానకమ్మ పదహారో ఏటనే కాపురానికొచ్చినా మొత్తం మీద ముగ్గురు పిల్లల్ని కన్నది. ఇద్దరు మగపిల్లలూ, ఒక ఆడపిల్ల. అయితే దుర దృష్టవశాత్తూ ఇద్దరు మగపిల్లలూ రెండేళ్లు నిండకుండానే ఈ లోకంతో తెగ తెంపులు చేసుకొన్నారు- మాయదారి రోగాలు వచ్చి.

ఆ ఆడపిల్లను ఆ దంపతులు అల్లారుముద్దుగా పెంచారు జాగ్రత్తగా చదువు చెప్పించారు. ఊళ్ళో చదువు అయిపోయినా బస్తీకి పంపించి హాస్టల్లో వుంచి, బి. ఎ ఎం. ఏ. చదువు చెప్పించారు. అందగత్తే, బుద్ధిమంతురాలూ అయిన సీతాలత ఏం. ఏ. ఎకనామిక్స్ ఫస్టుక్లాసులో ఉత్తీర్ణురాలైంది.

సీతాలతకు విజయవాడలో ఒక స్త్రీల కళాశాలలో ఏ సిఫార్సు లేకుండానే లెక్చరర్ ఉద్యోగం వచ్చింది

అప్పటికి జానకిరామయ్య రిటైర్ అయ్యాడు.

తల్లిదండ్రుల్ని ఇద్దర్నీ విజయవాడ తీసుకొచ్చింది సీతాలత- వాళ్లను పోషించే బాధ్యతను గుర్తెరిగి

సీతాలత రోజూ కాలేజీకి వెళుతూన్నది.

ప్రతి సంవత్సరం కాలెండరు మారినప్పుడల్లా ఆమెకు ఇంక్రిమెంట్ వస్తోంది.

సీతాలతకు పాతికేళ్ల వయసొచ్చింది. ఆమె లావణ్యశోభ మసకబారు తోంది. మృదుత్వం మొద్దుబారిపోతుంది. గెల వేయని అరటిచెట్టువలె తయారవు తోంది. కాని జానకిరామయ్యగానీ ఆయన భార్యగానీ కూతురికి పెళ్లి ప్రయ త్నాలు తలపెట్టడంలేదు. సీతాలతకు ఆశ్చర్యంగానూ ఆవేదనగానూ వుంది.

కాని నోరుతెరిచి చెప్పుకోలేకపోతోంది. తనకి పెళ్ళిసంబంధాలు తన తల్లి దండ్రులు వెతక్కపోవడంలో అంతర్యాన్ని ఆమె గ్రహించింది. తనకు పెళ్ళి చేస్తే ఇప్పుడు తను సంపాదించేది తమకు దక్కదని, తాము నిశ్చింతగా, సుఖంగా బ్రతకటానికి అవకాశం వుండదని. పిల్లలపట్ల తల్లిదండ్రులకు కూడా ఇలాంటి స్వార్థముంటుందా?

ఓ రోజు జానకిరామయ్య చెల్లెలు వచ్చింది వాళ్ళింటికి చుట్టపు చూపుగా. వెళుతూవెళుతూ అంది వదినతో.

"సీతాలత పెళ్ళెపుడు చేస్తారు? ఇంకా సంబంధాలు చూడటంలేదా వదినా?"

జానకమ్మ మొగుడికేసి మేఘం కమ్మిన మొహంతో చూసింది. జానకి రామయ్య వినిపించుకోనట్టుగా గోడమీద బల్లికేసి చూశాడు.

"మా అమ్మకు ఆ కాలంలో పదహారో యేట పెళ్ళయింది. ఈ కాలంలో నాకు ఎన్నో యేట పెళ్ళిచేయాలో ఇంకా వాళ్ళు ఆలోచించలేదు అత్తయ్యా!" అంది సీతాలత ఉక్రోషంతో కూడుకున్న వ్యంగ్య ధోరణితో.

*ఉద్యోగాలు చేస్తూ సంపాయించే ఆడపిల్లలు ఇంట్లోవుంటే కొంతమంది తల్లిదండ్రులు వాళ్ల పెళ్లిళ్ల జోలి పట్టించుకోరు.*

## జూన్ నెల యువ
## భావ పరిచయ పోటీ

**బహుమానము రూ. 25-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి మే 24 వ తేదీలోగా పంపవలెను.

---

## ఏప్రిల్ నెల యువ భావపరిచయ పోటీ
## రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

"సౌఖ్యానికి వాహనం
సాపాటుకు యాచనం"

బండారు కొండలరావు
వాల్తేరు

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
నాలుగు నూనెల సమ్మేళనం—
కాజుపుట్ (దేవదారు జాతి), లవంగ పట్ట, లవంగ, [illegible]
రెక్సోనాతో స్నానం
చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది.
[illegible]
[illegible]
[illegible]
రెక్సోనా మీ చర్మ
[illegible] కోసం
[illegible]




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

ప్రకృతి రహస్యం కనుగొనబడింది !




# మీ శరీర ఛాయను మెచ్చేలాగ పెంపొందిస్తుంది... సహజంగా, మృదువుగా.

ఫెయిర్ అండ్ లవ్లీ — విజ్ఞానం సాధించిన అద్భుతమైన పరిశోధన — నల్ల చర్మాన్ని ఎర్రబరిచే యీ క్రీమ్ రెండు విధాలుగా పనిచేస్తుంది :

**చర్మం లోపల :** ఫెయిర్ అండ్ లవ్లీలోని ప్రత్యేకమైన పదార్థం చర్మం లోపలనుంచి నల్లబరిచే ఆ ప్రక్రియను తగ్గిస్తూ, యితరులు మెచ్చేలాగ ఎర్రబరుస్తుంది

**చర్మ బయట :** ఫెయిర్ అండ్ లవ్లీలోని 'ఎండను పడబోనే' పదార్థాలు, ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను పడబోని మీ చర్మం ఎండ వల్ల నల్లబడకుండా కాపాడతాయి — మీరైతే ఆ సూర్యకిరణాల్లోని ఆరోగ్య మంతటినీ పూర్తిగా పొందగలుగుతారు.

**6 నెలల వాడకంతో, ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని మీరెప్పుడూ కోరుకునేటంత ఎర్రగా రూపొందిస్తుంది.**







## ఫెయిర్ అండ్ లవ్లీ — నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS.FALOV-13-1810 TE




"మాస్టారూ!"

చల్లని సాయంకాలం వేళ ఆకాశం నిర్మలంగా ప్రశాంతంగా వుంది. మల్లెపందిరి నీడలో వాలుకుర్చీలో కూర్చొని దాదాపు పదిమంది పిల్లలకు పాఠం చెబుతోన్న రాజశేఖరం "మాస్టారూ!" అన్న పిలుపుకు ఉలిక్కిపడుతూ, పాఠం చెప్పడం ఆపి, తలతిప్పి చూశాడు.

చుట్టూ ప్రహరీలా వున్న ముళ్ళకంచె మధ్యలో తలుపులాంటి తడికె, ఆ తడికె దగ్గర నిలబడి తనవంకే చూస్తున్నాడు మురళి. అతని ఎడమచేతిలో తన కుడిచేతిని యిమిడ్చి, అతని ప్రక్కనే నిలబడ్డ ఆ అమ్మాయి [illegible] ఆ అమ్మాయి బహుశా అరుణ అయివుంటుంది.

ఈ వేళప్పుడు, ఇలా ఇంత హఠాత్తుగా వాళ్ళిద్దరూ వస్తారంటే

జరిగిందేమిటో అర్థంచేసుకున్న రాజశేఖరం, పిల్లలను యిళ్ళకు పంపించి, వాళ్ళను లోపలికి తీసికెళ్ళాడు.

"కూర్చోండి! నిలబడిపోయారేం?" అంటూ వాళ్ళవంక చూశాడు. వాళ్ళిద్దరి కళ్ళలో భయం, పిరికితనం, కంగారు లాంటివేం లేవు. తుఫాను తరువాత వుండే ప్రశాంతత వుంది వాళ్ళ మొహాల్లో. వాళ్ళ కళ్ళలో ధైర్యం, తెగింపు, ఆ వెనుక ఆత్మవిశ్వాసం కదిలాయి.

రాజశేఖరం మాటలకు మురళి, అరుణ చటుక్కున వంగి అతని పాదాలను తాకారు. ఆ చర్యకు రాజశేఖరం ఉక్కిరిబిక్కిరై పోయాడు. వాళ్ళను ఏమని దీవించాలో, ఎలా దీవించాలో తోచలేదు. వాళ్ళిద్దరి తలమీద తన రెండు చేతులను వేసి

"కలకాలం, కలిసి జీవించండి బాబూ! ఎలాంటి అవాంతరాలు వచ్చినా ధైర్యంగా కలిసి ఎదుర్కొండి. కాలంతో పోరాడి అయినా కలిసి బ్రతకండి. కలిసినవి మీ రెండుచేతులే కాదు, రెండు మనసులే కాదు, రెండు జీవితాలు. ఇది గుర్తుంచుకోండి." అర్థంకాకుండా గొణుక్కుంటూ దీవించాడు.

"మురళీ! కాఫీ తాగుతారా?" అన్నాడు.

"ఊఁ అరుణకు ఆకలిగా కూడా ఉందనుకుంటాను మాస్టారూ!" అన్నాడు.

రాజశేఖరం లేచివెళ్ళి, ఓ ప్లేట్లో బిస్కెట్లు, నాలుగు అరటిపళ్ళు తీసుకొచ్చి వారికెదురుగా పెట్టి "యివి తింటూ వుండండి. పాలు వేడిచేసి తీసుకు వస్తాను." అంటూ వంటింట్లోకి వెళ్ళాడు

పాలు తాగాక — "కాసేపు విశ్రాంతి తీసుకోండి. మురళీ! అమ్మాయి పేరు అరుణ కదూ! అలా ఆ చాప, దుప్పటి యిచ్చేయ్. ప్రక్క గదిలోకి వెళ్ళి పడుకో అమ్మా!" అన్నాడు అరుణవంక తిరిగి.

అరుణ కదలలేదు. అయోమయంగా రాజశేఖరం వంక మురళివంక చూడసాగింది. రాజశేఖరం వంటప్రయత్నంలో పడ్డాడు.

"మీతో మాట్లాడాలి మాస్టారూ! అరుణ కూడా వుండడం ముఖ్యం" అన్నాడు మురళి.

"అలాగే మాట్లాడొచ్చు! చాలా దూరంనుండి ప్రయాణంచేసి వచ్చారు. కాస్త విశ్రాంతి తీసుకోండి. ఏదైనా మాట్లాడాలంటే రెపుదయం పడుకో మురళీ!" అన్నాడు భోజనాలు పూర్తయ్యాక

మురళి మాట్లాడలేదు.

అరుణ తలెత్తి విస్మయంగా చూసింది రాజశేఖరంవైపు.

"చూడు మురళీ! అమ్మాయి, నువ్వూ అలసిపోయారు. జరిగిందేమిటో నువ్వు చెప్పకుండానే నాకు అర్థమైంది. యిప్పుడు జరగవలసినదాని గురించే కదా నాతో చెప్పాలనుకుంటున్నావ్. రేపు ఉదయం తాపీగా, ఓపిగ్గా, ఆలోచించి మరీ మాట్లాడుకుందాం ఈ రాత్రికి మాత్రం ప్రశాంతంగా నిద్రపోండి" అన్నాడు.

మురళి అరుణవంక చూడ్డంతో వెళ్ళి ప్రక్కగదిలో పడుకుంది. మురళి కూడా రాజశేఖరం ప్రక్కనే పడుకున్నాడు.

ఏదో చెప్పాలని నోరు తెరిచాడు మురళి

"వద్దు మురళీ! వేసిన ముందడుగులో వెనక అడుగు మరచిపోవడం మంచిది రేపు తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. ఆలోచించక పడుకో."

మురళి కళ్ళు మూసుకున్నాడు. కాని అతనికి నిద్ర రావడంలేదు. పక్క గదిలో పడుకున్న అరుణ పరిస్థితీ అలాగే వుంది. పైగా కొత్తచోటు కొత్త జీవితం.

అవును. కొత్త జీవితం.. కొత్త మలుపు

అరుణ, మురళిల ఆలోచనలు సంవత్సరం వెనక్కి తిరిగాయి.

• • •

"నేను బి. ఏ ప్యాసయ్యాను అరుణా!" పిట్టగోడకు అవతల నిలబడి సంతోషంగా చెప్పాడు మురళి.

"నిజంగా!" కళ్ళు పెద్దవిచేసి అడిగింది అరుణ.

"ఊఁ "

"మరి మరి " అంటూ ఆగిపోయింది అరుణ.

"సాయంత్రం కోవెల దగ్గరకు రా అరుణా! మాట్లాడుకుందాం." అన్నాడు

"పిన్ని వద్దంటుందేమో మురళీ!"

"ఏం అనదు రావాలి. ఎలాగైనా రావాలి ఎందుకంటె నేను రేపు . హైద్రాబాద్ వెళ్తున్నాను" అన్నాడు.

అరుణ మొహంలో ఆందోళన.

ఆ సాయంత్రం, కోవెల వెనుక మెట్లమీద కూర్చొని అరుణచేతిని తన చేతిలోకి తీసుకుంటూ—

"యింకా కొన్ని రోజులు అరుణా! రేపే హైదరాబాద్ వెళ్తున్నాను. మావయ్య వాళ్ళింటికి వెళ్తున్నాను. వీలైనంత త్వరలో ఉద్యోగం సంపాదించుకొని "

"మురళీ! ఈ రోజుల్లో ఉద్యోగం దొరకడం అంత సులభం కాదు. రికమెండేషన్లు, లంచాలు యిస్తే కాని దొరకడంలేదుగా "

"అవును. అందుకే మావయ్య యింటికి వెళ్ళడం. ఆయనకు కాస్త పలుకుబడి వుంది ఎలాంటి చిన్న జాబైనా దొరక్కపోదు. పైగా ఆయనే రమ్మని రాసాడు."

"మి మావయ్యకు కూతురుంది కదూ!"

అరుణ కళ్ళలో భయం మురళి సీరియస్‌గా ఓ క్షణం చూసి, అంతలోనే పకపకా నవ్వేసాడు.

"అవును, మామయ్యకు కూతురుంది. కాని ఆమెకు పెళ్ళయిపోయింది. ఒక బాబు కూడా" అన్నాడు. అరుణ కళ్ళలో వెలుగు.

"అయితే ఎన్నాళ్ళవుతుందటావు మురళీ?"

"నా కెలా తెలుస్తుంది. వీలైనంత త్వరగా దొరకాలని ప్రయత్నిస్తాను. నిన్ను విడిచి వుండడం నాకు మాత్రం యిష్టంగా వుంటుందా అరుణా! బాధగా వుండదూ? నేను వెళ్తున్నాననే మాటగాని నా మనసు, ఆలోచనలు నీ చుట్టే వుంటాయ్." అన్నాడు.

అరుణా కళ్ళలో నీళ్ళు నిండాయి.

"అరుణా! నా మీద నమ్మకం లేదూ?" అన్నాడు.

"వుంది మురళీ!" అంది అతని రెండు చేతుల్లో మొహాన్ని దాచుకుంటూ.

"పిచ్చిపిల్లా! అలా ఏడుస్తారా?" అన్నాడు ఆమె మొహాన్ని పైకెత్తుతూ.

"నవ్వాలి! మా అరుణ నవ్వితే ఎంత అందంగా వుంటుందంటే— అమ్మో!" అన్నాడు.

అరుణ నవ్వేసింది.

"అరుణా! ఉత్తరాలు పోస్టుమాస్టారు పేర రాస్తాను. జవాబు రాస్తావు కదూ!" మురళి మాటలకు తలూపింది.

"కామందుగారి అమ్మాయివి! నా ఉత్తరం రాయడం ఆలస్యమైతే కోపగించుకోవు కదూ!" మురళి మాటలకు చిరుకోపంగా చూస్తూ—

"కామందుగారి అమ్మాయివైనా, రేపు నీ నీడలోకి వచ్చేదాన్ని, నీ పై కోపం వుంటుందా మురళీ! అయినా ఆలస్యం ఎందుకవుతుంది? మరిచి పోతే కదూ!"

"అమ్మో మరిచిపోయావంటే, నేను లేనినాడే."

"అరుణా! మన పరిచయం, కలయిక ఆలోచిస్తుంటే గమ్మత్తుగా వుంటుంది కదూ! నువ్వేమో కామందుగారి అమ్మాయివి. నేనేమో మారుమూల రైతుకుటుంబంలో పుట్టినవాణ్ణి. కులం ఒక్కటే కాదు, అంతస్తులో కూడా తేడా వుంది. మన ప్రేమకు అవేం అడ్డురాకపోయినా, పెళ్ళికి యివన్నీ అడ్డు రావూ!" మురళి ఆలోచిస్తూ, ఎటో చూస్తూ అడిగాడు.

"అవును అడ్డువస్తాయ్! అందుకని మనం పెళ్ళిచేసుకోవడం మానా లంటావా? ఈ కులాలు, మతాలు, ఆస్తులు అంతస్తూ, జీవితాలను సుఖంగా సాగనీయవు మురళీ! యివి మనుషులను విడదీయడం తప్ప కలపవు. ఈ విషయం నాకూ తెలుసు నీకూ తెలుసు. అంతేకాదు మనం ఒక్క విషయం తెలుసుకోవాలి! ఈ జీవితాలు మనవి. మనం ఒకరి నొకరం పెళ్ళిచేసుకుంటున్నాం. తప్ప ఈ అంతస్తు ఆస్తులను కులాలను కాదు. మనిద్దరి మధ్య ఒకరిమీద ఒకరికి నమ్మకం అభిమానం, ప్రేమ వున్నన్నిరోజులు మనమెవ్వరికీ భయపడా ల్సిన అవసరం లేదు" అంది దృఢంగా

"ఊఁ ఊఁ పుస్తకాలు బాగా చదువుతున్నావు కదూ!"

"కాదు మురళీ! మనిద్దరి జీవితసమస్య గురించి ఆలోచిస్తున్నాను. మౌనంలో ఆలోచనలు మనిషిని చాలా దూరం తీసికెళ్తాయి."

"ఎంత దూరం?"

"ఈ మనుషులకు, ఈ సమాజానికి ఈ కట్టుబాట్లకు అన్నిటికీ దూరంగా."

"దూరంగా దూరంగా మరి ఎవరికి దగ్గర?"

"నీకే," అంది సిగ్గుపడుతూ.

"ఇన్ని మాటలు మాట్లాడి యిప్పుడిలా సిగ్గుపడతావేం? సరే. చాలా చీకటి పడింది నేనిక వెళ్తాను. రేపే ప్రయాణం కదూ! బట్టలు అవీ సర్దుకోవాలి!" అంటూ లేచి నిలబడి—

"అరుణా! ఎంత ఆలస్యం అయినా, నాకోసం నువ్వు వేచివుంటావు కదూ!" అన్నాడు చేయి చాస్తూ.

చాచిన అతని చేతిని పెదవులకు ఆనించుకుంది అరుణ.

అనుకున్నట్టుగా మురళి ఆ మర్నాడే హైద్రాబాద్ వెళ్ళాడు. కాని, అనుకుంది నంత త్వరగా మాత్రం ఉద్యోగం దొరకలేదు.

ఆరునెలలు గడిచిపోయాయి.

మురళి చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తున్నాడే తప్ప మంచి ఉద్యోగం మాత్రం దొరకలేదు.

అరుణ రాసే ప్రతి ఉత్తరంలో మురళి రాకకోసం ఎదురు చూపు, నిరీక్షణ.

మురళి రాసే ప్రతి ఉత్తరంలో రేపటి గురించి ఆశ, అందమైన కల.

మరో ఆరునెలలు గడిచిపోయాయి.

అరుణకు సంబంధాలు చూస్తున్నారు.

మరో మూడు నెలల్లో అరుణకు సంబంధం ఖాయమైంది.

ఈ విషయం ఉత్తరంలో చదువుతూనే మురళి కేంచేయాలో తోచలేదు.

అరుణ అర్జంటుగా రమ్మంటూ రాయడంతో, మురళికి వెళ్ళక తప్పలేదు.

మురళిని చూస్తూనే అరుణ బావురుమంది.

ముహూర్తం వారం రోజులుంది.

ఏం చేయాలో తోచలేదు.

అరుణ మాత్రం మొండికెత్తింది.

ఏది ఏమైనా సరే నీతో వచ్చేస్తాను మురళీ అంటూ.

మురళి బాగా ఆలోచించాడు. ఆలస్యం చేసినంత మాత్రాన, మంచిరోజు రావడం ఏమో కాని, అరుణ దూరమైపోతుంది.

మురళికి రాజశేఖరం మాస్టారు గుర్తుకొచ్చారు.

ఆ రాత్రి సరిగ్గా పన్నెండు గంటల వేళ- ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళో ఒంటరిగా వున్న రాజశేఖరం మాస్టారింటికి అరుణను తీసుకొని వచ్చేసాడు మురళి.

* * *

మురళితో రాజశేఖరం పరిచయం చిత్రంగా జరిగింది.

ఆ రోజు రాజశేఖరం రైలులో ఒంటరిగా, కిటికీ ప్రక్కనే కూర్చొని ఆలోచిస్తున్నాడు. అతనేం ఆలోచిస్తున్నాడో, ఎక్కడికి వెడుతున్నాడో అతనికి తెలీదు. ఎక్కడ దిగాలనిపిస్తే అక్కడ దిగేయాలని, గమ్యం చివరివరకు టికెట్టు తీసుకున్నాడు.

ఉన్నట్టుండి హఠాత్తుగా పై బెర్తుమీద కూర్చున్న అబ్బాయి వణికిపోతూ, మూలగడం విని ఉలిక్కిపడ్డాడు. రాత్రి ప్రయాణం కాబట్టి ప్రయాణి




కులు చాలా వరకు నిద్రలో వున్నారు. రాజశేఖరం లేచి నిలబడి చూశాడు.

దాదాపు ఇరవైయేళ్ళుంటాయేమో అతనికి. చలి జ్వరం. ఒణుకుతూ వణికిపోతున్నాడు. రాజశేఖరం ఆ అబ్బాయిని జాగ్రత్తగా క్రిందికి దింపి తన దగ్గరున్న దుప్పటి కప్పి గట్టిగా పట్టుకొని కూర్చున్నాడు.

తెలతెలవారుతుండగా రైలు ఓ చిన్న పల్లెటూరిలో ఆగింది. రాజశేఖరం అతణ్ణి దింపి, అక్కడ స్టేషన్‌మాస్టారు సహాయంతో ఆ వూళ్ళో వుండే ఆచారిగారి దగ్గరకి తీసికెళ్ళాడు.

ఒకరికొకరు ఏంకారు. ఆ ఊళ్ళో వాళ్ళకెవరూ తెలీదు. అయినా రాజశేఖరం, అతడికి మందు యిప్పించి, ఆ రోజంతా సత్రంలో గడిపారు రెండోరోజుకల్లా ఆ అబ్బాయికి కొంచెం నయమైంది. అతను పూర్తిగా కోలుకున్నాక, తన ఊరు వెళ్ళిపోయాడు కాని, రాజశేఖరం మాత్రం ఆ ఊళ్ళో స్థిరపడిపోయాడు.

ఈ సంఘటన జరిగి ఐదేళ్ళయింది. ఈ ఐదేళ్ళలో మురళీ రాజశేఖరాల మధ్య స్నేహం బాగా పెరిగింది. మురళి కాలేజికి సెలవులు యిచ్చినపుడల్లా, రాజశేఖరం దగ్గరకి వచ్చేవాడు వయస్సులో దాదాపు ఇరవైయేళ్ళ తేడావున్న వాళ్ళిద్దరిమధ్య మంచి స్నేహం, అంతకుమించిన ఆత్మీయత ఏర్పడింది.

రైలు ప్రయాణంలో ఎంతోమంది కలుస్తారు. ఎంతోమందితో పరిచయం ఏర్పడుతుంది కాని అందరిలో స్నేహం, అనుబంధం పెరగదు, కొందరితో తప్ప. వయస్సులో ఎంతో వ్యత్యాసంవున్న మురళికి రాజశేఖరానికి మధ్య రహస్యాలంటూ లేకుండా పోయాయి.

"మురళీ !" రాజశేఖరం పిలుపుకు లేచి కూర్చున్నాడు మురళి.

"యింకా నిద్రపోలేదూ !" అన్నాడు.

"లేదు మాస్టారూ! కొత్త చోటు కదూ! అందుకే నిద్ర రావడం లేదు." అన్నాడు.

"అదొక్కటేనా కారణం !" అంటూ నవ్వి— బహుశా అరుణకూడా నిద్రపోలేదనుకుంటాను." అన్నాడు.

"అరుణా !" మురళి పిలుపుకు, అరుణ జవాబు పలికింది.

బయట సన్నగా ఈదురుగాలులు మొదలయ్యాయి.

అరుణ లేచివచ్చి కూర్చుంది.

"అరుణా! మురళి నీ గురించి నాకు అంతా చెప్పాడు. మీరాక గురించి ఊహించగలిగానే తప్ప అదింత త్వరగా అనుకోలేదు." అన్నాడు.

మురళి, అరుణ కళ్ళెత్తి చూసారు.

"జరిగిపోయినదానికి బాధపడకుండా, రేపు జరగవలసినదాన్ని గురించి ఆలోచించాలి తల్లీ! చూడు, మీ రిద్దరు ఒకరినొకరు ఇష్టపడి ఎలాంటి వొత్తిడి లేకుండా హృదయపూర్వకంగానే వచ్చారని నేను నమ్ముతున్నాను. కాని ఒక్క విషయం అడగాలనుందమ్మా !"

"మీ ఈ చేతలో ఎలాంటి ఆవేశం, అనాలోచితంగా చేసిన నిర్ణయం లేవు కదూ !" అన్నాడు.

"లేదు మాస్టారూ," ఇద్దరూ ఒకేసారి చెప్పారు.

"ఈ క్షణంలో మీరు తీసుకున్న నిర్ణయం, రేపటి మీ జీవితంలో అవివేకంగా, అనాలోచితంగా చేసినట్లు ఉండకూడదమ్మా. అలాంటి పరిస్థితి వస్తే ఈ క్షణం మీ ఇద్దరి జీవితాలను నరకంగా చేస్తుంది. ఒకరంటే ఒకరికి ప్రాణం, ప్రేమ, అభిమానం అనుకునే మీరు ఒకరినొకరు ద్వేషిస్తూ, అసహ్యించుకుంటూ, విడిపోయే స్థితి రాకూడదనే నా కోరిక. ఇది నీతిబోధకాదు. కథకాదు. కల్పనకాదు. మీ అభిప్రాయాలు మార్చుకోమని కాదు. రేపు మీకు మార్గదర్శకంగా వుండాలనే చెబుతున్నాను. ఇది ఒక అనుభవం. చేదు నిజం తల్లీ." సన్నటిచినుకులతో వర్షం

మొదలై, రానురాను పెద్దదైంది. రాజశేఖరం కిటికీలోనుండి బయటకు చూస్తూ చెప్పడం మొదలుపెట్టాడు—

"ఆ రోజుకూడా యిలాగే ఈదురుగాలులు వీస్తూ సన్నగా వర్షం పడుతోంది. రైలుస్టేషన్ నిర్మానుష్యంగా వుంది మరలి. నేను ఒక్కడినే సిమెంటు బెంచిమీద కూర్చున్నాను. ఒంటరిగా చీకట్లో." రాజశేఖరం చెబుతూనే వున్నాడు. సరిగ్గా పదేళ్ళ క్రిందటి సంఘటన కళ్ళముందు సినిమా రీలులా కదలిపోసాగింది.

* * *

కుండపోతగా కురుస్తోన్న వర్షం। గాలి వీచినప్పుడల్లా విసురుగా మొహాన్ని తడపేస్తోంది.

ఆమె—

అప్పటికే పూర్తిగా తడిసిపోయింది తడిసిన చీర ఆమె వొంటికి అతుక్కుపోయింది. భుజాలనిండుగా వున్న పైట బిగిసుకుపోయింది. నీళ్ళు వోడుతున్న కుచ్చిళ్ళు ఆమె నడక వేగాన్ని తగ్గిస్తూ కాళ్ళకు అడ్డంపడుతున్నాయ్.

అయినా ఆమె నడుస్తోంది.

ప్లాస్టిక్ సంచిని రెండు చేతులతో గుండెలకు హత్తుకుని చీకటిని కబళిస్తోన్న చిరువెలుగును చీలుస్తూ, ఆమె చూపు అల్లంత దూరంలో కన్పిస్తోన్న లైటువెలుగు ఆ వెలుగు నిండిన రైలుస్టేషన్ వైపు.

ఆమె అడుగుల వేగం పెంచుస్తూ, గబగబా నడవడానికి ప్రయత్నిస్తూ, ఆమె స్టేషన్‌కు చేరుకున్నది

యింకా తెల్లవారలేదు. తెల్లవారడానికి చాలా టైముంది. రెండురోజులుగా పడుతున్న ముసురు ఆ రాత్రి మరింత పెరిగిందే తప్ప తగ్గలేదు.

గేటు తీసుకొని ప్లాట్‌ఫాం మీదికి అడుగుపెట్టిందామె.

స్టేషన్ అంతా పలుచటి వెలుగు పరుచుకొని వుంది. అక్కడక్కడ జనం ముణగదీసుకొని పడుకొని వున్నారు.

ఆమె రావిచెట్టు క్రిందవున్న సిమెంటు బెంచి వంక పరీక్షగా చూసింది.

ఖాళీగా వుంది సిమెంటు బెంచి.

ఆమె మనసులో ఏదో అనుమానం.

చిరుగాలిలా భయం ఆమెను తాకడంతో ఉలిక్కిపడిపోయి, అంతలోనే

.. "ఛ " అనుకుంటూ, మరోసారి పరీక్షగా ప్లాట్‌ఫాం అంతా కలయ చూసింది.

నిశ్శబ్దం రాజ్యంచేస్తున్నట్టుగా వుంది.

కాలం నిశ్శబ్దంలో కదలి కరిగిపోతోంది.

గాలి విసురుగా వీచింది.

వర్షానికి తడుస్తూ. చలికి వణికిపోతూ, చెట్టుక్రింద నిలబడ్డ ఆమె విసురుగా వీచిన గాలికి, జల్లులా చినుకులు రాలడంతో, ఒక్క అడుగు ముందుకు వేసింది.

అంతలోనే ఏదో అనుమానం.

తను అక్కడే వుండాలి. ఎంత వర్షం వచ్చినా సరె. పిడుగుపడినా సరె అక్కడ్నుండి కదలకూడదు.

కదిలితే—

తాను అనుమానపడ్డం నిజం అయితే—

ఓహ్ భయంతో క్షణంపేపు వణికిపోయిందామెక.

పెద్ద మెరుపు కళ్ళు మూసుకుపోయేలా

ఆ వెనక

పెద్ద చప్పుడుతో ఎక్కడో పిడుగుపడ్డట్టు

వొళ్ళు జలదరించిపోయిందామె.

దూరంగా ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు. కిర్రు చెప్పుల చప్పుడు

ఆమె కళ్ళు చిట్లించి చూసింది.

ఎవరో గబగబా వస్తున్నారు.

ఆమె అక్కడ్నుండి కదిలి చెట్టువెనక్కి వెళ్ళి నిలబడిపోయింది.

అతనెవరో. వెళ్ళిపోయాడు.

ఆమె గాఢంగా నిట్టూర్చి, గేటువంక చూసింది. ఎవరూ రావడం లేదు.

తూర్పు తెలవారుతోంది.

వర్షం కొంచెం తగ్గుముఖం పట్టింది. ఏదో అనుమానం, భయం-పీడలా తనను వెంటాడుతున్న భారం ఉండి ఉండి గాలి రివ్వున వీస్తోంది.

వెయిటింగ్ రూమ్‌లోనుండి బయటకు వచ్చిన అతను .. ఎవరికోసమో

అన్నట్టుగా వెదికే ప్రయత్నంలో వుండగానే ఆమె కన్పించింది. అతని కళ్ళలో ఏదో వెలుగు .

"పూర్తిగా తడిసిపోయావు కరుణా!" అన్నాడు

"ఊఁ...." అంది అతనివంకే చూస్తూ. అతని మొహంలో ఎలాంటి భావం కదలడంలేదు. జరుగుతుంది అతి సామాన్యంగా జరిగేటప్పుడు కలిగే నిర్వికారం, నిర్లిప్తత విశ్చలత్వం.

కరుణ మనసెందుకో చివుక్కుమన్నది.

తాను రావడం, అతనిలో ఎలాంటి భావాన్ని కలిగించలేదేమిటి! తన రాక అతని కిష్టమే కదూ

"త్వరగా వెళ్ళి బట్టలు మార్చుకో కరుణా! రైలు వచ్చే వేళవుతోంది." అన్నాడు. ఆమె మొహంలో కదిలే భావాలను పసిగడ్తూ, ఆమె ఆలోచనలను అంతలోనే తుంచేస్తూ.

కరుణ వెయిటింగ్ రూమ్‌లోకెళ్ళి, పది నిమిషాల్లో పొడిబట్టలు కట్టుకొని తడిబట్టల నీళ్ళు గట్టిగా పిండేసి, తన దగ్గరున్న సంచిలో పెట్టుకుంది.

ఆమె బయటకు వచ్చేసరికి, అతను గాజుగ్లాసులో వేడివేడి కాఫీ తీసుకువచ్చాడు.

మౌనంగా కాఫీగ్లాసు అందించాడు.

"ఇవాళ రైలు గంట లేటుట" అన్నాడు కాసేపటికి.

"యింకానా!" అంది భయంగా.

"ఏం!" అన్నాడు.

"చాలా తెలవారిపోతుందేమో రాజూ!" అంది దిగులుగా.

రాజు చిన్నగా నవ్వేస్తూ– "నేనున్నాగా కరుణా!" అన్నాడు ఆమె భుజాన్ని మృదువుగా తడుతూ.

కరుణ కళ్ళెత్తి చూసింది. అతని కళ్ళలో తన రూపం చాలా స్పష్టంగా చూసుకోగలిగింది కరుణ. అతని మాటల్లో కదిలిన ధైర్యానికి, తనకున్న ఆలందన, కఠినను అంతవరకు వెన్నాడిన అనుమానం దూరంగా వెళ్ళిపోయింది.

"నేను వచ్చి చాలాసేపైంది రాజూ! నువ్వు ఆ రావిచెట్టు క్రిందున్న సిమెంటుబెంచి దగ్గిరే కూర్చుంటానని అన్నావుగా, అందుకని అక్కడే నిలబడి పోయాను" అంది.

"ఊఁ..." అన్నాడు.

"నాకోసం చూశ్చేదూ!" అన్నాడు.

"నేను రాలేదని, రానని అనుకున్నావా!" అన్నాడు

"లేదు " అంది లోపల. అంతరాత్మ అబద్ధం చెబుతున్నదని అరుస్తోంది.

రాజు చిన్నగా నవ్వేస్తూ— "నామీద నీ కామాత్రం నమ్మకం వుండటం మంచిది కరుణా! యిప్పుడు మనిద్దరి మధ్య వుండాల్సింది ఒక్క ప్రేమ కాదు. నామీద నీకు, నీమీద నాకు నమ్మకం. సదభిప్రాయం ఒకరి గురించి మరొకరు ఆలోచించుకోవడం. నా కష్టాలను నువ్వు పంచుకునే ఓర్పు, నీ కన్నీళ్ళను నేను తుడవగలిగే శక్తి ఇవన్నీ వుంటే మనిద్దరి మధ్య వుండే ప్రేమ, అనుబంధం మనల్ని విడదీయవు." రాజు పాఠంలా చెబుతుంటే, వింటూ నిలబడిపోయింది కరుణ!

తన లోపలి మనిషి నెవరో నిలువునా పరీక్షిస్తున్న భావం, రాజుకు అద్దంలా తన మనసు కన్పిస్తోందన్న నిజం కరుణను స్తబ్ధురాలిగా చేసాయి.

"నువ్వు తప్పకుండా వస్తావని నాకు నమ్మకం వుంది కరుణా! రైలు టైము దాటిపోయినా నేను నీకోసం యిక్కడే వుండేవాడిని. నేనా సిమెంటు బెంచి దగ్గరే వుండేవాడిని కాని.... నేను స్టేషన్‌కు వచ్చాక. ఓ రైలు వచ్చింది. దాంట్లో ముకుందం దిగాడు. వాడింకా యింతవరకూ వున్నాడు. వాడికేమాత్రం అనుమానం రాకూడదనే నేను ఈ వెయిటింగ్ రూమ్‌లో కూర్చున్నాను."

"ముకుందమా!"

కరుణ కళ్ళలో కంగారు. తనకోసం కాచుకున్న రాబందులాంటివాడు ముకుందం.

"అవును. యింకాకే వెళ్ళిపోయాడు," అన్నాడు రాజు.

"తనను చూసివుంటాడా! కానా చెట్టుక్రింద నిలబడివుండడం చూస్తే" కరుణ నిలువునా వణికిపోయింది.

"మనం త్వరగా వెళ్దాం రాజూ " అంది.

"తెల్లవారకముందే వెళ్ళిపోతాం కరుణా! అయినా యింకా నీలో ఈ భయం... "

"నీ కర్థంకాదు రాజూ! ఏ ఒక్కరివల్ల, ఒక కారణం వల్ల నేను నీకు దూరం కాకూడదు." అంది ఆవేశంగా.

"నీకు ఆవేశం ఎక్కువ కరుణా! దానికి ఆలోచన తోడైతే "

"అంటే— ఇప్పుడు నేను చేస్తున్నదాంట్లో ఆవేశం తప్ప ఆలోచన లేదనా?" అంది ఉక్రోషంగా.

రాజు అందంగా నవ్వేస్తూ— "కోపం కూడా ఎక్కువే. యింకా... ఏమేం ఎక్కువో" అన్నాడు.

కరుణ ఏదో అనేలోగానే, దూరంగా రైలువచ్చే సూచనగా గంట మ్రోగింది.

మరో పదినిమిషాల్లో రైలు వచ్చి ఆగింది.

కరుణ రాజు చేయిపట్టుకొని ముందుకు కదిలింది.

కిటికి ప్రక్కనే చోటు దొరికింది. కూర్చున్న ఐదు నిమిషాలకు రైలు కదిలింది. కాని ఆ ఐదు నిమిషాలు కరుణకు గంటలుగా మారిపోయాయి. మాటిమాటికి ఆమె చూపు గేటువైపు పరిగెత్తి వెనక్కి సంతృప్తిగా తిరిగివచ్చేది.

రైలు కదిలింది. ఆ పల్లెటూరి పరిసరాలను దాటుతూ పరుగు అందుకుంది. కరుణ తేలికపడ్డ మనసుతో సీటువెనక్కి చేరగిలబడిపోయింది. ఒక్కసారిగా తండ్రి గుర్తుకు వచ్చాడు.

* * *

దుమ్మురేపుకుంటూ ఆగింది బస్సు.

నెమ్మదిగా బస్సు దిగాడు రాఘవయ్య మాస్టారు.

గుండె నిండా దిగులు తన అసమర్థత తన బడిపంతులు జీవితం అన్నీ గుర్తుకు రావడంతో ఎక్కడలేని నీరసం ఆవరించిం దాయనను. కాళ్ళీడుస్తూ ముందుకు కదిలాడు.

రాఘవయ్య మాస్టారు యింటికి వచ్చేసరికి యిల్లంతా గోలగా వుంది. పిల్లలు నలుగురూ గోలగా అరుస్తూ వరండాలో ఓ చిన్న సైజు యుద్ధం చేస్తున్నారు. ఒక్క గావుకేకతో వాళ్ళందర్నీ బయటకు తరిమేసి, అక్కడే వరండాలో వున్న వాలుకుర్చీలో కూలబడిపోయాడు.

అతని మనసంతా ఆందోళనగా మెదడంతా ఆలోచనలతో గజిబిజిగా వుంది. అలసటగా కుర్చీ వెనక్కి వాలి, కళ్ళు మూసుకున్నాడు.

"మంచినీళ్ళు." అంది అతని గావుకేకను విని మంచినీళ్ళు తీసుకు వచ్చిన పార్వతమ్మ.

అతను కళ్ళు తెరచి, గ్లాసు అందుకోవడానికి ముందుకు లేవబోయాడు. అతనికి కరుణ గుర్తుకువచ్చింది.

"వాళ్ళు ఏమన్నారూ?" అంది పార్వతమ్మ ఆత్రుతగా.

రాఘవయ్య జవాబివ్వలేదు. మంచినీళ్ళు తాగి కుర్చీ వెనక్కి వాలి మౌనంగా కళ్ళు మూసుకున్నాడు.

అతని మౌనాన్ని అర్థంచేసుకొని లోపలికి వెళ్ళిపోయింది పార్వతమ్మ.

మరో అరగంటకు బయటకు వెళ్ళిపోయిన నలుగురు పిల్లలు లోపలికి వచ్చారు.

తండ్రి మౌనం, తల్లి గంభీరంగా వుండడం చూసి, నిశ్శబ్దంగా అన్నాలు తినేసి నిద్రలోకి జారుకున్నారు.

రాత్రి ఏడు గంటలు దాటింది. యింట్లో కరుణ అలికిడి విన్పించలేదు.

రాఘవయ్య లేచి యింట్లోకి వెళ్ళాడు వంటింటి గుమ్మంలో కూర్చొని ఆలోచిస్తున్న పార్వతమ్మ, రాఘవయ్య అడుగుల చప్పుడుకు లేచి, "వడ్డించనా?" అంది.

"కరుణ కన్పించదేం?" అన్నాడు భోజనానికి కూర్చుంటూ.

"శ్యామలవాళ్ళింట్లో పేరంటం. భోజనానికి అక్కడే వుండమందిట శ్యామల" అంది.

"ఊఁ "

"కట్నం ఐదు వేలకు తగ్గదని ఖచ్చితంగా చెప్పారు పార్వతీ. పైగా లాంఛనాలు మూడు వేలు. పెళ్ళి ఖర్చులో మొత్తం పదివేలు " అన్నాడు రాఘవయ్య.

"మరి మీ రేమన్నారూ?"

"రెండు రోజుల్లో కబురుచేస్తానని చెప్పాను."

"ఆదేం!?"

"మన పూజారి యింటిపక్కనుండే సోమయాజులు కూతురును కూడా మన కరుణను చూసిన రోజే చూసి వెళ్ళారట. అమ్మాయి అంతగా నచ్చలేదు కాని, సోమయాజులు కట్నం ఏడువేలు యిచ్చి లాంఛనాలు జరిపిస్తానన్నాట్ట. వాళ్ళేమో కట్నం పదివేలు అన్నారట సోమయాజులు యింకా ఏ విషయం తేల్చలేదట."

"ఎవరు చెప్పారూ?"

"ఎవరో చెప్పారు. చెప్పిన విషయం మాత్రం నిజమే. అలా. బేరా లాడుతూ, అటూ యిటూ కూడా చూసుకుంటూ గోడమీది పిల్లిలా ఎవరెక్కువ




యిస్తే ఆటు మొగ్గాని చూస్తున్న వాళ్ళు నాకేం నచ్చలేదు. వాళ్ళింట్లో కరుణ సుఖపడుతుందనుకోను. పిల్లకంటె కూడా డబ్బు ముఖ్యంగా తలచేవారు రేపు కరుణను చక్కగా చూసుకుంటారా? వాళ్ళు మంచి వాళ్ళయితే తనఖాలో వున్న ఈ యిల్లు కొస్తా అమ్మేసి, నా ప్రావిడెంటు ఫండుతో, ఎలాగో పెళ్ళి జరిపిద్దామని వాళ్ళతో చెప్పి బస్టాండుకు వచ్చాను। సోమయాజి కనిపించాడు."

"అతడు వాళ్ళింటికని నాకు తెలీదు. అతను వెళ్ళి ఓ గంటలో తిరిగి వచ్చాడు. బస్సు రాకపోవడంవల్ల నేను అక్కడే వున్నాను. అప్పుడు చెప్పాడు. కుర్రాడి పేరు, ఉన్న వీధి కనుక్కున్నాను."

" "

"నువ్వేమంటావ్ పార్వతీ?"

" " ఆలోచిస్తూ మౌనం వహించింది పార్వతమ్మ.

"నన్నేం చేయమంటావ్ చెప్పు?"

"మీరిలా సోమయాజి చెప్పాడని ఊరుకోకండి. వాళ్ళకా అమ్మాయి నచ్చలేదేమో! అందుకే కట్నం ఎక్కువ అడిగారేమో! మిమ్మల్ని ఏడువేలు

ఆడగలేదంటే అర్థం ఏమిటి? కరుణ నచ్చిందనేగా. యిక కరుణ కష్టసుఖా లంటారా? దాని రాత ఎలావుంటే అలా అవుతుంది. పెళ్ళి చేసేవరకు మన బాధ్యత."

పార్వతమ్మ మాటలకు రాఘవయ్య ఆలోచనల్లో పడ్డాడు. ఆమె మాటల్లో నిజముందనిపించింది.

"దానితో ఆడిపాడినవాళ్ళంతా పెళ్ళిళ్ళు చేసుకొని కాపురాలు చేసు కుంటూ, పిల్లలను కంటున్నారు. దాని మనసెంత కుమిలిపోతుందో! నేనెంత వలిగిపోతున్నానో ఆలోచించండి. మన మింకా మీనమేషాలు లెక్కిస్తూ కూర్చుంటే, దానికిక పెళ్ళీడు కాస్తా దాటిపోతుంది."

"ఆలోచిస్తుంటే మనం కొంత అదృష్టవంతులం అని చెప్పాలి. కరుణ పుట్టాక పదేళ్ళవరకు మళ్ళీ పిల్లలు లేరు. ఆ తరువాత ఈ నలుగురు వెధవలు పుట్టారు. మగపిల్లలు. వాళ్ళ బతుకు వాళ్ళు బతుకుతారు. వాళ్ళగురించి మీరు బెంగపడకండి. మీ రన్నట్టుగా తనకూవున్న ఈ యిల్లు అమ్మేయండి. దాని పెళ్ళికావడం ముఖ్యం ఆ తరువాత మనం ఎలావున్నా ఎవరూ పట్టించు కోరు. వయసు వచ్చిన ఆడపిల్లను ఎన్నాళ్ళని గుండెలపై కుంపటిలా "

పార్వతమ్మ మాటలకు తలూపాడు రాఘవయ్య.

"మీరు రేపుదయమే పెళ్ళి నిశ్చయం చేసుకొని రండి " అంది పెరుగు వడ్డిస్తూ.

"రేపు మంచిరోజు అవునో కాదో ."

పార్వతమ్మ గబగబా వెళ్ళి క్యాలెండరు తీసుకువచ్చి అందించింది.

"రేపు అష్టమి ఎల్లుండి నవమి ఆ తరువాత దశమి బావుంది పార్వతీ."

"రెండు రోజులా అంతలోగా "

"సోమయాజి మాత్రం ఎలా వెడతాడే రోజు మంచిగా లేదుకదా!" అన్నాడు.

పార్వతమ్మ సంతృప్తిపడిపోయింది

రాఘవయ్యకు గుండెమీద బరువేదో దిగిపోయినంతగా తేలికపడి పోయాడు

"కరుణ యింకా రాలేదేం?" రాఘవయ్య ఏదీనంత చూస్తూ అడిగాడు.

"ఈ పాటికి వస్తూవుంటుంది" అంది పార్వతమ్మ.

ఆమె అన్నట్టుగానే కరుణ బయలుదేరింది శ్యామల యింటినుండి–

"ఒక్కర్తివే వెళ్ళగలవా?" అంది శ్యామల వొళ్ళో వున్న పసిపాపను ఊయల్లో పడుకోబెడుతూ.

"ఊఁ . ఉన్న ఊళ్ళో భయమేంటి?" అంది కరుణ.

"అయితే వుండు ." అంటూ లోపలికి వెళ్ళి ఓ కాగితంపొట్లం తీసుకు వచ్చి యిస్తూ, "తమ్ముళ్ళకియ్యవే ఈ లడ్డూలు" అంది

కరుణ ముందుకు కదలబోయింది.

"మళ్ళీ ఎప్పుడొస్తావే?"

"నువ్వు వెళ్ళేలోగా వస్తాను" అంది కరుణ.

కరుణ గుమ్మందాటి రోడ్డుమీదికి వచ్చేసింది.

శ్యామల యింటినుండి కరుణ వచ్చేవరికి రాఘవయ్య నిద్రపోయాడు. ప్రయాణపు బడలికవల్ల అతనికి గాఢంగా నిద్రపట్టింది.

శ్యామల యిచ్చిన లడ్డూల పొట్లం తల్లికిస్తూ "నాన్న భోజనం చేసారా అమ్మా?" అంది

"ఆఁ!" అంటూ కూతురు మొహంలోకి చూసింది పార్వతమ్మ.

కరుణ కళ్ళలో ఏదో తెలుసుకోవాలన్న ఆత్రుత కన్పించడంతో—

"దేవుడి దయవల్ల . నీ పెళ్ళి నిర్ణయం అయిపోయినట్టేనే కరుణా! నాన్నగారు మరో రెండురోజుల్లో వెళ్ళి నిశ్చయంచేసుకుని వీలైతే ముహూర్తాలు కూడా పెట్టుకొస్తారు" అంది సంతోషంగా.

తాను తెలుసుకోవాలనుకున్నది తన పెళ్ళి విషయం గురించే అయినా, వినాలనుకున్నది మాత్రం ఆ వార్త కాకపోవడంతో కరుణ ఉలిక్కి పడిపోయింది

కరుణకు చెప్పాల్సింది అంతే తప్ప, కట్నాల గొడవ, సోమయాజి కూతురు సంగతి కాకపోవడంతో, చెప్పడం అయిపోయినట్టుగా, వంటింట్లోకెళ్ళి, లడ్డూల పొట్లాన్ని డబ్బాలో పెట్టివస్తూ, "పడుకోవూ కరుణా?" అంటూ యింకా ఆలోచిస్తూ నిలబడ్డ కరుణను పిలిచింది.

కరుణ యాంత్రికంగా వచ్చిందేకాని, నిద్రపోలేకపోయింది. చాలా రాత్రి గడిచిపోయింది– ఆలోచనలతో నిద్రకు దూరమైన కరుణ, ఏదో నిర్ణయానికి వచ్చినట్టుగా హఠాత్తుగా లేచి కూర్చుంది.

లైటువేసి, పుస్తకం మధ్యలో దాచిన కవరు తీసుకొని, రెండు పంక్తు

లలో ఉత్తరం రాయడం పూర్తిచేసి, తేలికపడ్డ మనసుతో వెళ్ళి పడుకుంది. ఏవో కొత్త ఊహలతో మనసు మరో లోకానికి ఎగిరిపోయింది.

ఆ రాత్రి త్వరగా నిద్రపోనందుకేమో, కరుణ మరునాడు ఉదయం అలస్యంగా నిద్రలేచింది.

మొహం కడుక్కుని వచ్చిన కరుణ ఎవరూ చూడకుండా జాగ్రత్త పడుతూ, రాత్రి తాను రాసిన కవరును పోస్ట్‌లో పడేసివచ్చింది

యింటిముందే పోస్టుడబ్బా ఉండడంవల్ల, కరుణ బయటకు వెళ్ళినట్టు కన్పించలేదు.

కరుణ వంటింట్లోకి వెళ్ళేసరికి, తల్లి కూరలు తరుక్కుంటోంది. మరో సారి, మరో రోజైతే తిట్టేదేమోకాని, ఆరోజు కరుణను ఏమీ అన్లేకపోయిందావిడ.

గిన్నెలోని కాఫీని వెచ్చబెట్టుకు తాగుతున్న కూతురుతో "యికనైనా కాస్త పెందలకాడే లేవడం అలవాటుచేసుకో కరుణా !" అంది.

కరుణ మాట్లాడలేదు.

"ఆడపిల్లవు ఒక్కత్తివని కాస్త గారాం చేసాం. మా యింట్లో నువ్వు ఏ పని చేయకున్నా చెల్లుతుంది. కాని . రేపు అత్తారింటికి వెడితే తెలుస్తుంది. వాళ్ళూరుకుంటారా " పార్వతమ్మ మాటలను మధ్యలోనే తుంచుతూ — "యిప్పుడేం పనుందో చెప్పమ్మా !" అంది విసుగ్గా.

పార్వతమ్మ నిర్ఘాంతపోతూ— "ఇదేం చోద్యమే పెళ్ళి విషయం చెబితే అలా విసుక్కుంటావూ ?" అంది.

"నాన్న లేరేమిటి ?" అంది అంత పొద్దున్నే తండ్రి ఎక్కడికి వెళ్ళాడో అర్థ కాక.

"ఇల్లు బేరం పెట్టడానికి వెళ్ళారు" అంది.

"ఎందుకు ?"

"నీ పెళ్ళికోసం... మరి మన దగ్గర అంత డబ్బెక్కడిది" అంటూ విషయాన్ని చెప్పింది.

"మీరంతా ఎక్కడుంటారమ్మా!" అంది బాధగా.

"ఎక్కడున్నా రోజులు గడిచిపోతాయి కరుణా ? నీ పెళ్ళి ఒక్కటే మాకు సమస్య గాని ఏ అద్దె యింట్లోనో రోజులు గడిచిపోతాయి," అంది పార్వతమ్మ.

కరుణ తల్లి మొహంలోకి ఓసారి చూసి లేచి బయటకు వెళ్ళిపోయింది.

మనసంతా ఆందోళనతో నిండిపోయింది. నలుగురు తమ్ములతో, తండ్రి, తల్లి ఎలా వుంటారో, వాళ్ళ చదువులకు యిక నాన్నదగ్గర మిగిలేదేమిటి? దోపిడిదారులా వున్నదంతా తాను ఊడ్చుకొని వెళ్ళిపోతే ఎలా? వాళ్ళ కన్యాయం చేసినట్టు కాదూ? నాన్నకు నిజం చెబితే

ఊహూఁ తన కాళ్ళు చేతులు కట్టేసయినా ఈ పెళ్ళి జరిపిస్తాడు తప్ప అర్థంచేసుకోడు. అమ్మకు చెప్పినా లాభం లేదు అంగీకరించదు. కనీసం తన నిర్ణయాన్ని హర్షించరు బహుశా ఏ తల్లీ తండ్రీ హర్షించి అనుమతించరు.

తాను చేయాలనుకున్నది ఎలగూ చేస్తుంది. అలాంటప్పుడు ఈ యిల్లు బేరం పెట్టకుండా ఆపాలి ఎలా? ఏం చేయాలి? నాన్న వస్తేకాని ఈ యిల్లు ఎవరు కొంటున్నారో తెలీదు. తెలిసినా తానేం చేయగలదు? బేరం కుదరకముందే తాను వెళ్ళిపోవాలి.

అవును. అంతే.

ఆ సాయంత్రం రాఘవయ్య మాస్టారు పార్వతమ్మతో చెప్పాడు. సోమయాజి ఆ సంబంధం ఖాయపరుచుకుంటున్నట్టు ఎవరితోనో కబురు చేసాడట అని.

పార్వతమ్మ మాత్రం – "ఎందుకైనా మంచిది, మీరు ఎల్లుండి పొద్దున్నే వెళ్ళరండి అంది."

రాఘవయ్య మాటలు వింటూనే పార్వతమ్మ బావురుమంది.

"ఈ జన్మలో దానికి పెళ్ళయ్యే యోగం వుందంటావా?" అంది.

"ఛ ఊరుకో పార్వతీ! దాని దురదృష్టానికి మనం ఏం చేయగలం! పెళ్ళికొడుకుల మార్కెట్టులో రేట్లు పెరిగాయి. ఆడపిల్లల తల్లితండ్రులకు పోటీ పెరిగిపోయింది పార్వతీ. తప్పదు. మనకు కరుణ గురించి ఎంత బెంగగా వుంటుందో సోమయాజికీ అంతే. పైగా వాళ్ళకు డబ్బే ముఖ్యంగా కన్పిస్తోంది. అలాంటప్పుడు మనం బాధపడ్డం అవివేకం" అన్నాడు గంభీరంగా.

"చివరికి మనం అలా అనే సరిపెట్టుకోవాలి." అంది పార్వతమ్మ కళ్ళు తుడుచుకుంటూ.

తల్లితండ్రుల సంభాషణ విని కరుణ నవ్వుకుంది.

తెల్లవారితే–

తన సమస్య పరిష్కారం అవుతుంది.

తండ్రి తన గురించి మరో సంబంధం వెతకాల్సిన అవసరం ఉండదు. తనకోసం యిల్లు అమ్మాల్సిన అగత్యం ఉండదు. తన పెళ్ళికోసం అమ్మ బాధపడాల్సిన అవసరం వుండదు. అవకాశం వుండదు.

తను వెళ్ళిపోయినందుకు బాధపడతారేమో? రాజుతో అని తెలిస్తే తిట్టుకుంటాడు తన తండ్రి. అంతే—

కరుణ అంతకంటే ఎక్కువ ఆలోచించలేకపోయింది. కన్నతల్లి తండ్రి తన గురించి ఎంత బాధపడతారో! ఆ ఊళ్ళో ఎలా తలెత్తుకోవాలో తెలీక కుమిలిపోతారో ఊహించలేదు. అలా వెళ్ళిపోవడంలో తనేదో త్యాగం చేస్తున్నాననే, తన తమ్ముళ్ళకు యిల్లు తల్లితండ్రికి పెళ్ళువ నీడ మిగులుస్తున్నాననే అనుకుంది.

*　　　　*　　　　*

రాజా!

"ఈ ఉత్తరం అందగానే వెంటనె బయలుదేరు. ప్లీజ్. ఆలస్యం చేయకు. నీ కోసం ఎదురుచూస్తుంటాను"

కరుణ.

ఉత్తరం చూస్తూనే గాబరాపడిపోయాడు రాజు. విశేషాలు, విషయాలు ఏంలేని ఆ ఉత్తరం అతనిని కంగారుపెట్టింది.

ఏం జరిగి వుంటుంది?

తమ విషయం మాస్టారుకు తెలిసిపోయిందా? లేక....

లేక కరుణకు పెళ్ళి సంబంధం స్థిరపడిపోయిందా?

అంతే అయ్యుంటుంది.

లేకపోతే యింత అర్జంటుగా ఉత్తరం రాయదు.

ఒకవేళ అదే జరిగితే — ఎలా?

యిప్పుడేం చేయాలి?

తా నెలాటి నిర్ణయం తీసుకోవాలి?

కరుణను కాదనలేడు. వొదులుకోలేడు

ఎందుకంటే — కరుణను తను ప్రేమించాడు. చిన్నప్పటి స్నేహం పెరిగి పెరిగి ప్రేమగా మారింది. కాని, తనంటె మాస్టారుకు ఇష్టం వుండదు. తను ఆయన దగ్గరే చదువుకున్నాడు. వారాలు చేసుకొని తల్లి తండ్రి లేని




తనను అమ్మమ్మ చేరదీసింది. చదువు చెప్పించే స్థోమత ఆవిడకు లేకపోవడంతో ఊళ్ళో నలుగురు పెద్దమనుషుల యిళ్ళలో వారాలు చేసుకుని స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాడు. అంతేకాదు, తాను బ్రాహ్మడు కాడు. మాస్టారుకు కులం పట్టింపు చాలా వుంది.

మాస్టారు తనతో కరుణ పెళ్ళికి ఒప్పుకోడు.

ఈ విషయం కరుణకు తెలుసు.

"మాస్టారు ఒప్పుకోరు కరుణా!"

"నాకు తెలుసు."

"తెలిసి కూడా . "

"అవును. తెలిసి కూడా నేను నిన్ను ప్రేమించకుండా ఉండలేక పోతున్నాను రాజా! నువ్వంటే నా కిష్టం. నాన్న కొరకునే కులపట్టింపు గురించి నేను నా మనసును చంపుకోను."

"కావి మాస్టారును కాదని మనం పెళ్ళి చేసుకోలేము కరుణా."

"ఏం? ఎందుకు చేసుకోలేం. లోకంలో ఎంతోమంది ప్రేమించి పెళ్ళి చేసుకుంటున్నారు!"

"ఎవరు చెప్పారు?" నవ్వుతూ అడిగాడు.

"ఎవరో ఏమిటి? నాకు తెలియదనా?"

"పుస్తకాల్లో చదివిందేనా?"

"అవును. పుస్తకాల్లోని పాత్రలు మాత్రం వాస్తవంలో వుండరా?"

"వుంటారు కాని కరుణా. ఊహకు అనుభవానికి చాలా వ్యత్యాసం వుంటుంది. ఆదర్శానికి, ఆచరణకు చాలా దూరం కరుణా."

"కరుణా! పుస్తకం చదవడం. అర్థంచేసుకోవడం కాదు .. నవలలోని పాత్రల కష్టనష్టాలు, సుఖదుఃఖాలు సాధకబాధకాలు, ఎదురయ్యే సమస్యలు, వొడిదుడుకులు అనుభవానికి తెచ్చుకోగలిగితే, నవల ముగింపులోని పరిష్కారానికి చేరుకోవడం ఎంత కష్టమో, ఎంత అసాధ్యమో తెలుస్తుంది. కాని పేజీలు తిరగేసి, ముగింపుతో మురిసిపోతే ఎలా? అదే ఎంతో గొప్పగా తలచి ఓ నిర్ణయానికి రావడం ఎంత అమాయకంగా వుంటుంది."

"ఇందుకు నువ్వు చెప్పేదేమిటి?" తీవ్రంగా చూస్తూ అడిగింది కరుణ.

"నువ్వో నిర్ణయానికి వచ్చేముందు బాగా ఆలోచించు కరుణా! నాకంటూ ఎవరూలేరు అడ్డుచెప్పడానికి. నాకు నువ్వు కావాలి, నీ ప్రేమ కావాలి. కాని ఆ రెండింటికంటే కూడా నాకు నీ సుఖసంతోషాలు కావాలి. నానుంచి నీకు ఎలాంటి అడ్డంకులు వుండవు. కాని నువ్వే బాగా ఆలోచించు."

"ఆలోచించి నా నిర్ణయం మారితే."

"నీ నిర్ణయం ఎలాంటిదైనా నాకు సంతోషమే కరుణా? నీ నిర్ణయాన్ని నేను మనస్ఫూర్తిగా ఆమోదిస్తాను." అన్నాడు.

"అయితే నా మీద నీకు ప్రేమ లేదా రాజూ?" అంది. కరుణ కళ్ళలో నీళ్ళు....

"ఛ నన్ను అంతేనా అర్థంచేసుకున్నావ్. "

"మరి ..?"

"నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటె నాకంతకంటె కావల్సింది ఏమీలేదు కరుణా! కాని మన జీవితాలు సాఫీగా సాగవు. ఈ సమాజం డబ్బుకు, కులానికి, మతానికి యిచ్చినంత ప్రాముఖ్యత మనిషికి, మనసుకు, మానవత్వానికి, ప్రేమకు ఇవ్వదు. మనకెన్నో సమస్యలు ఎదురవుతాయి. ధైర్యంగా స్థయిర్యంగా ఎదుర్కోవాలి. నిరాశగా కూలబడితె.... ఓడిపోతాం. గెలుపే మన

ధ్యేయం కావాలి. అలాటప్పుడు సమాజాన్ని, పరిస్థితులను, కష్టాలను అన్నిటినీ ఎదుర్కోగలిగే ఓర్పు వుండాలి. అవునా ?"

"నీకు లేవా" అంది అమాయకంగా.

"నాతోపాటు నీకు వుండాలనే నేను చెప్పేది."

"అయితే సరే. నా కున్నాయ్" అంది.

బుద్ధిగా చెబుతున్నా కరుణలో అమాయకత్వం చూసి ముచ్చటవేసింది రాజుకు.

"అయితే సరే" అన్నాడు తను కరుణ అన్నట్టుగానే అనుకరిస్తూ.

చాలాసేపటివరకూ మౌనంగా వున్నారిద్దరు.

"కాని ఒక్క షరతు," అన్నాడు రాజు.

"ప్రేమలో షరతులు వుండవు ?" అంది.

"ఎవరు చెప్పారు ? ఏ పుస్తకంలో రాసారు ?" అన్నాడు నవ్వు నాపుకుంటూ.

రాజు నవ్వును గుర్తించి బుంగమూతి పెడుతూ వెక్కిరించింది కరుణ.

"నా కిప్పుడున్న ఉద్యోగం చాలా చిన్నది. అచ్చితంగా నా ఒక్కడికే సరిపోతుంది. అందుకని . "

"అందుకని " గాబరాగా అడిగింది.

"నాకు మంచి ఉద్యోగం దొరికేవరకు పెళ్ళి వాయిదా వేయాలి."అన్నాడు.

"ఎన్నాళ్ళు ? "

"దొరికేవరకు."

"ఎప్పుడు దొరుకుతుంది ?" ఆత్రుతగా అడిగింది.

రాజు అల్లరిగా నవ్వుతూ. "యిప్పుడే" అన్నాడు.

"ఓహ్ అదికాదు రాజూ ! నాన్న పెళ్ళిసంబంధాలు చూస్తున్నాడు."

"నువ్వు నచ్చలేదంటే సరి . ఇంతకు మాస్టారు నీ కిష్టంలేని కుర్రాడికి విచ్చివ్వరు కదా "

"ఊఁ"

"మరి యింకేం ?"

"కాని ఎన్నాళ్ళు ?"

"వీలైనన్ని రోజులు "

"ఆ తరువాత ?"

"మన ప్రయత్నం మనం చేద్దాం సరేనా?" అన్న తన మాటలకు ఒప్పుకున్న కరుణ, ఆరునెలలుగా, తనకు రాసే ఉత్తరాలలో తనకు వచ్చిన పెళ్ళిసంబంధాలు వాటంతట అవిగా కొన్ని, తాను కొన్ని తప్పించిన వైనం రాస్తూ వచ్చింది.

కాని

ఈనాడు ఇంత చిన్న ఉత్తరం రాసిందంటే ఏదో ముంచుకు వచ్చిందన్న మాట.

రాజు ఆ రాత్రే బయలుదేరాడు.

రైలులో కూర్చున్నా డన్నమాటేగాని, అతని మనసు, మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది.

"నా కిష్టంలేని సంబంధం వాన్న ఖాయం చేస్తే నువ్వు వచ్చేసి నన్ను తీసికెళ్ళాలి రాజూ లోకం దృష్టిలో నేను లేచిపోయినట్టు" అని పకపక నివ్వేసిన కరుణ రూపం కళ్ళముందు నిలబడింది.

ఒకవేళ . అలాంటి స్థితే ఎదురైతే . ?

కరుణను తీసుకురావాలి.

కాని తన ఉద్యోగం ఏదో ప్రయివేటు కంపెనీలో రెండువందల కన్సాలిడేటెడ్ జీతంతో రోజులు గడుపుకొస్తున్న తను కరుణను తీసుకొచ్చి ఏం సుఖపెట్టగలడు? ఏ అవసరాలు తీర్చగలడు? మంచి ఉద్యోగం తానెంతగా ప్రయత్నించినా ఈ రోజుల్లో దొరకడం మాటలా? ఇంటర్వ్యూలకు వెళ్ళడం తప్ప సెలక్టవడం తెలీదు. ఉత్తరదక్షిణాలులేని తనకు ఉన్న ఉద్యోగమే వరమైంది. అలాంటప్పుడు కరుణను తీసుకురావడం.

కాని . ఎన్నాళ్ళని ఆ అమ్మాయి అతనికోసం పడిగాపులు కాస్తుంది? అంతరాత్మ ప్రశ్నించింది.

ఆడపిల్ల. ఎదిగిన కూతురుని గుండెలమీద కుంపటిలా ఎన్నాళ్లని మోయగలరు వాళ్ళు. ఎవరికో ఒకరికి ఇవ్వక తప్పదు.

ఆ అమ్మాయి మాత్రం ఎన్నాళ్ళని తప్పించుకోగలదు.

ఇవాళ కాకపోయినా రేపైనా నువ్వు తీసుకురావాలి! కరుణ నీకు కావాలనుకుంటే, రేపు చేయాల్సిన పనేదో ఇవాళే చేయకూడదూ?

కాని కరుణ తనతో జీవితంలో సుఖపడగలదా?

అది ఆ అమ్మాయి ఆలోచించుకుంటుంది. నీలైనంతవరకు ఆ అమ్మా

యిని అన్యాయం చేయకుండా సుఖపెట్టడానికి ప్రయత్నించు. ఆ తరువాత ఆ అమ్మాయి అదృష్టం.

అలా అదృష్టాన్ని నమ్ముకుని

తప్పదు. ప్రయత్న లోపం లేనివాడు దైవాన్ని, అదృష్టాన్ని విశ్వసించాలి. ధైర్యంగా ముందడుగు వేయి మనసు ప్రబోధించింది.

మనసు ఎంత నచ్చచెప్పినా, తనకు ఓ మంచి ఉద్యోగం కనీసం తామిద్దరి కనీసవసరాలు తీర్చగలిగే ఉద్యోగం దొరికాకే పెళ్ళిచేసుకొని కరుణని తీసుకువస్తే బావుంటుందని అనిపించింది రాజుకు.

ద్వంద్వ నిర్ణయాల మధ్య, అభిప్రాయాల మధ్య నలిగిపోతూ, చివరికి కరుణని తీసుకురావాలనే నిశ్చయానికి వచ్చినా, ప్రశాంతంగా నిద్రపోలేక పోయాడు రాజు.

రేపు. . ఎలా వుంటుందోనన్న ఆలోచన మాత్రం ఓ పెద్ద సమస్యగా రాజును వేధించసాగింది.

* * *

రాజారావు నిశ్శబ్దంగా నిలబడిపోయాడు

అతడు రైలు దిగీదిగగానే, కరుణ కలిసింది. స్టేషన్‌లో కలిసిన కరుణ చెప్పిన మాటలు వింటూనే రాజు కంగారుపడలేదు.

"కరుణా! బాగా ఆలోచించావు కదూ!" సూటిగా అడిగాడు.

"ఊఁ"

".. .. . . . .. .."

"రాజా! నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను పదేపదే ఆలోచించుకో అంటూ నన్ను శంకించి మరో విధంగా అవమానించకు. రేపు ఎలాంటి పరిస్థితి ఎదురైనా నేను బాధపడుతూ నిన్ను అసహ్యించుకుంటాననేగా ....అలా ఏనాటికీ జరగదు" అంది నిశ్చలంగా.

రాజు నిశ్శబ్దంగా నిలబడిపోయాడు. కరుణ కళ్ళలో తిరిగి కరిగిన కన్నీటి పొర అతడిని యిక మాట్లాడకుండా చేసింది.

"కరుణా!" పిలిచాడు.

"ఒక్క మాట నన్ను చెప్పనియ్ కరుణా, నేను చెప్పడం పూర్తయిన మరుక్షణంనుండి మన రెండు జీవితాలు ఒక్కటిగా మొదలవుతాయి. అందుకే చెబుతున్నాను. శ్రద్ధగా విని గుర్తు పెట్టుకుంటావు కదూ!" అన్నాడు. అతని గొంతు

రానురాను గంభీరంగా మారిపోయింది. అతని చేతిలో యిమిడిపోయిన కరుణచేతికి అతడి చేతిస్పర్శ మెత్తగా చిరువెచ్చగా తగలసాగింది.

కరుణ చెప్పమన్నట్టుగా చూసింది.

"కరుణా! మనం గడపబోయే జీవితంలో ఎన్నికష్టాలు, కన్నీళ్ళు, బాధలు, బరువులు కలిగినా అవి మనిద్దరి మధ్య దూరాన్ని మాత్రం పెంచకూడదు. నేను ఊపిరి పీల్చే ప్రతిక్షణం నిన్ను సుఖపెట్టడానికి, ఆనందంగా వుంచడానికి నా శాయ శక్తుల ప్రయత్నిస్తాను. నా ప్రయత్నంలో నీతోడు, ఓదార్పు ముఖ్యంగా నీ చిరు నవ్వు నా తోడుగా వుండాలి. అపార్థాలకు, ఆవేశాలకు చోటుయివ్వకుండా మనం కలిసివుండాలి. నా తోడులో నీ జీవితం నీకు సంతృప్తి నివ్వకపోతే ఆనందం లేకపోతే "

"ఓహ్ యిక చాలు రాజా! సంతృప్తి అనేది మనం ఊహించేదాంట్లో వుంటుందని, ఆనందం, సుఖం అనేవి మనం యిచ్చే విలువనుబట్టి వుంటుందని నువ్వే చెప్పావు గుర్తుందా!"

"అంతేకాదు కరుణా యింకా"

"ష్.. వద్దు యిక చాలు రాజా! చెప్పింది కొంచెమే అయినా యింకా నువ్వు చెప్పేది మిగిలిపోయినా యిక నేను ఏమీ వినను." అంది అతని పెదవులను అరచేత్తో మూస్తూ.

రాజారావు కళ్ళలో వెలుగు.

"థాంక్స్ కరుణా!" అంటూ ఆమె చేతిని మృదువుగా నొక్కి వొదిలి పెట్టాడు.

"రేపుదయం స్టేషన్‌కు నేను వచ్చేస్తాను రాజా! నువ్వు యిక్కడేవుండాలి" అంది కరుణ.

"ఆఁ అ సిమెంటు బెంచిదగ్గిరే వుండాలి" అంది ప్లాట్‌ఫాంపై, రావి చెట్టుదగ్గరున్న సిమెంటు బెంచిని చూపిస్తూ.

రాజారావు మాట్లాడలేదు.

"రేపే వెళ్ళాలా కరుణా" అన్నాడు.

"ఏం "

"నే నోసారి హైద్రాబాద్ వెళ్ళి ..యిల్లు అది .."

"ఫర్వాలేదు . మనం కలిసివెళ్ళాకే" అంటూ అతని సమాధానానికి ఎదురు చూడకుండా వచ్చేసింది కరుణ.




ఆ రాత్రి అందరూ నిద్రపోయాక, తనకున్న చీరలు నాలుగు, తన స్కూల్ ఫైనల్ సర్టిఫికెట్లు, దగ్గరున్న పాతికరూపాయలు ఓ ప్లాస్టిక్ సంచిలో సర్దుకుంది.

ఆ సాయంత్రం మొదలైన చినుకుల వర్షం అర్ధరాత్రి అయ్యేసరికి కుంభ వృష్టిగా మారిపోయింది.

• • •

ఓ ప్రక్క భయంగావున్నా, కరుణ నిర్ణయాన్ని మార్చుకోలేకపోయింది.

సాయంత్రం ఆరుగంటలు దాటింది.

ఆరోసారిగా ఆ వీధికివచ్చి నెమ్మదిగా నడిచివెళుతూ ఆ గదివంక చూసాడు రాంబాబు.

ఐదుసార్లుగా నిశ్చలంగా వుండి తనను వెక్కిరిస్తున్న తాళంకప్ప ఆరో సారికూడా వెక్కిరించటంతో ఆ తాళంకప్పమీద కోపం, కసి పెరిగిపోయాయి రాంబాబుకు.

'అలా కాదు, నీ పని చెబుతానుండు.' అని అనుకుంటూ భుజానికున్న ఎయిర్ బ్యాగును చేతిలోని సూట్‌కేసును ఓసారి చూసుకొని గబగబా నడుస్తూ ఆ గది దగ్గరగా వెళ్ళాడు.

ఇంతకూ ఇది రాజుగారి కొంపేకదూ! అని ఓ క్షణం ఆలోచించి— అయినా కాకపోయినా యిక చేసేదేమీలేదు. హరిహరాదులు అడ్డుకోనీ — తన నిర్ణయం మారదు. తను చేయబోతున్న ఆ కార్యం ఆగదు గాక ఆగదు అనుకుంటూ, గది తలుపులకు దగ్గరగా వెళ్ళి తాళం తీస్తున్నట్టుగా కొంచెం తలవాల్చి చుట్టుపక్కల ఎవరూ లేరని, దూరంగావున్న ధాబాయింటిముందు కూర్చున్న ఆడవాళ్ళు తనను గమనించడం లేదన్న విషయం గమనించి జేబునుండి తాళంచేతులు తీసినట్టుగా ఓ మేకు, ఓ తీగలాంటిది తీసి తాళం తీయబోయాడు.

ఊహూఁ రాలేదు.

గట్టిగా లాగాడు.

ఊహూ.

మొహమంతా చెమట ఏదో భయం నీడలా. ఎవరైనా చూస్తే, గుర్తించి దొంగ అనుకుంటే—

ఏం జరుగుతుందో ఊహించి కాళ్ళలో సన్నటి వణుకు చేతులు చెమటతో తడిసి మేకు, తీగ, కుడిచేతిలోంచి తాళంకప్ప ఎడంచేతిలోంచి జారిపోయాయి.

అతికష్టం ప్రయత్నంగా పిడికిలి బిగించి, తాళంకప్పను ఎడంచేత్తో పట్టుకుని కుడిచేత్తో బలంగా కొట్టాడు.

అంతే—

మరొక్క క్షణం ఆలస్యం చేయకుండా గది తలుపులు తీసి లోపలికి వెళ్ళి, తలుపులు మూసి, లోపలినుండి గొళ్ళెంవేసి, చేతిలోని సూట్ కేసును, బ్యాగును ఓ మూలకు పెట్టి గదిలో ఓ మూలవున్న మంచంమీద కూర్చున్నాడు. గదంతా పరిశీలనగా చూసాడు. మూసివున్న కిటికీ ప్రక్కనేవున్న టేబుల్ పై రాజారావు ఫొటో చూసాక "హమ్మయ్యా! ఇది రాజుగాడి కొంపే" అని అనుకొని ఏదో గండం గడిచినట్టు, మరెంతో బరువు తీరినట్టు హాయిగా, తేలిగ్గా నిట్టూర్చి మంచంమీద వెనక్కి వాలాడు.

ఒరేయ్ రాజూ! నువ్వున్నావనుకొని వస్తే ఊరికెళ్ళావు అని చెప్పారు కంపెనీ కెళితే. ఈ రోజు సాయంత్రం వరకు నువ్వు వస్తావనుకున్నారా. నువ్వు రాలేదు. యిక ఎప్పుడొస్తావో తెలీక, తాళం బద్దలుకొట్టి వచ్చేసారా! యిక నువ్వింకో నాలుగు రోజులకు వచ్చినా ఫర్వాలేదు అని అనుకుంటూ, చిన్నగా నవ్వుకొని, సంతోషంగా ఈలవేస్తూ లేచి నిలబడి గదినంతా పరిశీలనగా చూసాడు.

బయటకు కపిపించేంత చిన్నగా లేదు ఆ గది. కొంచెం పొడుపెక్కువ కావడంవల్ల, చిన్నసైజు గోడ ఒక్కటి గది మధ్యగా అడ్డంగాకట్టి, వాదిలేయటంతో, అది రెండు గదులుగా అనుకోవచ్చు. గోడ కటువైపు వంటగది అనుకోవడానికి నిదర్శనంగా, ఓ స్టవ్, గిన్నెలు, డబ్బాలు... వగైరా వంట సామానులు, గోడకిటువైపు మంచం, చిన్న టేబుల్, కుర్చీ, మూసివున్న కిటికిలో కూడా ఓ గాజుగ్లాసు. టేబుల్‌మీద రాజారావు ఫొటో.. ఏవో నాలుగు పుస్తకాలు.

వంటింట్లో ఓ మూలవున్న బకెట్ నిండా నీళ్ళు కప్పించడంతో, రాంబాబు కిటికీ తెరచి మొహం కడుక్కొని డబ్బాలన్నీ వెతికాడు. ఓ డబ్బాలో బిస్కెట్లు కప్పించాయి. బ్రెడ్ ఎండిపోయి వుంది. ఆవకాయ పచ్చడి హార్లిక్స్ సీసాలో నుండి తొంగిచూసి పలకరించింది. రాంబాబు, మండే ఆకలికి కాలే గంజిలా బ్రెడ్‌ను ఆవకాయతో నంజుకొని, బిస్కెట్లు తిని కడుపునింపుకున్నాడు

*　　　*　　　*　　　*

"కరుణా! మన యిల్లు వచ్చేసింది' రాజారావు మాటలకు కరుణ రాజారావు చూపించినవైపు చూసింది. ఆ వీధిలో వరసగావున్న యిళ్ళలో రాజారావు చూపించిన మన యిల్లు ఏదో తెలియలేదు.

రిక్షా ఆగడంతో రాజారావు ముందుగా దిగాడు. గది తలుపులకు తాను వేసిన తాళం కప్పించక పోవడంతో ఓ క్షణం విభ్రాంతపోయి, రిక్షావాడికి డబ్బులివ్వకుండానే గబగబా గది దగ్గరగా వచ్చి తలుపు తీసాడు. లోపలి నుండి గొళ్ళెం వేసివుండడంవల్ల తలుపులు తెరుచుకోలేదు. లోపల ఎవరో మనుషులున్న అలికిడి. పైగా ఈలపాట

రాజారావు తలుపులు తట్టాడు.

"ఎవరూ?" ఎవరిదో గొంతు.

రాజు జవాబివ్వక మళ్ళీ తలుపు తట్టాడు.

"రాజారావు లేడండి. బజారు కెళ్ళి యింకా రాలేదు!" లోపలినుండి వినిపించిన ఆ జవాబుకు విభ్రాంతపోయాడు.

'దొంగవెధవ.... తన పేరుకూడా తనకుక్కున్నాడు' అనుకుంటూ—

"రాజారావు కాదు. నువ్వే కావాలి. తలుపులు తీయ్" అన్నాడు.

"ఓరి.. ఓరి నువ్వట్రా చిట్టితండ్రీ" అంటూ తలుపులు తీసాడు రాంబాబు.

గడ్డం గీసుకోవడానికి రెడీగావున్న సబ్బునిండిన బుగ్గలు, చేతిలో రేజరు

"రారా రాజూ! బ్రతికించావురా తండ్రీ! పొద్దుటి నుండి ఓ బామ్మ గారూ, ఓ పాలవాడు, కూరలమ్మ, చాకలాడు అబ్బబ్బా వచ్చిన ప్రతి వాళ్ళకు 'రాజారావు యిప్పుడే బజారుకెళ్ళాడండి' అని చెప్పలేక చచ్చాను. వచ్చిన ప్రతివాళ్ళు 'మీరెవరు?' అని యక్షప్రశ్నలు చంపేసారు ఈ ఊళ్ళోవున్న నిన్ను నమ్ముకొని వచ్చి నేను ఎన్ని అగచాట్లు పడ్డానసు కున్నావ్" అన్నాడు అద్దంముందు నిలబడి గడ్డం గీసుకుంటూ.

"ఓ దొంగవెధవలా తాళం బ్రద్దలుకొట్టి మరీ వచ్చాను. ఏం చేయను వచ్చి రెండు రోజులైంది నువ్వు ఊళ్ళో లేవు గది తాళం బద్దలుకొట్టి గదిలోకో లేక కటకటాల వెనక్కో వెళ్దామన్న ధృఢనిశ్చయానికి వచ్చి, నిన్న సాయంత్రం " ఎవరిదో గాజుల చప్పుడు వినరావడంతో క్షణం చెప్పడం ఆపి అద్దంలో నుండి చూపు తిప్పి చూసాడు. ఎవరో నీడలా

రివ్వున వెనక్కి తిరిగి చూసాడు

గుమ్మంలో నిలబడ్డ కరుణను చూస్తూనే కంగారుపడిపోతూ, వంటింట్లోకి వెళ్ళిపోయాడు.

"రా కరుణా!" అన్నాడు రాజారావు.

కరుణ లోపలికి వచ్చింది.

రాంబాబు మొహం కడుక్కొని వచ్చాడు.

ఒకరికొకరికి పరిచయం చేసాక, రాంబాబు కాఫీచేసి తీసుకువచ్చాడు. చూచాయగా విషయం అర్థంచేసుకున్న రాంబాబు "నువ్వు ఊరెళ్ళి చేసిన పని యిదన్నమాట?" అన్నాడు నవ్వుతూ.

"నువ్వు ఎందుకొచ్చావురా?"

"ఉద్యోగం కోసం."

"అంత అవసరం ఏమిటిప్పుడు?"

"రాధకోసం రాధ వస్తోంది."

"ఎప్పుడు ."

'మరో రెండు రోజుల్లో' అని చెప్పలేక "....వస్తుంది" అన్నాడు.

"నేను బయటికెళ్ళి క్యారేజి తీసుకువస్తాను. మీరు స్నానం అదీ చేసే యండి" అంటూ రాంబాబు బయటకు వెళ్ళిపోయాడు.

"కరుణా! నేను ముందు స్నానం చేసేయనా? నువ్వు చేస్తావా?" అన్నాడు.

"ఏం... "

"నీళ్ళు బయటకు వెళ్ళి తేవాలి" అంటూ వంటింట్లోవున్న కొన్ని నీళ్ళతో తన స్నానం అయిందనిపించి, బయటకు వెళ్ళి బకెట్ నిండా నీళ్ళు తీసుకు వచ్చాడు. ప్రక్కనేవున్న బాత్‌రూం లాంటి చిన్నగదిలోకి వెళ్ళి స్నానంచేసి వచ్చింది కరుణ.

రాంబాబు యింకా రాలేదు

కరుణ ఇల్లంతా పరిశీలనగా చూసింది అచ్చంగా బ్రహ్మచారి గదిలాగే వుంది.

రాజుతో కలిసి మొదలుపెట్టిన తన జీవితం ఈ యింట్లోనే గడపాలి అన్న ఆలోచన రాగానే కరుణ కెందుకో ఈ యిల్లు ఇరుకుగా చిన్నగా అన్పించింది. అసలు రిక్షా దిగి యింట్లోకి రాగానే, రాంబాబు వాలకం, అతడి మాటల ధోరణి, కరుణకు ఏమిటోగా అన్పించింది.

రాంబాబు రావడంతో భోజనం ముగించారు.

"కరుణా నువ్వు పడుకో .." అంటూ స్నేహితులిద్దరు వీధి అరుగు మీదకు చేరారు.

అలసటగా వుండటంవల్ల కరుణ వెంటనే నిద్రపోయింది. రాజారావుకు అలసటగా వున్నా, ఎడతెగని ఆలోచనలు నిద్రపోనీయలేదు.

కరుణతో జీవితం అనే సమస్యకు పరిష్కారం సంతృప్తిని కలిగించలేక, ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరవుతోంటే, మధ్యలో రాంబాబు గొడవ ఒకటి వచ్చింది.

తనకున్న ఒకే ఒక మంచి స్నేహితుడు రాంబాబు. అప్తుడు, ఆత్మీయుడు, బంధువు అన్నీ రాంబాబే. ఈనాడు, తల్లిదండ్రుల నెదరించిన రాంబాబుకు కూడా తానొక్కడే. అందుకే ఎంతో ఆశతో తన స్నేహంపట్ల నమ్మకంతో వచ్చిన రాంబాబును కాదనగలడా?

"రాజా!" రాంబాబు పిలుపుకు ఉలిక్కిపడ్డాడు.

"ఏమిట్రా అంతగా ఆలోచిస్తున్నావ్? నా గురించేనా? నువ్విలాంటి పరిస్థితిలో వుంటావని తెలిస్తే .... నేను...."

"బాబీ! నీ గురించి కాదురా.... కరుణ గురించి ఆలోచిస్తున్నాను" అన్నాడు చిన్న అబద్ధం ఆడుతూ.

"కరుణ గురించా!" ఆశ్చర్యపోయాడు రాంబాబు.

"విషయం యింతదూరం వచ్చాక నువ్వింకా కరుణ గురించే ఆలోచిస్తున్నావంటే, నేను నమ్మనురా! ఒకవేళ అదే నిజమైతే, తొందరపడ్డావనుకోవా, అనాలోచితంగా ఈ పని చేశావనుకోవా!"

"ఏమీ కాదు! రేపు ఎలా. అనే. నా కొచ్చే జీతంలో మా రెండు జీవితాలు... "

"అబద్ధం ఆడుతున్నావు రాజా! రేపటి గురించి రేపులో గడిపే ప్రతి క్షణం గురించి ఆలోచించే వివేకం నీకుంది. ఆలోచించకుండానే నువ్వు అడుగు ముందుకు వేయవు."

"ఇంతకు నీ గురించే ఆలోచిస్తున్నానంటావ్ సరే అవును" అన్నాడు రాజు.

"నా గురించి ఆలోచించడానికి ఏం వుందిరా? నా కేదైనా చిన్న ఉద్యోగం దొరికినా రాధను తీసుకొచ్చేస్తాను" అన్నాడు

"ఉద్యోగం దొరకడం అంత తేలికనుకున్నావురా"

"ఆ వరకు తేలికే అనుకోవాలి మరి" అన్నాడు.

రాజారావు అర్థంకానట్టు చూసాడు.

"నేను వచ్చి నాలుగురోజులైందిరా! విన్నా ఇబ్బంది పెట్టడం ఎందుకని హోటల్ రూమ్‌లో వున్నాను. రెండు రోజులు. తిరిగాను. ఊహుం లాభంలేకపోయింది. రెండు రోజులకే వందరూపాయలు ఖర్చయిపోయాయి. యిక విన్నా ఇబ్బంది పెట్టక తప్పదనిపించి వచ్చాను. విన్నంతా తిరిగి తిరిగి చిన్న ఉద్యోగం సంపాదించాను. రేటినుండి వెళ్ళాలి ." అన్నాడు.

"కాని... రాజు .. ఒక్క పొరపాటు చేసారా" అన్నాడు రాంబాబు.

"ఏమిటి?"

"కరుణ విషయం నాకు తెలియదుగా! అందుకని రాధ వస్తే, కొన్నాళ్ళపాటు నీ గదిలో తలదాచుకుందా మనుకొని, ఇవాళ ప్రొద్దునే టెలిగ్రామ్ యిచ్చాను. కాని యిప్పుడు గది వెతుక్కోవాలి." అన్నాడు.

"అదేమిట్రా యిప్పుడేమైంది?"

రాజారావు మాటలకు రాంబాబు నవ్వాడు.

రాజారావుకూడా నవ్వేసాడు.

"ఫర్వాలేదురా బాబీ! నీకు మంచి ఉద్యోగం దొరికేవరకు ఎలాగో సర్దుకుందాం! అంతేకాదురా . . మేమింకా పెళ్ళిచేసుకోవాలి. మరి పెళ్ళిపెద్దలు మీరే. కాపురం అంటూ ఆ తరువాత కదా!" అన్నాడు.




"పెళ్ళి ఎంతసేపురా రాజా!" అంటూ పకాపకా నవ్వి, "నా బాధలేవో నేను పడతాను కాని... నువ్వింకేం ఆలోచించకుండా వీలైనంత త్వరలో పెళ్ళిచేసుకోరా!" అన్నాడు.

"ఊఁ.. " అన్నాడు రాజారావు.

"అలవటగా వుండివుంటుంది వెళ్ళి పడుకోరా! నేను వో సారి బయటకు వెళ్ళొస్తాను ఓ గంటలో వచ్చేస్తాను." అంటూ రాజు సమాధానానికి కూడా ఎదురుచూడకుండా వీధిలోకి బయలుదేరాడు రాంబాబు.

రాధకు పెళ్ళయిన మరుక్షణం నుండి తాను యిచ్చింది, యిస్తోంది తన్నీళ్ళే. యిక యిప్పుడు... అన్నీ కష్టాలే .. అనుకుంటూ కదిలాడు రాంబాబు.

తెల్లవారితే రాధ వస్తోంది అప్పట్లోగా గది దొరికితే బావుంటుంది. రాజు గదిలో వుండటంవల్ల వాళ్ళకు, తమకు ఇబ్బందే. ఇవాళ కాకపోయినా రేపైనా వెతుక్కోవాలి, తప్పదు.

రాధ కొత్తగా కాపురానికి వస్తోంది ఎంత చక్కగా ఆహ్వానిస్తున్నాడు రాధను తన జీవితంలోకి! రాంబాబు పేలవంగా నవ్వుతున్నాడు.

కట్నం పేచీ వచ్చి పెళ్ళి స్థిరపడ్డాక, తన తండ్రి, తల్లీ పేచీ పెట్టారు.

చివరికి అన్నీ ఒప్పించి పెళ్లి జరిపిస్తోంటే, పీటలమీద ఇంకేదో అడిగింది అమ్మ చెల్లాయి వాళ్లు కాదనటంతో— నాన్న తనని లాక్కొచ్చెయ్యాలని చేసిన ప్రయత్నంలో తాను ఎదురుతిరిగాడు.

ఆ మూడు ముళ్లు వేసేసాడు.

కాని— మూర్ఖంగా ఆలోచించే తల్లీ, తండ్రీ, రాధను కాపురానికి తీసుకు రాలేదు. తనకంటూ ఓ ఉద్యోగం లేదు. కాలేజినుండి బయటకు రాగానే పెళ్లి చేసారు. వాళ్ళ యిష్టాన్ని కాదని, వాళ్ళ అధికారాన్ని సహించలేక, రాధమెళ్ళో మూడు ముళ్లు వేసిన నేరానికి రాధను ఇంటికి తీసుకురానీయకపోవడంతో తాను ఎదురుతిరిగి ఫలితంగా బయటకు వచ్చేసాడు.

పెళ్ళయి సంవత్సరం దాటింది. రాధను కాపురానికి తీసుకురాకపోవడంతో అటు పుట్టింటివారు, ఊళ్ళోవాళ్ళు కూడా—"అసలు రాధను కాపురానికి తీసికెళ్ళరని, వదిలివేసినట్టేనని, సూటిపోటి మాటలతో బాధపెట్టడంతో, రాధ తనకు ఉత్తరం రాసింది.

ఆడపిల్లకు పెళ్ళంటూ అయ్యాక, పుట్టింట్లో అంత గౌరవం, విలువ వుండవండీ నాలుగురోజుల చుట్టంగా ఆదరిస్తారే తప్ప తమ యింటి ఆడపడుచుగా అభిమానించరు. మీ కెలాంటి ఇబ్బందులున్నా సరే, నన్ను తీసికెళ్ళండి. అంటూ రాధ రాసిన వుత్తరం తనకు చాల ఆలస్యంగా అందింది.

తనకంటూ ఓ ఉద్యోగం ఆధారంలేని తను రాధను తీసుకొచ్చి ఏం చేయాలో, కనీసం తినడానికి తిండైనా పెట్టకపోతే ఎలా అని రాధకు వుత్తరం రాసాడు.

మరో ఆరునెలలు గడిచాయి. తనకు ఉద్యోగం దొరకలేదు సరికదా, రాధ రాసిన వుత్తరం కలవరపరచింది.

"నన్ను తీసికెళ్ళండి. ప్లీజ్ మీతో ఎన్ని కష్టాలైనా సరే ఆనందంగా భరిస్తాను. కాని మీ తోడులేని నన్ను వీళ్ళు అనే నానామాటలు నాకు జీవితం అంటే భయంగా, మీమీద వున్న నమ్మకం, విశ్వాసం అవివేకంగా మిగిలి నన్ను అపహసిస్తున్నాయి "

తానిక తండ్రితో గట్టిగా మాట్లాడదానికే నిర్ణయించుకున్నాడు. ఫలితంగా బయటకు వచ్చేసాడు, రాజాన్నాదనే హైద్రాబాద్ వచ్చాడు

నాలుగురోజులు తిరిగి తిరిగి సంపాయించిన చిన్న ఉద్యోగం ఓ బట్టల కొట్లో. నెలకు నూటముప్పయి రూపాయల జీతం. తను చదివిన బి.కాం. కు

దొరికిన ఉద్యోగం అది. తప్పదు. రాధకోసం తన చదువు, డిగ్రీ అన్నీ మర్చి పోవాలి.

ఆలోచిస్తూ నడుస్తున్న రాంబాబు. పిల్లలు గోలగా అరవడంతో ఉలిక్కి పడ్డాడు.

యింటిముందున్న 'టు లెట్' బోర్డు చూసి ఆగిపోయాడు. అది ఐదారు వాటాలవాళ్ళున్న లోగిలి, కొంచెం బెదురుగానే లోపలికి అడుగుపెట్టాడు రాంబాబు.

* * *

స్టేషన్‌లో రైలు ఆగుతూనే రాంబాబు కళ్ళు ఆత్రుతగా ప్రతి కంపార్టు మెంటును వెతకసాగాయి.

బెరకుగా చూస్తూ, భయం భయంగా కంపార్టుమెంటు తలుపు దగ్గర నిలబడ్డ రాధను చూస్తూనే పరిగెత్తాడు

"రాధా!" రాంబాబు పిలుపుకు రాధ ఆత్రుతగా చేయి చాచి రాంబాబు చేతిని అందుకుంది.

తన చేతిలో యిమిడిన రాధ చేతిని మృదువుగా నిమురుతూ రాధ మొహం లోకి తదేకంగా చూస్తున్న రాంబాబు, వెనకనుండి రాజు రావడంతో, రాధ చేతి లోని సూట్‌కేసు అందుకున్నాడు.

"నా పేరు రాజు. బాబిగాడి స్నేహితుణ్ణి" అంటూ తనను తాను పరిచయం చేసుకుంటూ, "బాబీ నువ్వు చెల్లాయిని జాగ్రత్తగా తీసుకురా నేను రిక్షా మాట్లాడతాను" అని అంటూ రాంబాబు చేతిలోని సూట్‌కేసు అందుకుని వెళ్ళి పోయాడు రాజు.

"పద రాధా" అంటూ రాధ చేయి పట్టుకొని ముందుకు కదిలాడు.

యింటికి వెళ్ళేసరికి కరుణ వంటచేసి వీళ్ళకోసమే ఎదురుచూస్తోంది.

"మన యింటికి సాయంత్రం వెడదాం రాధా!" అన్నాడు. రాధ అయోమయంగా చూడటం చూసి,

భోజనాలు అవి ముగించి కూర్చున్నారు

గది చూసుకొని అడ్వాన్స్ కూడా యిచ్చేసి, తిరిగివచ్చిన రాంబాబు, ఆ మర్నాడు ఉదయం చేతికున్న వాచి, ఉంగరం అమ్మేసి వంటకు కావలసిన సామాన్లన్నీ కొనేసి, గదిలో సర్దుకొని మరీ రాధను తీసుకురావడానికి స్టేషనుకు వెళ్ళాడు.

ఆ సాయంత్రం, తమ యింటికి వస్తూ "ఇంత అర్జంటుగా గది దొరక

లేదు రాధా! అందుకేనేమో, గదిలాంటి కారుపెట్టెలోనే మన కాపురం" అన్నాడు మెల్లగా.

రాధ నిండుగా నవ్వేసింది ఆ నవ్వు రాంబాబుకు కొండంత ధైర్యాన్నిచ్చింది

గదంతా కలయచూస్తూ ఓ మూల నిలబడిపోయింది రాధ. గది తలుపులు మూసి వెనక్కి తిరిగిన రాంబాబును లతలా పెనవేసుకుపోయి, గుండెల్లో యిమిడిపోతూ గావురుమంది రాధ.

కంగారు పడిపోయాడు రాంబాబు.

ఈ గది సర్దడంకోసం, రాంబాబు పడ్డ శ్రమ, యాతన గుర్తించిన రాధ మనసు అది కేవలం తనకోసమేనని అర్థంకావడంతో ఏడ్పువచ్చేసింది.

"ఈ గది నచ్చలేదా రాధా?" అన్నాడు రాంబాబు అమాయకంగా

రాధ మాట్లాడలేదు.

"రాధ.." రాధ మొహాన్ని రెండు చేతులతో ఎత్తి కళ్ళల్లోకి చూస్తూ పిలిచాడు.

"నా కివాళ చాలా సంతోషంగా వుందండి." అంది ఏడుస్తూనే.

"ఓహ్. అందుకా." అని "నిజంగా నీకు సంతోషంగా వుంది, యిక ముందు కూడా వుండగలిగితే నాకు కావల్సిందేంలేదు రాధా! ఏడాదినుండి నీకు కన్నీళ్ళబాధ తప్ప మరేం ఇవ్వలేని దౌర్భాగ్యుణ్ణి." ఇంకా ఏదో అనబోయాడు.

రాధ అతని మాటలను ఆపేస్తూ "వద్దండి. ఇంకేం గుర్తుచేయకండి. మన జీవితం అనేది ఇవాల్టినుండి, కాదు యిప్పటినుండి మొదలైంది. మనకు రేపు తప్ప నిన్న లేదనుకుందాం. ఈ గదే కాదు, యింతకన్నా యింకా చిన్నగా, యిరుకుగా వున్నా ఫర్వాలేదు. మీ సాంగత్యంలో నేను హాయిగా వుండగలను" అంది.

"ఊహుం మాటలు బాగా నేర్చావు!" అన్నాడు రెండుచేతులతో ఆమెను చుట్టేస్తూ

రాధ తన్మయత్వంగా అతని పరిష్వంగంలో యిమిడిపోయింది.

* * *

రాజు కళ్యాణిల పెళ్ళి గుళ్ళో అతి నిరాడంబరంగా జరిగిపోయింది. రాధ రాంబాబులే పెళ్ళిపెద్దలు. రాజు నలుగురు స్నేహితులు పెళ్ళికి వచ్చారు.

పెళ్ళయిన మరునాడే కరుణ తండ్రికి విషయమంతా వివరంగా ఉత్తరం రాసింది.

జవాబుగా రాఘవయ్య వచ్చి, రాజు కరుణను దీవించడానికి బదులుగా నోటికివచ్చినట్లల్లా శపించి మరీ వెళ్ళాడు. రాంబాబు ఎంత నచ్చచెప్పినా, రాధ ఎంతగా బ్రతిమాలినా అతని వాగ్ధాటి అపలేకపోయారు. తండ్రి వున్నంతవరకు బింకంగా మాట్లాడింది కరుణ కాని, తీరా అతను వెళ్ళిపోయాక చాలా బాధపడి పోయింది. రాజుచేతుల్లో మోహం దాచుకుని బావురుమంది.

"నాన్న మరీ యింత కఠినంగా మాట్లాడతా రనుకోలేదు రాజూ! నావల్ల ఈనాడు నువ్వు నానామాటలు పడాల్సివచ్చింది." అంది.

"మనకు తెలిసింది, మనం విన్నది మీ నాన్న అన్నమాటలే. ఎందుకంటే మనం ప్రత్యక్షంగా విన్నాం కాబట్టి. కాని, నిన్ను నేను తీసుకొచ్చిన మర్నాడు లోకం ఏమనుకుందో, ఎన్ననుకుందో వూహించలేవు కరుణా! ఇది సహజం. సమాజలక్షణం. యిలా బాధపడుతూ బావురుమంటూ బ్రతకడం కష్టం. మనకు నచ్చిన పని మనం చేసాం! ఎదుటివారెప్పుడూ విమర్శించడం తప్ప హర్షించరు. అది వాళ్ళ సహజగుణం. అన్నిటిని భరించి ధైర్యంగా వుండాలి కాని....యిలా బేలగా ఏడుస్తారా?" అన్నాడు ఓదారుస్తూ.

"అది కాదు రాజూ....నాన్న నిన్ను.. "

"ఆయన కూతురును అమాంతం తీసుకొచ్చాను కదూ! అందుకని చెప్ప కుండా తీసుకొచ్చినందుకు ఘనంగా కట్నాలు కానుకలు యిచ్చారు." అన్నాడు నవ్వుతూ. అతని నవ్వు చూసి విస్తుపోయింది కరుణ.

"కరుణా! అందరిని కాదని నా జీవితంలోకి వచ్చిన నిన్ను సుఖపెట్టడా నికే ప్రయత్నిస్తాను. కొదులేని నా జీవితంలో కోడువు, నా ఒంటరితనానికి విందు తనాన్ని యిచ్చిన నా జీవితానివి!" అంటూ దగ్గరికి తీసుకున్నాడు రాజు. పసి పాపలా వొదిగిపోయింది కరుణ.

"ఈ యిల్లు చాలా ఇరుకుగా వుంది కదూ కరుణా! ఒకటే గది. అన్నీ ఈ గదిలోనే " కాఫీ చేస్తున్న కరుణను ఉద్దేశించి అన్నాడు రాజు.

"ఇలాగే బావుంది. ఎంచక్కా నేను వంటచేస్తుంటే మీరు పడుకొని చూడొచ్చు. యింట్లోవున్న ప్రతిక్షణం మనం ఒకరినొకరం చూసుకోవచ్చు!" అంది కరుణ.

"నిజం చెప్పు కరుణా! ఈ ఒక్క గదిలోనే సర్దుకోవడం...."

"ఏం ఇబ్బందిగా లేదు. మనిద్దరికి ఇదసలు పెద్ద గది. అయినా నేను కాపురంచేసేది ఈ గదిలో కాదు యిక్కడ " అంది అతని గుండెలమీద తల ఆనించి.

"ఊఁ అయితే మరీ మంచిది. గది ఖాళీచేసేద్దాం. నీ గుండెలో నేను, నా గుండెలో నువ్వుంటే గది ఎందుకు? అద్దె దండగ" అన్నాడు నవ్వుతూ. కరుణ నవ్వేసింది.

"ఏంవున్నా లేకపోయినా రోజులిలా గడిచిపోతే చాలు రాజా ! యింకేం వద్దు," అన్నది కరుణ.

"ఊఁ పెద్ద కోరికే"

"యిది పెద్ద కోరికా ?" అంది విస్తుపోతూ.

"నీ సహనానికి పరీక్ష ఈ జీవితం." అన్నాడు రాజా.

"గెలుపు నాదే "

"నీ గెలుపే నాకు కావాలి కరుణ. నువ్వు గెలిస్తే నా జీవితంలో నేను కోరుకునేది యింకేం వుండదు" అన్నాడు.

మూడు నెలలు గడిచిపోయాయి. కొత్తకాపురాలు కలలా గడిచి పోయాయి. రాజారావు, రాంబాబు కలిసి, పేపర్‌లో పడ్డ ప్రతి ఉద్యోగానికి దరఖాస్తులు పెట్టుకోవడం, ఇంటర్వ్యూ అంటూ వస్తే వెళ్ళిరావడం జరుగు తుంది. కాని ఏ ఉద్యోగం రాలేదు. వచ్చే అవకాశాలు చాలా తక్కువగా కన్పించడంతో, రాజారావు విసిగిపోయాడు. రాంబాబు కూడా.

"రేయ్ బాబీ ఈ ఇంటర్వ్యూల పేరుతో బోల్డు డబ్బు ఖర్చవు తోందిరా ఉన్న ఉద్యోగంతో సరిపెట్టుకోలేక, రాని ఉద్యోగంకోసం ఈ పరుగులో ప్చ నా కేమిటో ఈసారి ఎలాంటి ఉద్యోగం వచ్చినా నేను ప్రయత్నించను" అంటూనే తిరిగి పరుగుపెట్టి ఒకరినొకరు చూసుకొని నవ్వుకునేవారు.

ఈ మధ్యకాలంలో రాంబాబు ఉదయంవేళ నాలుగు ట్యూషన్లు చూసు కున్నాడు. ఓ వందరూపాయలు అదనంగా రాసాగాయి.

కారుషెడ్డులాంటి గదిలో.... కాదు కాదు, గదిలాంటి కారుషెడ్డులో రాంబాబు, రాధల కాపురం హాయిగా సాగిపోతోంది.

అది ఆరుయిళ్ళ లోగిలి. ఆ యిల్లు మంగమ్మ అనే యిల్లాలుది. మొగుడు పోయాక, పెద్దగావుండే ఒక్క గదిలో సర్దుకుని మిగతా గదులు

చిత్ర-చిత్ర

నిజం సుమా! వాళ్ళ యిబ్బంది వల్ల బారు పెట్టుకుని యిన్నాళ్ళయిందో....
పిల్లలు బారు వాళ్ళకి కూడా మొహం వాచి పోయారంటే నమ్ము!!




చివరికి, మొగుడు బ్రతికుండగా వుండే కామేచ్ఛకూడా అద్దెకు యిచ్చేసింది. అన్ని కాపురాలు కూడా మధ్యతరగతి కుటుంబాలే. చాలీచాలని జీతాలతో, తీరని అవసరాలు, కోరికలతో ఉదయం లేచినప్పటినుంచి సాయంత్రం వరకు ఏదో పోరాటం తాపత్రయం అందనిదానికోసం పరుగు అందుకోవాలనే ఆరాటం సాయంత్రానికి మిగిలే అలసటతో యింటికి చేరి, నాలుగు మెతుకులు కొరికి, నిద్రలోకి జారిపోవడం.

జీవితం యాంత్రికంగా మారిపోయింది. ఓ పూటైనా కడుపునిండా తినగలిగితే చాలనుకునే కనీసపు కోర్కెతో మిగిలిపోయారు కొందరు.

ఉన్నదాంట్లో తృప్తిపడే జీవితాలు కాకపోయినా లేనివానికోసం పరుగు, పోటీ తప్పని ప్రపంచంలో కక్షలు, కావేషాలు కోపాలు, శాపాలు .. చిలికిచిలికి గాలివానగా మారే చిలిపి కయ్యాలు.. ఓహ్... జీవితం అంతా సమస్యల వలయంగా ఒకరికి, అవసరాల విలయంగా మరొకరికి, విరాళ మిగిలి చీకటిగా కొందరికైతే, రేపుకోసం ఆ రేపులో సుఖం, సంతోషం, ఆనందం, తృప్తి వుండాలని ఆరాటంతో శ్రమిస్తూ కలలు పండిన వెలుగు

దారిగా, పొలప్పుంతగా కొందరికి.... జీవితం అంతా రంగుల వలయంగా కన్పిస్తుంది, అన్పిస్తుంది కూడా.

రాంబాబుకు ఓ వంద రూపాయలు ఎక్కువ రావడంతో, ఆ కొంపషెడ్డు లాంటి గదిలో వుండకూడదనుకున్నాడు. కాని, రాధ ఒప్పుకోలేదు.

"మనిద్దరికి ఈ గది సరిపోతుంది. ప్రస్తుతానికి ఈ గదితో సరిపెట్టుకుందాం. వందరూపాయలు ఎక్కువ వస్తే.... యింతకుముందు మన కనీసావసరాలు తీరకుండా వుండేవి. ఇప్పుడు అవి...."

"ఏమున్నాయ్...." అన్నాడు.

జవాబుగా నవ్వేసింది రాధ.

రాంబాబు మరేం అడగలేదు.

అతనికి తెలుసు. రాధ చెబుతుందనుకున్నాడు. కాని చెప్పలేదు.

రోజూ ఒక్కకూరతో భోజనం కానిస్తున్నాడు. పెరుగు అనేది అసలు లేదు. నెయ్యి మరిచిపోయాడు.

ఉదయం ఒక్కపూట కాఫీ తాగుతున్నారు. ఒక్క సినిమాకు కాని, కనీసం పార్కుకు వెళ్ళలేదు. రాధకు ఒక్క చీర కాదుకదా, జాకెట్టు కూడా కొనివ్వలేకపోయాడు. ఆ విషయాలలో తాను బాధపడ్డా రాధ బాధపడ్డట్టు కన్పించదు. ఎప్పుడూ నవ్వుతూ కన్పిస్తుంది.

ఉదయం తనతో పాటే కాఫీ తాగుతుంది. తాను ట్యూషన్లు చెప్పి వచ్చే వరకి భోజనం చెయ్యదు. ఒక్కటే కూర, చారుతో పైగా దగ్గర కూర్చొని వడ్డిస్తుంది. [illegible] తింటుందేమో? రాత్రి తను వచ్చేసరికి [illegible] అవుతుంది. బిడ్డలకొట్టు [illegible] మెరుపుగా వుంటుంది. తను [illegible] ఒద్దు చెబుతూ [illegible] జీవితం [illegible] కాని.... [illegible] ఎన్ని లోట్లు .... ఎన్ని లోపాలో

ఆ ట్యూషన్లతోను, బిడ్డలకొట్లో పనితోటి తీరిక లేని అలసట చోటుచేసుకుంటుంది. యింకా కష్టపడి సంపాదించలేను, టైమ్ కూడా లేదు. అంతకుమించి ఏం చేయలేడు. కాని, గొర్రెతోకలా యిలాగే అయితే, జీవితమంతా యిలాగే గడిస్తే.... ఎంత అసంతృప్తి....

రాంబాబు మాటలు విని జాలిగా నవ్వేస్తూ "యింకా అసంతృప్తి అంటూ ఎక్కడుందో చెప్పండి? యింకేం కావాలి మీకు? మనిషికి కావలసిన కనీసవ

పరాలు తీరుతున్నాయి చాలదూ? ఇవికూడా లేనివాళ్ళ గతేంకాను? వాళ్ళెలా బ్రతుకుతున్నారూ? వాళ్ళతో పోల్చుకుంటే, జీవితంలో అసంతృప్తికి చోటేది? అశాంతి అనేది ఎక్కడుంది?" అనేది.

ఈ జీవితం నీకు సంతృప్తికరంగానే వుందా రాదా?" అనే రాంబాబు ప్రశ్నకు, మెరిసే కళ్ళతో నవ్వేసేది రాధ.

రాంబాబు సలహాపై రాజారావుకూడా ట్యూషన్లు కుదుర్చుకున్నాడు. అతను ఉదయమేకాకుండా సాయంత్రం కంపెనీనుండి ఆరుగంటలకల్లా తిరిగిరావడం వల్ల సాయంత్రం కూడా ట్యూషన్లు చెప్పడం మొదలుపెట్టాడు. తన జీతానికి మరో మూటయ్యారై రూపాయలు అదనంగా రావడంతో కరుణ యింట్లోకి కొన్ని సామానులు కొనేసింది.

కాని, రాజారావు రెండు నెలల్లో సంపాదించిన అదనపు డబ్బు యింట్లోకి గిన్నెలు, డబ్బాలు కొనుక్కోవడంతోనే, యింట్లోని అవసరాలకు కొంతపోగా, తనకంటూ ఏమీ కొనలేకపోయాడని కరుణకు మనసు చిన్నబోయింది.

"కరుణా! యిక ఈ నెలలో యింట్లోకి సామాన్లేవీ కొనకు సుమా! యింటి అవసరాలకు పోగా డబ్బు మిగిలితే నా కివ్వు" అన్నాడు.

కరుణ అతన్ని అర్థంచేసుకోలేదు. ఉక్రోషంగా మిగిలిన ముప్పయ్ రూపాయలు యిచ్చేసింది ఆ సాయంత్రం రాంబాబు పనిచేసే బట్టలదుకాణంలో ఇన్ స్టాల్ మెంట్ పద్ధతిలో రెండు చీరలు తీసుకువచ్చాడు రాజారావు.

వంటచేసుకుంటున్న కరుణ, వెనక నుండి రాజారావు వచ్చి రెండుచేతులతో మూసేయడంతో ఉలిక్కిపడిపోయింది.

కోపంగా అతని చేతులను విదిలించికొట్టింది.

"కోపమేనా?" అన్నాడు.

కరుణ మాట్లాడలేదు

"ఎందుకు?" అన్నాడు దగ్గరకు తీసుకొని

"డబ్బు నేనేం చేసుకుంటానని అంత నిక్కచ్చిగా తీసుకెళ్ళారు?" అంది కోపంగా.

"యింకా నీ యీ వంటింటి సామ్రాజ్యానికి కావలసిన గిన్నెలకు డబ్బాలకు తగలేస్తావని తీసుకున్నాను."

"కరుణా! మన పెళ్ళయి మూడు నెలలైనా నీ కంటూ ఓ చీర కొనలేని దౌర్భాగ్యుణ్ణి. ఏనెలకానెల కొనాలనుకుంటే. నాతో చెప్పకుండా ఈ సామాన్లన్నీ

కొవేసావు. అందుకని ఈ నెల అయినా నీకు చీర తీవాలని అలా తీసు కున్నాను."

"ముప్పయ్ రూపాయల్లో ఎన్ని చీరలొస్తాయ్" అంది వెక్కిరింతగా. రాజారావు చిన్నబుచ్చుకున్నాడు. కరుణ తన తప్పు గ్రహించి– "రాంబాబు వాళ్ళకొట్లో రాధకు కూడా అరువు తీసుకున్నాడు రెండు చీరలు. నేను తీసుకొచ్చాను. నెలకు ఇరవై చొప్పున కట్టాలి. ముందుగా ఇరవై కట్టాలి అది కట్టేసి తెచ్చాను." అంటూ చీరలు చూపించాడు.

రాజారావు తెచ్చిన చీరలు కరుణకేం నచ్చనట్టు మొహంపెట్టి "ఈ కలరేం బావులేదు" అంది.

"అదేం ... నీ వొంటికి ఇది బాగా నప్పుతుంది కరుణా! చూడు" అంటూ విప్పి భుజంమీదుగావేసి చూపించాడు.

"ఏమో.... నాకేం బావులేదు. నన్ను తీసుకెళ్తే నేను తెచ్చుకునేదాన్ని" అంది.

రాజారావు చిన్నబుచ్చుకున్నాడు. "నీకు నచ్చదేమోనని రాంబాబు అన్నాడు కాని, నాకు ఈ చీర బాగా నచ్చింది కరుణా! పోనీ నీ కిష్టంలేకపోతే మార్చేస్తాను" అన్నాడు చీర అందుకుంటూ.

కరుణ చటుక్కున చీర లాక్కుని లోపలికి వెళ్ళిపోయింది.

అరగంటలో స్నానంచేసి కొత్తచీర కట్టుకొని వచ్చింది. రాజారావుకేం అర్థంకాలేదు. రెండు చేతులు రాజుమెడచుట్టూ పెనవేసి "మీరు ఇష్టపడి తెచ్చారో లేదోనని ఇలా అన్నానంతే" అంటూ నవ్వేసింది.

"జేబులో ఇంకా పదిరూపాయలున్నయ్. సినిమాకు వెడదాం కరుణా" అన్నాడు.

"వద్దు నెలంతా గడవాలిగా"

"ఫర్వాలేదు.... ఏన్నొక్క సినిమాకుకూడా తీసుకుపోలేదు, పద...." అన్నాడు.

"ఊహూఁ— వచ్చే నెల బడ్జెట్‌లో చూద్దాం. హాయిగా యింట్లోనే వుందాం" అంది అతని 'చొక్కాగుండీలు సవరిస్తూ.

"అయితే నీ యిష్టం" అన్నాడు.

"ఉదయం నుండి కోపంగా నా గురించి ఆలోచిస్తూ బుర్ర పాడుచేసు కున్నావా!" అన్నాడు.

కరుణ కళ్లెత్తి రాజారావు కళ్ళలోకి చూసి తలవాల్చేసుకుంది.

"ఈ నెల్లో ఏం కొనాలనుకున్నావ్ కరుణా నీ సామ్రాజ్యంలోకి?" అన్నాడు నవ్వుతూ.

కరుణ జవాబియ్యకుండా అతని వొళ్ళో మొహం దాచుకుంది.

"మనింట్లో ఏంవున్నాయని చాలా కొనాలి" అంది క్లుప్తంగా.

"చాలా అంటే "

"రాధావాళ్ళింట్లో వున్నాయి చూడండి."

"ఓహో " అంటూ నవ్వేస్తూ, రాజారావు కరుణను దగ్గరకు తీసుకొని —"మనకు వీలైన పరిధిలో జీవించటం అలవాటుచేసుకుందాం కరుణా। రాధకు వాళ్ళవాళ్ళిచ్చారు. నువ్వేమో మీ వాళ్ళని కాదని నన్ను పెళ్ళిచేసుకున్నావు. ఈ యింట్లో అన్నిలేవు. నీకోసం అన్నీ కొంటాను కాని, యిప్పుడేకాదు. యింకొవాళ్ళ పోనీ" అన్నాడు.

రాజారావు ఎంతో అనునయంగా చెప్పాడు. కరుణ బుద్ధిగా తలూపింది. కాని మనసులో ఏమూలో—"రాధకు వాళ్ళవాళ్ళిచ్చారు" అనే మాట మెదులుతూ, మీ వాళ్ళేం యివ్వలేదు అని పరోక్షంగా రాజా అన్నట్టుగా ఊహించుకుంది.

రాజుకోసం కాదూ తను వాళ్ళను వొదిలి వచ్చింది. అలాంటప్పుడు తానేం తేగలదు? వాళ్ళేం యిస్తారు? నాన్నకు రాజు అంటే ఇష్టంలేదు. తమ కులం కాదని, ఏమీ లేనివాడని, వారాలు చేసుకు బ్రతికాడని కోపం కాదు.

రాజును తాను ప్రేమించడం గొప్ప, రాజుకోసం తన కులాన్ని, తన వాళ్ళను వొదులుకొని రావడం గొప్ప కదూ? తను చేసిన ఈ త్యాగం రాజు ఎప్పుడు గుర్తిస్తాడూ!

"కరుణా!" రాజు పిలుపుకు కరుణ ఉలిక్కిపడింది.

"ఏమిటో ఆలోచన్లో పడిపోయావ్."

"ఊఁ ఊహూఁ ఏంలేదు" అంది.

"అబద్ధం కూడా చెబుతున్నావా కరుణా!" అన్నాడు.

"లేదు."

"అయితే చెప్పు ఏం ఆలోచిస్తున్నావో...."

"నీ గురించే" అంది.

"ఏమిటి!"

"మన పెళ్ళి నాన్నకు ఇష్టంలేదు కదూ రాజూ. అలాంటప్పుడు నాకు

వాళ్ళేం యిస్తారు. వాళ్ళేం యివ్వలేదన్న విషయాన్ని ఎందుకు గుర్తుచేస్తావ్ ?
నీ కోసం కాదూ వాళ్ళను నేను వొదులుకొని వచ్చింది" అంది మెల్లిగా.

రాజు క్షణంపేపు నిశ్చేష్టగా అయిపోయాడు.

"నేను అన్న విషయం కూడా అదే కదూ కరుణా ! వాళ్ళు ఇవ్వలేదని నిన్ను బాధపడొద్దని అన్నాను" అన్నాడు.

కరుణ మౌనంగా కళ్ళు మూసుకుంది.

"కరుణా ! ఇదుగో నా నెలజీతం " అంటూ రెండువందలు కరుణ చేతిలో పెట్టాడు రాజు.

"రెండువందలేనా ?" అన్నట్టుగా చూసింది కరుణ. రాజు అదేం గమనించకుండా "హమ్మయ్య. యిక నా పని అయిపోయింది కరుణా ! మళ్ళీ ఫస్టువరకు ..." అంటూ కరుణలో ఎలాంటి కదలిక లేకపోవడంతో విస్మయంగా తలెత్తి చూశాడు.

"కరుణా !. ." పిలిచాడు.

"ఊఁ .. "

"ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?"

"జీతం నా కిస్తున్నారేమిటి ?" అంది.

"మరి... ఈ యింటి యజమానురాలివి. గృహిణివి" రాజు నవ్వుతూ అంటున్నా, కరుణ ఎందుకో నవ్వలేకపోయింది,

"ఈ రెండువందలు మనకు సరిపోతాయా ?" అంది,

"ఆహాఁ యింటి అద్దెకు యాభై రూపాయలు పోను, నూటయాభై రూపాయల్లో మనం . రెండుపూటలా తినగలగాలి" అన్నాడు.

కరుణ ఆహ్లాదలేదు. రెండువందలలో... ఇద్దరూ నెలంతా తినడానికే సరిగ్గా సరిపోవు. యిక సరదాలు అంటూ ఏం వుంటాయ్... ఖచ్చితంగా యింట్లోకి కావలసిన వెచ్చాలకు కూడా సరిగ్గా సరిపోని ఈ డబ్బుతో. నెలంతా గడపడం.

"కరుణా ! ఏమిటోయ్ అంతగా ఆలోచిస్తున్నావ్ ?" అంటూ భుజాలు పట్టి కుదుపుతూ . "పద. ..ఆకలిరాముడు గోలపెడ్తున్నాడు" అన్నాడు కరుణను ఆలోచించనీయకుండా లాక్కెళ్ళుతూ.

"రాజా ! నిజంగా ఈ డబ్బుతో నెలంతా... " కరుణ ప్రశ్నకు నిటారుగా నిలబడిపోతూ—

"సర్దుకోవాలి కరుణా ! తప్పదు నాకు మంచి ఉద్యోగం వచ్చేవరకు. ..




మరి." రాజు మాటలకు కరుణ ఉలిక్కిపడిపోతూ—మరేం మాట్లాడలేదు,

రాజు భోజనంచేసి బయటికి వెళ్ళాడు,

కరుణ ఎందుకో సరిగ్గా భోజనం చేయకపోవడం గమనించిన రాజు అదోలా అయిపోయాడు. కరుణ ఆలోచనలు పసికట్టకలిగిన రాజుకు, ఆ క్షణంలో కరుణ పట్ల జాలి, తన పరిస్థితిపట్ల బాధ కలిగాయి,

కాని. ఏం చేయగలడు? తన పరిస్థితి, ఎదురయ్యే ఒడిదుడుకుల గురించి కరుణకు ముందే చెప్పాడు. సర్దుకోగలనని ధైర్యంగా చెప్పింది. చివరికి...

ఛ.. .కొత్త కదూ! గాభరాపడిపోయి వుంటుంది. తను అనవసరంగా ఆలోచిస్తున్నాడేమో! అనుకున్నాడు. తన మనసుకు తానే సర్ది చెప్పుకున్నాడు.

కరుణ మాత్రం. . అన్యమనస్కంగా కూర్చుండిపోయింది. ఎంత ఆలోచించినా ఒక్క నిర్ణయానికి రాలేకపోయింది.

పరిస్థితులతో రాజీ పడిపోవాలి. ఎలాంటి ఒడిదుడుకులనైనా రాజు పీడలో ఎదుర్కొనే శక్తి తెచ్చుకోవాలి అని మనసు ఓ ప్రక్క చెబుతుంటే...

కొత్తగా పెళ్ళయింది. రాజుతో తన జీవితాన్ని ఎంతో అందంగా ఊహించుకుంది, ఎన్నో రంగురంగుల కలలు.... అవన్నీ.... ఎలా, ఎప్పుడు తీరుతాయి.

రాజుకు మంచి ఉద్యోగం దొరికాక?

ఎప్పుడు ?

కాలం చెబుతుందా ప్రశ్నకు సమాధానం.

అంతవరకు.

ఈ సంఘర్షణ తప్పదేమో . .

తానిలా ఆలోచించడం రాజు గుర్తిస్తే—బాధపడకాదేమో! ముందుగానే చెప్పాడు. కాని తాను వినలేదు. మొండికెత్తుకుంది. రాజుకంటే ఎక్కువ ధైర్యంగా ముందడుగు వేసింది. ఈనాడు తన ఆలోచనలను రాజు పసికడ్తే.... వ్చ....

కరుణ ఆత్రుతగా రాజుకోసం ఎదురుచూడసాగింది. రాజు అరగంటలో తిరిగివచ్చాడు.

"ఇంతసేపు వెళ్ళారేమిటి ?" అంది చిరుకోపంగా.

"ఇప్పుడేగా" అన్నాడు.

"పొద్దుటినుండి యింట్లో ఒక్కర్తినే వుంటానా ! మీరు రాగానే మళ్ళీ ఎక్కడికి వెళ్తారు !" అంది.

"రాంబాబు దగ్గరికి వెళ్దామని బయలుదేరాను కరుణా ! సగం దూరం వెళ్ళాక ఈ వేళప్పుడు బావుండదని....మళ్ళీ వచ్చేసాను."

"అంటే... ఈ వేళప్పుడు . ."

"నిన్ను ఒంటరిగా వొదిలి, వాళ్ళ ఏకాంతాన్ని చెడగొట్టడం ఎందుకని" అంటూ రెండు చేతులతో కరుణను చుట్టేసి దగ్గరకు లాక్కున్నాడు.

"కరుణా ! ఆలోచించడం మంచిదే కాని సమస్య గురించి ఆలోచించే బదులు జరిగిపోయినదాన్ని గురించే, తెలిసినదాన్ని గురించే ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోవడం . బావుండదు. అలాంటప్పుడు ఆలోచించడం మానుకోవాలి."

"మనిషికి సంతృప్తి యిచ్చే ఆనందం, సుఖం, శాంతి ప్రపంచంలో మరేది యివ్వదు. మనకంటే యింకా దీనంగా, హీనంగా ఉన్నవాళ్ళతో పోల్చుకుంటే మనం చాలా అదృష్టవంతులం. అలా అనుకుని తృప్తిపడ్డం గొప్ప విషయం.. "

"ఇప్పు డవన్నీ ఎందుకు ?" అంది కరుణ, రాజు గుండెలమీద చేత్తో రాస్తూ.

"రాంబాబుకు నూట యాభై రూపాయలే జీతం. వాడి యింటి అద్దె పోను

మిగిలేది నూటపది రూపాయలే. వాళ్ళిద్దరు మనలానే కొత్త జంట. ఎలా గడుపుకుంటారో పాపం.. పోతే— ఇప్పుడు చీకటి— తెల్లవారితే వెలుగు వస్తుంది. ఆశ మనిషికి ఊపిరివంటిది. అవునా!" అన్నాడు కరుణ తల నిమురుతూ. అప్పటికే కరుణ నిద్రపోయింది. ఆమె మొహంలో పసిపిల్ల మొహంలో కదిలే అమాయకత్వం.

"రాధా! నెలంతా ఈ డబ్బు సరిపోతుందా?" అన్నాడు బిక్కమొహం వేసి రాధవంక చూస్తూ.

"మీరు ముందుగా భోజనం చేయండి. ఆ తరువాత నేను చెబుతాగా" అంది, పీట వాల్చి కూర్చుంటూ. రాంబాబుకు అన్నం వడ్డిస్తూ— త్వరగా తినండి అంది.

"ఎందుకు?"

"చెబుతాగా" అంటూ నవ్వేసింది.

యింటికి కావలిసిన వెచ్చాల లిస్ట్ వేసి, ఎన్నో కూడికలు, మరెన్నో తీసివేతలు ఆలోచిస్తున్న రాధ వొళ్ళో తలపెట్టుకొని పడుకొని— "చాలా తొందరపడ్డావు రాధా! మరి కొన్నాళ్ళపాటు నువ్వక్కడే వుంటే, నేను యింకాస్త మంచి ఉద్యోగం "

"యిప్పుడేమైంది!" అంది రాధ.

"మన యింటి ఖర్చులకు కూడా సరిగ్గా సరిపోని ఈ జీతం నీ సరదాలు కోరికలు "

"ఏమున్నాయ్ మీతోపాటే నేను. చూడండి! అనవసరంగా ఆలోచిస్తూ బాధపడి బుర్రలు బద్దలుచేసుకోకండి. మీతో యిలా, బ్రతకడం కంటే గొప్ప కోరిక, సరదా నా కింకొకటి లేదు. పైగా నేనేం గొప్పింటి అమ్మాయిని కాను. నగటు కుటుంబంలో నుండి వచ్చినదాన్నే. యింటి బాధ్యత నాది పరేనా మీరు హైరాన పడిపోకుండా మంచి అబ్బాయిలా వుంటే చాలు" అంది

రాంబాబు మాట్లాడలేదు. కానిచ్చిన డబ్బుతో నెలమొత్తం తిండికి కూడా సరిగ్గా సరిపోదని కాని ఏం చేయగలడు. ఆ ఉద్యోగం దొరకడమే ఎంతో గగనం అయిపోయింది. మంచి ఉద్యోగం దొరికేవరకు ఎలాగో రాజీపడిపోతే.

కాని రాజీపడడానికి కూడా ఓ హద్దు వుంటుంది. తినడానికి తిండి

సరిగ్గా పెట్టలేని తను .. రాధను ఎన్నాళ్ళని ఒంటిపూట భోజనంతో ఒప్పించ గలడు?

రాధకు తనంటే ప్రాణం.

తానంటే ప్రేమ, అభిమానం.

కాని

రోజులు యిలాగే గడిస్తే, రాధ కిప్పుడు వుండే ఓర్పు, నేర్పు స్థానంలో తనపట్ల కోపం, తన అసమర్థత పట్ల ద్వేషం కలుగుతాయి. అది తాను భరించలేడు. మూడుముళ్ళతో పెనవేసుకున్న జీవితబంధం పవిత్రంగా ప్రశాంతంగా సాగాలే తప్ప కోపం, అసహ్యం కలగకూడదు.

ఏది ఏమైనా తాను మాత్రం ప్రయత్నించాలి. ఒకటి రెండు నెలల్లో మంచి ఉద్యోగం . కనీసం రాధ కనీసవసరాలు తీర్చగలిగే ఉద్యోగం సంపాదించాలి....

"మంచి అబ్బాయిలా అంటే యిలా ఆలోచిస్తూ పడుకునే అబ్బాయిలా కాదు. అన్నీ మరిచిపోయి ప్రశాంతంగా నిద్రపోవాలి" అంది రాధ అతన్ని జోకొడుతూ.

"రాధా నీకు నీకేం బాధగా లేదూ?"

"ఎందుకు? . "

రాంబాబు మాట్లాడలేదు.

"చూడండి! చాలీచాలని జీతంతో ముగ్గురాడపిల్లలతో రోగాలతో రొష్టులతో సాగిపోయే సంసారాలను చూసాను. మా నాన్న కూడా గొప్ప వాడేం కాదు. మధ్యతరగతి కుటుంబంలో నుండి వచ్చిన నా గురించి మీరు దిగులుపడకండి. నా కంటూ కోరికలు, సరదాలు కలిగాలే కాని, మీతో చెప్పక ఎవరికి చెబుతాను? తీర్చవలసినవారు మీరే కదా! మంచిరోజులు మన కొస్తాయన్న నమ్మకం గుండెలనిండా ఆశ నాకుంది. మీరు మీరేం ఆలోచించకుండా బుద్ధిగా నిద్రపోండి " అంది.

"అదికాదు రాధా!" అనలు . -

"ష్ " అంటూ అతని మొహాన్ని తన గుండెల్లో దాచుకొని. . తల నిమురుతూ పసిపాపను లాలించేలా లాలిస్తుంటే కాసేపట్లోనే ప్రశాంతంగా నిద్రపోయాడు రాంబాబు.

"అలా రాంబాబు యింటికి వెళ్ళివద్దామా! అన్నాడు రాజు.



ఆ రోజు ఆదివారం. రాజు యింట్లోనే వున్నాడు. ఉదయం నుండి ఏం తోచటంలేదు రాజుకు. కరుణకు కూడా అంతే. అందుకనేమో రాజు అలా అడగ్గానే కరుణ ప్రాణం లేచివచ్చింది.

వెంటనే బయలుదేరింది.

వాళ్ళు వెళ్ళేసరికి రాంబాబువాళ్ళు కూడా ఎక్కడికో బయలుదేరారు.

"మీ యింటికని బయలుదేరాం" అన్నాడు రాంబాబు.

"ఏలాగు అన్నయ్యవాళ్ళ యింత దూరం వచ్చారుగా" అంటూ వేసిన తాళం తీసి లోపలికి దారితీసింది రాధ.

ఒక్కటే గది. చాలా నీటుగా చక్కగా వుంది. చిన్న గదిలోనే సామానంతా ఏది ఎక్కడుండాలో అక్కడ పొందిగ్గా అమర్చుకుంది రాధ.

పైగా పెళ్ళిలో యిచ్చిన సామానంతా ఈ మధ్య రాధతండ్రి ఆ ఊరినుండి యిటు వచ్చే లారిలో వేసి పంపించాడు.

రాజువాళ్ళింట్లోకంటె రాంబాబు దగ్గిర ఎక్కువే వుంది.

చాప వేసి "కూర్చొండి వదినా" అంది స్టౌ వెలిగించి కాఫీ నీళ్ళు పడేస్తూ.

"యిప్పుడు కాఫీ ఏం వద్దు రాధమ్మా! యిందాకే తాగివచ్చాం" అన్నాడు రాజు. రాధ జవాబివ్వకుండా నవ్వేసింది.

కరుణ మాట్లాడకుండా గదంతా పరీక్షగా చూస్తోంది.

తమతో పాటే మొదలైంది వాళ్ళ సంసారం. అయినా తన యింట్లో ఏమీ లేవు. నిరాడంబరంగా వుంటుంది. సామానేమీ అంతగా వున్నట్టు కన్పించదు. తను కూడా కొనాలి. రాజుకు చెప్పాలి కొనమని. కనీసం ఈ మాత్రమైనా లేకపోతే ఏం బావుంటుంది?

కరుణ ఆలోచన్లో వుండగానే రాధ కాఫీ తీసుకువచ్చింది.

రాజారావు, రాంబాబు కలిసి, ఎక్కడెక్కడ వేకెన్సీలు వచ్చాయో చెప్పుకుంటున్నారు.

కరుణ గదంతా పరిశీలనగా చూడ్డం గమనించి రాధ

"మొన్న నాన్నగారు లారీలో పంపించారు వదినా! మొన్నటి వరకు ఏంలేకపోయినా నాదంటూ ఓ సంసారం ఏర్పడిందని ఇవన్నీ అవసరం అని పంపించారు." అంది మామూలుగా.

కాని కరుణ సరిగ్గా అర్థంచేసుకోలేకపోయింది. తనకు వాళ్ళ నాన్న పంపించాడు. కరుణ కెవరూ పంపించకపోవడానికి కారణం, కరుణ రాజా రావుల పెళ్ళి పెద్దవారి యిష్టాలమీద జరగకపోవడమే కారణం అయినట్టు ఊహించుకుంది కరుణ.

క్షణంలో మొహంలో రంగులు మారాయి, రాంబాబుతో మాట్లాడుతున్నా ఓ చెవి వాళ్ళవైపు పారేసిన రాజు మాత్రం, కరుణ మొహంలో మార్పు గమనించలేదు కాసేపటికి రాజు లేచి నిలబడుతూ "వెళ్తాంరా" అన్నాడు కరుణ చటుక్కున లేచి బయటకు వచ్చింది రాజు వెనక.

దారిపొడుగునా కరుణ ఏమీ మాట్లాడలేదు. రాజు కూడా నిశ్శబ్దంగా వచ్చాడు.

భోజనాలు అయ్యేవరకు కూడా ఏమీ మాట్లాడుకోలేదు. కరుణ తిన్లేదని గ్రహించాడు రాజు.

రాధ అన్న మాటల్లో రాజుకేం తప్పు కన్పించలేదు. కాని కరుణ ఎందుకలా వుందో సరిగా అర్థంకాలేదు.

"కరుణా !" ఓ ప్రక్కకు వొదిగి పడుకున్న కరుణను పిలిచాడు రాజు.

కరుణ మాట్లాడలేదు.

చేయివేసి తనవైపు తిప్పుకున్నాడు.

"అలా వున్నావేం?" అడిగాడు.

"                    "

"కరుణా " దగ్గరికి తీసుకుంటూ పిలిచిన రాజు ఉలిక్కిపడ్డాడు. అతని గుండెలకు తడి తగిలింది.

"ఏడుస్తున్నావా కరుణా? ఎందుకు?"

కరుణకు ఏడుపు ఉప్పెనలా ముంచుకొచ్చింది. రాజు గుండెల్లో తల దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఓహ్! ఏం జరిగింది కరుణా?" గాబరాపడిపోతూ అడిగాడు రాజు.

"అమ్మవాళ్ళు గుర్తుకు వచ్చారు రాజూ! అంతే" అంది

రాజు మనసు ఆర్ద్రతతో నిండిపోయింది. ఆమెను మరింతగా దగ్గరకు లాక్కొని గుండెలకు హత్తుకుంటూ "పిచ్చిపిల్లవు కరుణా నువ్వు" అన్నాడు, తల నిమురుతూ.

కరుణ మాట్లాడలేదు.

రాజుతో ఎంతో చెప్పాలని ఏదో చెప్పాలనివున్నా, రాజు పరిష్వంగంలోని హాయి ఆమెను మరేం మాట్లాడనీయలేదు తాత్కాలికంగా జరిగిందంతా మర్చిపోయింది.

మరో అరగంట గడిచేసరికి కరుణ నిద్ర పోగలిగింది కాని రాజుకు మాత్రం నిద్ర రాలేదు.

మనసంతా ఆలోచనలతో నిండిపోయింది.

కరుణ మొహంలో కదిలే అమాయకత్వం, పసితనం చూస్తుంటే, కరుణ యింకా ఎదగలేదు అనిపిస్తుంది. కరుణ చేసిన సాహసం ఏదో ఎడ్వంచర్‌గా చేసిందనిపిస్తోంది. చిన్న చిన్న విషయాలకే కదిలిపోతూ బాధపడే కరుణ ఎంతో వున్న జీవితంలో ఎదురయ్యే ఎన్ని వొడిదుడుకులను ఎలా తట్టుకో

గలదో.... తట్టుకోలేకపోతే ఎదురయ్యే పరిణామాలు ఎలా వుంటాయో ఆలోచించడానికి ఊహించడానికే భయంవేసింది.

కరుణ విషయంలో తాను తొందర పడ్డాడా?

లేక కరుణ తొందరపడిందా?

ఎవరు తొందరపడినా, ఎదురయ్యే పరిణామాలు ఇద్దరూ ఎదుర్కోవాలి. కరుణ దానికి సిద్ధంగా వుంటుందా! వుంటానని తనకు ధైర్యంచెప్పిందావాడు.... ఆలోచించుకో కరుణా అంటే.... నవ్వేస్తూ తేల్చేసింది ఆనాడు.... ఆలోచనల్లో పడిపోయాడు రాజు

* * *

వారం రోజుల తర్వాత—

"నేను కూడా ఏదైనా ఉద్యోగం చూసుకోనా?" గోముగా అడిగింది కరుణ.

భోజనం చేస్తున్న రాజారావు తలెత్తి చూసాడు. కరుణ అతని మొహం లోకే చూస్తోంది. కరుణ మొహంలో కదిలే అమాయకత్వం చూస్తుంటే నవ్వాగలేదు.

"ఎందుకు నవ్వుతున్నావ్" అంది.

"నీ అమాయకత్వం చూస్తుంటే!"

" "

"ఉద్యోగాలు అంత సులభంగా దొరికితే బావుండు కరుణా! మనకి బాధ వుండేది కాదు" అన్నాడు, చేయి కడుక్కొని లేస్తూ.

చాలా సేపు మౌనంగా వుండిపోయింది కరుణ.

"అదికాదు రాజా! మన ప్రక్క వీధిలో ఓ చిన్న స్కూల్ వుందిగా. వాళ్ళ స్కూల్లో ఒక టీచరు కావాలట" అంది, పక్కమీద వాలిన రాజారావు ప్రక్కనే కూరుంటూ.

"ఎవరు చెప్పారు?"

"మా ఎదురింట్లో వుంటుంది శోభ అని, ఆ అమ్మాయి చెప్పింది."

"ఊఁ" అన్నాడు రాజు.

రాజు వినడం చూసి, అసలు విషయం చెప్పింది.

"ఆ అమ్మాయి రేపు తీసుకెళ్తానంది. ఆ స్కూల్ హెడ్మాస్టర్ ఈ

అమ్మాయికి బాగా తెలుసు. తెలుసంటే ఈ అమ్మాయి పనిచేసేది అందులోనే. వాళ్ళ స్కూల్లో ఓ టీచరు పోస్టు ఖాళీగా వుందిట "

"కాని వాళ్ళు ట్రెయినింగ్ అద కావాలంటారేమో. "

"అక్కర్లేదట రాజా. నేను వెళ్తాను. మనం యింకొస్త మంచిగా బ్రతకొచ్చు" అంది.

"కాని"—

"నాకు ఒక్కర్తికే బోరుగా వుంది రాజా!"

"రోజంతా ఆ చిన్నపిల్లలతో అరవాలి. పైగా జీతం చాలా తక్కువ. నంతకం ఎక్కువ జీతానికి పెట్టించి తక్కువిస్తారు" అన్నాడు.

"పోనిద్దూ యింట్లో వుండడం కంటె నయం కాదూ! ఏదో వేణ్ణీళ్ళకు చన్నీళ్ళుగా వుంటుంది."

"కాని కరుణా! యింట్లో వంట మళ్ళీ స్కూల్, సాయంత్రం నేను ప్రయివేట్లుచెప్పి వచ్చేసరికి ఆలస్యం అవుతుంది, మళ్లీ నువ్వొక్కతివే పనంతా చేసుకోవాలి."

"మరేంఫర్వాలేదు రాజా! నే నంతగా చేసుకోలేకపోతే అప్పుడు చూద్దాం."

"ఉద్యోగం మానేయాలి" అన్నాడు.

"ఊఁ మరి వెళ్ళనా?"

"సరే —నీ యిష్టం" అన్నాడు.

కరుణ సంతోషపడిపోయింది. నిజానికి కరుణ ఆరోజే శోభతో వెళ్ళి మాట్లాడి వచ్చింది. జీతం డెబ్బయ్యైదు రూపాయలు.

కరుణకు సంతోషం వేసింది స్కూల్ దగ్గర చిన్నచిన్న పిల్లలు ఆడుతూపాడుతూ గడిపేస్తే, నెల తిరగ్గానే డెబ్బయ్యైదు రూపాయలు వస్తాయ్.

ముందుగా రాజుకు చెప్పలేదు. తీరా వాళ్ళు రేపటనుండే రమ్మనేసరికి చిన్న అబద్ధం ఆడేసింది.

శోభ ఎదురింటి అమ్మాయి. తల్లి మరో చెల్లి, తమ్ముడు వున్నారు. ఈ మధ్య ఎదురింట్లోకి కొత్తగా వచ్చారు. కరుణతో స్నేహం కట్టేసిందా అమ్మాయి.

"మధ్యాహ్నం అంతా ఖాళీగా వుండేకంటె మా స్కూల్లో ఓ ఖాళీవుంది చేరకూడదూ?" అంది.

కరుణకు కూడా ఉద్యోగం చేయాలనే వుంది. మరింత హాయిగా వుండొచ్చనే అనుకుంది

మర్నాడు ఉదయం, రాజు కాఫీ త్రాగి, ట్యూషన్‌కు బయలుదేరుతోంటే కరుణ చెప్పింది.

"నువ్వు వచ్చి వడ్డించుకు తినెయ్ రాజు! స్కూల్ తొమ్మిదింటికే, ముందుగా వెళ్ళాలట" అంది.

"సరే వాళ్ళు ఇస్తారంటావా కరుణా!" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకివ్వరూ!" అంటూ నవ్వేసింది.

రాజు వెళ్ళిపోయాడు.

కరుణకు ఆ ఉద్యోగం వస్తుందని రాజుకేమాత్రం నమ్మకంలేదు. ఈ ప్రయివేటు స్కూల్లో ట్రెయినింగ్ అని అదని ఇదని ఏవో చెబుతారు అనుకున్నాడు.

కాని విజానికి కరుణ ఆరోజు ఉద్యోగంలో చేరడానికి వెళ్ళిందని తెలీదు.

కరుణ ఉన్నదాంట్లో మంచి చీర కట్టుకొని చక్కగా ముస్తాబై శోభతో వెళ్ళిపోయింది.

రాజు వచ్చేసరికి కరుణ వెళ్ళిపోయింది. రాజు వడ్డించుకు తినేసి కంపెనీకి వెళ్ళిపోయాడు

రాజు సాయంత్రం ట్యూషన్లు ముగించుకొని వచ్చేసరికి కరుణ అతని కోసమే ఎదురుచూస్తోంది.

"ఊఁ. ఏమైంది ఇంటర్వ్యూ లాంటిది?" అన్నాడు నవ్వుతూ.

కరుణ మొహంలో ఉత్సాహం, ఆనందం చూసి, "ఊఁ అయితే ఉద్యోగం దొరికిందన్నమాట" అన్నాడు.

"అవును" అంది నవ్వుతూ

"జీతం ఎంత?" అని రాజు అడుగుతాడని ఎదురుచూసింది కరుణ. కాని రాజు అడగలేదు.

"జీతం డెబ్బయ్‌ఐదు రూపాయ లిస్తారట" అంది చివరికి తనే. రాజు నవ్వేసాడే తప్ప ఏమీ అన్లేదు.

"నీకు సంతోషంగా లేదా రాజూ!" కరుణ ప్రశ్నకు 'బాధగా వుంది కరుణా!' అని చెప్పాలనిపించింది. కాని, కరుణ ఉత్సాహం, ఆనందం చూసి ఏం చెప్పలేక నవ్వేశాడు.

"నా జీతం నూట క " అంటూ క్షణం ఆగి, రాజు ఏ మాత్రం




ఉత్సాహం చూపించకపోవడంతో— మౌనంగా వుండిపోయింది.

"కరుణా! ఈ చిన్ని గుండెలో ఎన్ని కోర్కెలు ఈ అందమైన కళ్ళలో ఎన్నో ఆశలు. నాకు తెలుసు. నువ్వు చెప్పేంత వరకు అర్థం చేసుకోని అవివేకిని కాను. కాని కరుణా నువ్వు నిన్ను చూస్తుంటే అప్పుడప్పుడు అనుమానంగా వుంటోంది. నీ కోర్కెలు, ఆశలు పెరిగి పెరిగి, అవి తీరక, నువ్వు బాధపడుతూ, నన్ను బాధపెట్టి, ఫలితంగా మనిద్దరి మధ్య దూరం పెరిగి, ఒకరినొకరు ద్వేషించే పరిస్థితి తెచ్చుకుంటామని, చేసిన దానికి పశ్చాత్తాపపడే స్థితి మాత్రం ఎన్నడూ కలగకూడదు"

"నాపట్ల నీకుండే నమ్మకం, ప్రేమ కలకాలం వుండాలి. నీ తోడుగా నీలో నీ నీడగా నేనుంటాను కరుణా!"—

మంద్రస్థాయిలో మృదువుగా చెబుతున్న రాజు మాటలకు తనను చుట్టిన అతని చేతిని నిమురుతూ, "ఊఁ" . అంది.

"రాజూ! మన కొన్ని అవసరాలైనా నా జీతంతో తీరుతాయి. మనం కూడా కొన్ని సామాన్లు కొనుక్కోవాలి. నేను శ్రద్ధగా చెబుతాను. కొన్నాళ్ళయ్యాక జీతం పెంచుతారట. శోభ చెప్పింది. అంతేకాదు "

"ఓహో.... కరుణా! మళ్ళీ ఉదయం లేచి చాలాపన్లు చేసుకోవాలి. మళ్ళీ నువ్వు స్కూల్‌కు వెళ్ళాలి— పడుకో" అన్నాడు.

"అది కాదు "

"ఊహుఁ .. నువ్వింక మాట్లాడానికి వీల్లేదు" అంటూ మరిక కరుణకు మాట్లాడే అవకాశం యివ్వలేదు రాజు.

చాలారోజుల తరవాత కరుణ సంతృప్తిగా నిద్రపోయింది. ఆమె మనసు నిండా కొత్త ప్రశాంతత కొత్త ఆశలు

ఆరు నెలలు గడిచిపోయాయి. రాజు చేసే ఉద్యోగంలో ఎటువంటి మార్పు రాలేదు. యాంత్రికంగా అతని ట్యూషన్లు, పనులు సాగిపోతున్నాయ్ కాని మంచి ఉద్యోగంకోసం అతను చేసే ప్రయత్నాలు మాత్రం ఆగలేదు.

కాని కరుణతో చాలా మార్పు వచ్చేసింది. సంపాదించేది వంద రూపాయలే అయినా, ఆడంబరాలు ఎక్కువయాయి

"ఈ యిల్లు మరీ యిరుకుగా వుంది రాజూ! మంచి యింటిలోకి మారుదాం" అంది.

"ఈ యింటి అద్దె చాలా తక్కువ కరుణా! మరి కొన్నాళ్ళు ఎలాగో సర్దుకుందాం" అన్నాడు.

"మరి కొన్నాళ్ళంటే ఎన్నాళ్ళు రాజూ! గాలి, వెలుతురు లేకుండా జైలు గదిలా ఈ గది ఊహుఁ " అంది.

రాజు విస్తుపోయాడు. పెళ్ళయిన కొత్తలో కరుణ ఆ ఇరుకు గదినే స్వర్గంగా తలచిన రోజులు మరచిపోయింది. "మనిద్దరికి ఈ గది మరీ పెద్దది రాజా!" అని ఓసారి అన్న కరుణమాటలు గుర్తుకువచ్చి నవ్వుకున్నాడు

కరుణ మరీమరీ హెచ్చరించడంతో రాజు కొత్త యింటికోసం వెతకడం మొదలుపెట్టాడు. రెండుగదులున్న యిల్లొకటి ఎనభైరూపాయలకు దొరికింది. పోర్షన్ అందంగా వుంది. యిల్లుగలావిడ ప్రక్కనే మరో పోర్షన్‌లో వుంటుంది కాని కరుణ స్కూలు ఆ యింటికి కొంచెం దూరం.

కరుణకు ఆ యిల్లు బాగా నచ్చడంతో, ఆ నెల మొదట్లోనే చేరిపోయారు.

"ఈ యింట్లో ఖరీదైన సామాను ఒక్కటి లేదు" అంది కరుణ ఓనాడు.

రాజు నవ్వి ఊరుకున్నాడు.

రాధావాళ్ళు చాలా కొన్నారు కదూ!" కరుణ మాటలకు రాజు జవాబివ్వ లేదు.

ఆ సాయంత్రం రాజు యింటికి వచ్చేసరికి తలనొప్పి విపరీతంగా వుండడంతో, అలాగే పడుకున్నాడు. మూడున్నరకు స్కూలు అయిపోతే నాలుగుగంటలకల్లా యింట్లోవుండే కరుణ ఐదు దాటుతుండగా వచ్చింది. మామూలుగా ఆ సమయానికి రాజు ప్రయివేటుకు వెళ్ళిపోతాడు.

"ప్రయివేటు లేదా ?" అంది.

"వుంది కరుణా ! తలనొప్పి విపరీతంగా వస్తోంది. కణతలు పగిలిపోతున్నాయ్ !" అన్నాడు.

కాఫీ పెట్టొచ్చి ప్రక్కనే కూర్చుంది.

"చాలాసేపటినుండి నీ గురించి ఎదురుచూస్తున్నాను కరుణా ! ఇవాళ ఆలస్యమైందేం ?"

"మా ప్రిన్సిపాల్ వాళ్ళింటికి టీచర్లందర్నీ రమ్మని తీసికెళ్ళింది. ఫ్రిజ్ కొన్నారట. చూపించడానికి."

"ఓహ్ " అని ఊరుకున్నాడు.

ఆ తరువాత మరో వారంరోజులకు మళ్ళీ ఆలస్యంగా వచ్చింది కరుణ. అలా రెండుమూడుసార్లు జరిగాక అడిగాడు రాజు.

"ఆలస్యమైందేం ?"

"అవును"

"ఎందుకు ?"

"వివరాలన్నీ చెప్పాలా? స్కూల్లో పనివుంటే ఆగిపోయాను. ఎక్కడికి వెళ్తాను. ఎవరున్నారని? అయినా మీ కింత అనుమానం ఏమిటి!" కరుణ కోపంగా అరిచింది.

తానడిగినదాంట్లో తప్పేమిటో, దానికి కరుణ అంతగా అరవాల్సిన అవసరం, కోపం పెంచుకోవాల్సిన అగత్యం అర్థంకాక, పైగా తాను కరుణను అనుమానిస్తున్నానని అనడం. కరుణ తననంత తక్కువగా ఊహించడంతో, రాజు విభ్రాంతిపోయాడు అతను చాలాసేపటివరకు మాట్లాడలేకపోయాడు. కరుణ ఏదో గొణుక్కుంటూ పనిలో పడిపోయింది.

స్కూల్లో పని ఎక్కువగా వుందేమో స్పెషల్ క్లాసులు ఏవైనా పెట్టారేమో... యిలా ఏవేవో కారణాలు తనే ఊహించుకొని సమాధానపడిపోయాడు.

ఆ రాత్రి కోపంగా అటువైపు తిరిగి పడుకున్న కరుణను తనవైపు తిప్పుకుంటూ

"అలస్యమైతే కంగారుపడిపోయాను కరుణా। అంతే తప్ప నీమీద మరీ నన్నంత తక్కువగా అంచనావేసుకుంటావా? స్కూల్లో పని ఎక్కువగా వుందని చెబితే నేనేమంటాను" అన్నాడు బుజ్జగిస్తూ.

"ఏదైనా వుంటే నేను చెప్పనా? మీరు అడిగేవరకు ఊరుకుంటావా? ఎందుకలా వావంక గుచ్చిగుచ్చి చూస్తూ అడుగుతావు?" కరుణ ప్రశ్నకు మరోసారి విభ్రాంతపోయాడు.

కరుణ మొహంలో కనిపించే అలసటను, నీరసాన్ని గమనిస్తాడే తప్ప కరుణ అబద్ధం చెబుతోందని, నిజంకోసం కరుణ మొహంలోకి గుచ్చిగుచ్చి చూస్తాడా? లేదు. అసలు అలాంటి పిచ్చి ఆలోచన, కరుణమీద అపనమ్మకం కరుణ ఎందుకలా ఆలోచిస్తోంది తన గురించి? ఏమైందసలు? కరుణకు ఈ మధ్య కోపం ఎక్కువైంది. అసహనంగా, అశాంతిగా వుంటోంది. పలకరిస్తేనే కయ్ మంటూ మాట్లాడుతోంది. ఏంచెప్పినా సరిగా అర్థంచేసుకోదు.

రాజు మౌనాన్ని ఆలోచనను మరోలా అర్థంచేసుకున్నది కరుణ. దూరంగా జరిగి పడుకుంది.

రాజు వారించలేదు. దగ్గరికి లాక్కోలేదు

సరిగ్గా ఆ క్షణంలోనే కరుణ అహం దెబ్బతింది.

సరిగ్గా ఆ క్షణంలోనే వాళ్ళిద్దరి మధ్య దూరం పెరగడం మొదలైంది.

ఆరోజు నుండి, మళ్ళీ ఏనాడూ రాజు కరుణను ఆలస్యానికి కారణం అడగలేదు

ఆరోజు సాయంత్రం ఆరుగంటలు దాటినా కరుణ ఇంటికి రాలేదు. ఆరోజు జీతాలు రావడంవల్ల కరుణను సినిమాకు తీసుకెళ్ళాలనుకున్నాడు రాజు. అందుకే సాయంత్రం ప్రైవేట్లకు వెళ్ళకుండా యింటిదగ్గిరే వుండిపోయాడు.

ఏడుగంటలు కావస్తుండగా కరుణ యింటికి వచ్చింది. ఆ సమయంలో రాజు యింట్లో వుంటాడని ఊహించని కరుణ, రాజు గుమ్మంలో నిలబడి ఆందోళనగా తనకోసం ఎదురుచూడ్డం చూసి గతుక్కుమంది.

"ప్రైవేట్లకు వెళ్ళలేదా రాజూ?" అంది లోపలికి వచ్చి అలసటగా కూర్చుంటూ,

"ఉహూ॰ " అన్నాడు.

"ఊ॰ కాఫీ తాగావా ।" అంది

"ఆ॰ ఫ్లాస్కులో నీకోసం పోసిపెట్టాను."

కరుణ లేచి కాఫీ కప్పులోకి వంపుకొని తాగేసి, మొహం కడుక్కొని వచ్చి, టవల్‌తో తుడుచుకుంటూ క్రీగంట రాజువంక చూసింది. రాజు ఏదో పుస్తకం తిరగేస్తున్నాడు.

"ఆలస్యమైందేం?" అని అడుగుతాడని ఎదురుచూసింది కరుణ.

తనే చెబుతుంది కదా! అడిగి బాధపెట్టడం ఎందుకు? అని రాజు ఊరుకున్నాడు.

ఆ రాత్రి రాజు భోజనం చేయలేదు. కొంచెం జ్వరంకూడా వుండడంతో పాలుతాగి పడుకున్నాడు. కరుణ భోజనం చేసింది

ఆ రాత్రి అయిన తన ఆలస్యానికి కారణం అడుగుతాడనుకుంది. కాని, రాజు నిద్రపోయాడు.

ఎంత గర్వం? ఎంత అహంభావం? ఎంత నిర్లక్ష్యం? తనే చెప్పాలా ఆలస్యానికికారణం? అతను మాత్రం అడగడు. తనేమైపోయినా అతనికి అవసరం లేదు. అంతే- తాను అతనికేం కాదూ? ఒక్కసారైనా అడగలేదేం? తనమీద ప్రేమ తగ్గిపోయింది. అవును. తానంటే లక్ష్యం, అభిమానం లేకుండా పోయాయి.

మర్నాటికల్లా రాజుకు జ్వరం పెరిగింది. కరుణ ఆదరాబాదరాగా తయారై స్కూల్‌కెళ్ళింది.

కరుణ యింట్లో వుంటుందనుకున్నాడు రాజు. కాని బాధ్యత తీర్చుకున్నట్టుగా అన్నీ టేబుల్ మీద అమర్చి వెళ్ళిపోయింది. రాజు వారించలేదు.

కనీసం స్కూల్‌నుండైనా త్వరగా వస్తుందనుకున్నాడు. కాని కరుణ ఐదు గంటలకు వచ్చింది. ఆమె వచ్చేసరికి, యింట్లో రాంబాబు, రాధ కన్పించారు.

రాధ కాఫీ చేసి యిస్తే రాంబాబు రాజుచేత బ్రెడ్ తినిపిస్తున్నాడు కరుణ వచ్చేసరికి.

కరుణను గుమ్మంలో చూస్తూనే రాధ చిరునవ్వుతో పలకరించింది. కరుణ మౌనంగా మొహం కడుక్కొని వచ్చేసరికి రాధ కాఫీగ్లాసు అందించింది.

కరుణ ఏమిటో యిబ్బందిగా ఫీలవుతూ, కొత్తమనిషిలా కాఫీతాగుతూ మౌనంగా వుండటంతో రాధకు కొంచెం అర్థమైంది.

"అన్నయ్య మీరొచ్చాకే బ్రెడ్ తింటానన్నాడు వదినా! మీ అన్నయ్యే బలవంతం చేసారు. అందుకని కాఫీ చేసాను. ఎలాగు స్టవ్ వెలిగించాను కదా అని అన్నం, కూర కూడా చేసాను" అంది రాధ. తాను చేసింది ఏదో తప్పు

అయినట్టు, దానికి సంజాయిషీ యిస్తున్నట్టు.

కరుణ ఏం మాట్లాడలేదు. ఆమె మౌనం చూస్తుంటే రాధకు కష్టం వేసింది.

"మనం యిక వెళదామా!" అంది రాంబాబుతో.

"ఆ!" అంటూ లేచి "ఈ పూటకిక యింకేం తిననివ్వకమ్మా! డాక్టర్ యింజక్షన్ యిచ్చి వెళ్ళాడు. ఇవిగో మాత్రలు. యివి మూడు గంటలకొకసారి, రెండేసి యివ్వాలి" అన్నాడు రాంబాబు కరుణతో.

కరుణ తలూపింది.

వాళ్ళు వెళ్ళిపోయారు.

కరుణ నిశ్శబ్దంగా కుర్చీలో కూర్చుంది. ఆమె మనసంతా ఆలోచనలతో, అర్థంలేని ఊహాలతో, అనుమానాలతో నిండిపోయింది.

"కరుణా!" రాజు పిలుపుకు కళ్ళుతిప్పి చూసింది.

"యిలా రా!" అన్నాడు. కరుణ లేచి దగ్గరకు వెళ్ళింది.

"అలా వున్నావేం కరుణా! యిటు చూడవూ!" అన్నాడు. కరుణ అతని మొహంవంక పరిశీలనగా చూసింది. ఒక్కరోజుకే మొహం అంతా వాడిపోయి నట్టుగా వుంది

"కరుణా" అంటూ ఆమె చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు. చేయి వేడిగా తాకింది.

"నువ్వు త్వరగా వస్తావనుకున్నాను కరుణా! కనీసం మధ్యాహ్నంనుండి వచ్చేస్తావనుకున్నాను. నాలుగు గంటలప్పుడు రాంబాబు వచ్చేసరికి ఏమిటో మత్తుగా పడుకున్నాను. పాపం వాడెళ్ళి డాక్టర్‌ను పిలుచుకువచ్చాడు. నేను ఎంత వారించినా వినకుండా రాధ కాఫీచేసిపెట్టింది. వంటకూడా చేసింది" అన్నాడు.

కరుణ నిశ్శబ్దంగా వింటూ వుండిపోయింది అతని మాటల్లో కదిలిన మృదుత్వం ఆమె నేమాత్రం కదిలించలేదు తను త్వరగా రాలేదు. రాంబాబు సమయానికి వచ్చి, డాక్టర్‌ను పిలిచాడు అంతే తను

కరుణ చివ్వున తలెత్తి చూస్తూ —"నా అవసరం మీకు వుంటుందనుకో లేదు." అంది కరుణ నిష్ఠూరంగా.

"కరుణా! నువ్విలా అనుకుంటే నేనేం చెప్పలేను. నువ్వే ఒక్కసారి ఆలోచించు" అన్నాడు కళ్ళు మూసుకుంటూ.

"కరుణా! నాకు నువ్వు తప్ప ఈ లోకంలో మరెవ్వరూ లేరు. నా కోసం అంటూ ఎవరూ లేని ఏకాకిని అనాథను నీతో జీవితం ముడివేసుకున్న




క్షణంలో నాకంటూ నువ్వున్నావనే సంతోషం, తృప్తి. ఓహ్ నన్ను నేనే మరిచిపోయాను. జీవితంలో ఎలాంటి క్షణం ఎదురైనా నిన్ను వదులుకోలేను. అందుకే ఆనాడు నిన్నంతగా హెచ్చరించాను బాగా ఆలోచించి, నాతో అడుగువేయమని. ఆనాటి నీ మాటల్లో కదిలిన నిశ్చలత్వం ఈనాడు లేదు. నా మీద అకారణంగా విసుగును, చిరాకును పెంచుకుంటున్నావు. ఇది ద్వేషంగా మాత్రం మారనీకు కరుణా! నావల్ల నీ కేమైనా బాధకలిగితే చెప్పు నన్ను నేను సరిదిద్దుకుంటాను" అన్నాడు

"మీరు చాలా గొప్పవారండీ! మీ రెందుకు తప్పుచేస్తారు నన్ను ఎంతో ప్రేమించి మరీ పెళ్ళిచేసుకున్నారాయె! నన్నెందుకు బాధపెడతారు. ఎంతో సుఖ పెడుతున్నారు. నేనే మీరంటే విసుగు, చిరాకు చూపిస్తున్నాను. క్షమా! మీరలా ఆవిడ చేత కాఫీ చేయించుకుని తాగితే తప్పులేకపోవచ్చు కాని.. నా భార్యకు ప్రేమలేదు, నాకు జ్వరం వచ్చి యిలా మంచంమీదపడినా చూడకుండా స్కూల్ కెళ్ళిపోయాను. కనీసం తొందరగాకూడా రాలేకపోయాను. సమయానికి వాళ్ళు వచ్చారు కాబట్టి సరిపోయింది. కాని వాళ్ళేమనుకుంటారో? నా గురించి వాళ్ళెలా ఆలోచిస్తారో ఊహించారా?" అంది

"వాళ్ళేదో ఆలోచించి ఊహిస్తారనే తప్ప నేను బాధపడతానని నువ్వు ఆలోచించవేం? నీసాన్నిధ్యాన్ని నేనెంత కోరుకుంటానో ఊహించవేం? నువ్వు

చేయాల్సిన బాధ్యత వాళ్ళు చేస్తుంటె నేనెంత సిగ్గుతో చితికిపోయానో గ్రహించ వేం? నేను నిన్ను సుఖపెట్టడంలేదు నిజమే. అలా అని బాధించడంలేదు. ఉన్నదాంట్లో కష్టాన్ని, సుఖాన్ని పంచుకుందామనుకున్నాను. ముందే చెప్పానుకూడా కాని నువ్వు చాలా మారిపోయావు కరుణా! ఆనాడే నేను నీతో చెప్పాను. నా జీవిత పరిధి చిన్నది కరుణా! సుఖపెట్టలేనని. అన్నీ ఆలోచించానన్నావు. ఈ నాడు సుఖపెడుతున్నారని నిష్ఠూరంగా పలకడం దేనికి? నిన్ను ఉద్యోగం చేయ మని నేను అనలేదు. నువ్వే చేస్తానన్నావు. కాదనలేదు. నా సంపాదనతోనే యిల్లు గడుస్తోంది అవసరానికి సరిపోయే సామానులు వున్నా యింకా ఏవో కొనాలని, పెద్దిల్లు కావాలని, లేనిపోని ఆడంబరాలకు దిగావు నువ్వే. అయినా నేనేం అనడంలేదు, కాని నీ వైఖరి, నీ నిర్లక్ష్యం . ఎదుటిమనిషి నెంతగా బాధపెడతాయో ఆలోచించావా?"— యింకా చాలా చాలా అనాలనుకున్నాడు కాని, రాజు అసలేం అనలేక మనసులోనే ఊహించుకుంటూ మౌనంగావుండిపోయాడు.

తన మాటలకు ఎలాంటి సమాధానం రాకపోవడంతో కరుణ రెచ్చి పోయింది. రాజు అనారోగ్యాన్ని కూడా లెక్కించక కఠినంగా మాట్లాడుతూ, ఏడుస్తూ వుండిపోయింది. రాజు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. అతని మనసులో అంతులేని సంఘర్షణ— ఆవేదన.

మరో రెండు రోజులలో రాజుకు జ్వరం తగ్గింది. కరుణ మామూలుగా తన పనులు తాను చేసుకుపోతోంది. ఆ రెండు రోజులు స్కూలు మానలేదు కాని, త్వరగా వచ్చేసింది.

ఆ మర్నాడు రాజు ఉదయాన్నే ట్యూషన్సుకు వెళ్ళిపోయాడు. ఆరోజు సాయంత్రం కరుణ మళ్ళీ మామూలుగా ఆలస్యంగా వచ్చింది. ఆమె వచ్చేసరికి రాజు వాలుకుర్చీలో కూర్చొని వున్నాడు.

అతను ట్యూషన్స్‌కు వెళ్లే సూచన కన్పించలేదు. మౌనంగా భోజనం వడ్డించింది కరుణ.

"నాకు ఆకలిగా లేదు కరుణా! నువ్వు భోజనంచెయ్!" అన్నాడు. కరుణ మళ్ళీ పిలిచింది.

తను తినకపోవడాన్ని మరోలా అర్థంచేసుకుంటుందని లేచివచ్చి రెండు ముద్దలు తిని పడుకున్నాడు.

ఆరాత్రి రాజు పాలిట కాళరాత్రి అయింది. తాను పనిచేస్తున్న కంపెనీని మూసేసారు. పార్టనర్లమధ్య ఏవో గొడవలు రావటంవల్ల కంపెనీ మూసేసారు.

మళ్ళీ ఎప్పుడు తెరుస్తారో తెలీదు. మరో ఆరు నెలలయితే తనకు ప్రమోషన్ వచ్చేది. కనీసం నాలుగువందల జీతమైనా వచ్చేది. ఇప్పుడు ఉన్న ఉద్యోగం ఊడిపోయింది ట్యూషన్‌మీద తాను సంపాదించే డబ్బు యింటి ఖర్చులకు చాలోదు ఎలా గడుస్తుంది? ఉద్యోగం వుండి ట్యూషన్లు చెప్పినా, కరుణను సుఖపెట్టలేకపోతున్నాడు. ఉన్న ఈమాత్రం ఆధారంపోతే యిల్లు గడవడం మాట ఎలావున్నా, కరుణ ఎలా వుంటుంది?

మళ్ళీ ఉద్యోగంకోసం వేట. యిన్నాళ్ళుగా ప్రయత్నిస్తుంటేనే మంచి ఉద్యోగం అంటూ దొరకలేదు. ఇక యిప్పుడు ఈ మాత్రం ఉద్యోగం మళ్ళీ దొరకాలంటే అంత సులభం కాదు. ఎలా? ఏంచేయగలడు? ఏంచేయాలి? జీవితం ఎందుకిలా నిస్సారంగా అయింది? ఎందుకిలా విధి తనమీద యిలా పగసాధిస్తోంది.

పగ అవును పగే. సుఖపడనీయడంలేదు సుఖం అంటే ఐశ్వర్యాల్ని, అంతస్తును కోరుకోవడం కాదు. కనీసం మనశ్శాంతి, ఆత్మతృప్తి, ఆనందం, అంతే. అవికూడా కరువైపోయాయి. ఖరీదైన కోర్కెలు లేవు. కనీసపు కోర్కెలు తీరని, తీర్చలేని జీవితం ఎందుకు? తాను సుఖపడలేడు. దురదృష్ట వంతుడు. కనీసం తనను నమ్మివచ్చిన కరుణను సుఖపెట్టలేకపోతున్నాడు. సుఖ పెడతాననే నమ్మకం, తనమీద తనకే లేకుండాపోతోంది.

భగవాన్! ఏంచేయాలి? ఏంచేయగలను? కరుణకు ఈ విషయం తెలిస్తే బాధపడుతుంది. తప్పకుండా తనతో ముడిపెట్టుకుని ఆమె జీవితంలో సుఖం అనేది ఎండమావి అయిపోయిందని, తనను నమ్మి, ప్రేమించి వచ్చినందుకు, ఆమెకు తానేమిచ్చాడు? ఏమివ్వగలడు? యికముందైనా యివ్వగలడా?

ఉద్యోగానికి అర్హమైన అర్హతలున్నా, తనకు వయోపరిమితి దాటి పోయింది. గవర్నమెంటు ఉద్యోగం దొరకదు. మిగిలింది ప్రయివేటు సంస్థల్లోనే. అదిక దొరకదు తానిక ఈ జన్మలో కరుణను సుఖపెట్టలేడు.

జీవితంలో మొదటిసారిగా వెక్కి-వెక్కి ఏడ్చాడు రాజు.

ఆ క్షణంలో అతన్ని రెండుచేతులతో చుట్టేసి గుండెల్లో దాచుకొని, ఓదార్చే అమృతహస్తం లేదు. అతని కన్నీళ్ళు తుడిచే కరుణ హస్తం అల్లంత దూరంలో వుండిపోయింది. అతడి బాధను, ఆవేదనను పంచుకొనే ఆత్మీయత చేరువలో వున్నా దూరంగానే వుంది.

రాజు ఒంటరిగా దిండులో మొహం దాచుకొని తన బాధను, ఆవేదనను తానొక్కడే నిశ్శబ్దంగా అనుభవించాడు.

అతని మౌనాన్ని, తనమీద కోపంగా అర్థం చేసుకుంది కరుణ. అందుకే అతనికి దూరంగా పడుకొని నిద్రపోయింది.

తెల్లవారింది— అది తప్పదని తెలిసి, రాజు తనను తానే ఓదార్చుకొని లేచాడు. మామూలుగా కాలకృత్యాలు తీర్చుకొని ట్యూషన్స్‌కు వెళ్ళిపోయాడు.

తన ఉద్యోగం పోయిందని కాని, కంపెని మూసేసారని కాని కరుణకు చెప్పలేదతను.

రాజు మామూలుగా ఉదయం లేవగానే ట్యూషన్స్‌కు వెళ్ళివస్తున్నాడు. ట్యూషన్స్‌నుండి రాగానే, భోజనంచేసి, ఉద్యోగాన్వేషణలో బయటకు వెళ్ళి తిరిగి ఏ రాత్రికో యిల్లు చేరుతున్నాడు. రెండు మూడు కొత్త ట్యూషన్లుకూడా కుదుర్చుకున్నాడు. కరుణ అతనిపట్ల మునుపటిలా ఉండక, ఉదాసీనంగా వుంటోంది.

స్కూల్లో చేరాక, తోటి టీచర్ల యిళ్ళకు వెళ్ళి వాళ్ళింట్లోని సామాన్లు వర్నిచర్లుచూసి వాళ్ళు జీవిస్తున్న పద్ధతిని చూసాక, తను, తను గడుపుతున్న జీవితంతో పోల్చి చూసుకుంటే సిగ్గుగా వుండేది. స్కూల్లోని టీచర్లలో సగానికిపైగా మంది ఏదో ఊసుపోక చేస్తున్న ఉద్యోగం అది. అందుకే నెల జీతం అంతా చీరలు కొనుక్కోవడానికి. సినిమాలకు, హోటళ్ళకు తిరగడానికి చాలా ఫ్రీగా ఖర్చుచేసేవారు.

ప్రతి క్షణం, ప్రతి నిముషం, ప్రతి కదలికలో ప్రతి అడుగులో వారితో పోల్చుకొని అసంతృప్తికి లోనయ్యేది కరుణ. మొదట్లో తానలా ఆలోచించడం తప్పు, అవివేకంగా అన్పించేది. కాని, వాళ్ళతోపాటు సినిమాలకు హోటళ్ళకు తిరుగుతూంటే అన్పించే హాయి, సంతోషం, తిరిగి యింటికి రాగానే ఆ చిన్న గదిలో ఇరుకుగా, ఇబ్బందిగా ఓ జైలులా అన్పించేది. విశాల ప్రపంచంలో విహంగంలా తిరగాలనుకునే ఆమెను రాజు తీసుకొనివచ్చి ఓ పంజరంలో గాలి, వెలుతురు చొరలేని ఊపిరి ఆడక ఉక్కిరిబిక్కిరై పోయే జైలుగదిలాంటి ఆ యింట్లో పెట్టాడన్న కోపం, కసి కలిగేవి

అతణ్ణి ప్రేమించినందుకు, వెనకా ముందు ఆలోచించకుండా అతని వెంట పడి వచ్చినందుకు, అతను తనను సుఖపెడతాడని తాను కన్న కలలన్నీ నిజం చేస్తాడని తలచి, ఆశలు పెంచుకోవడంలో తన అవివేకం, తొందరపాటు కనిపించి తనమీద తనకే చిరాకు, విసుగు కలిగి అవి రాజుపట్ల అసహ్యంగా ద్వేషంగా మారాయి.

తాను తొందరపడ్డానని ఊహిస్తూ, పశ్చాత్తాపపడడం మొదలుపెట్టిన కరుణలో అవమానం పెరిగిపోసాగింది.

సరిగ్గా అలాంటి సమయంలోనే కరుణకు ముకుందం కనిపించాడు. ముకుందం కరుణకు వరుసకు ఏం కాడు. కాని బంధువుల అబ్బాయి. అతనికి కరుణను చేసుకోవాలని వుండేది. కాని కొన్ని జులాయి రకంగా కన్పించి ఆస్తి పాస్తులున్న అతడికి తన కూతురు నివ్వడానికి కరుణ తండ్రి, అతడ్ని చేసుకోవడానికి కరుణ అంగీకరించలేదు.

అలా అని అతడు తన ప్రయత్నం మానలేదు. తల్లీతండ్రికి ఒక్కడు. ఆస్తి బాగానే వుంది. వ్యాపారం ఏదో చేస్తానంటూ ఊళ్ళు తిరగడం అతని హాబీ.

అనుకోకుండా హఠాత్తుగా అతను కరుణను చూసాడు. చూసి పలకరించాడు. కరుణ పిలవకముందే యింటికి వస్తానన్నాడు.

కరుణ ఏదో సాకు చెప్పి అతడు రాకుండా చేసింది. అతడు వస్తే యింటిలోని లేమి, తను బ్రతుకుతున్న తీరు అతనికి తెలుస్తాయనే భయంతో అతడింటికి వస్తానంటే రానివ్వలేదు.

"రాజా యింట్లో వుండడు. పైగా ఎప్పుడైనా తిరిగ్గా రా ముకుందం అంది.

ముకుందం అంతటితో నిడిచి పెట్టలేదు.

"అలా హోటల్ కెళ్ళి కాఫీ అయినా తాగించవా! మీ యింటికి వచ్చే అదృష్టం ఎలాగూ లేదు. కనీసం నీతో కలిసి కాఫీతాగే అదృష్టాన్నైనా కలిగించు" అన్నాడు.

కాదన్లేకపోయింది కరుణ. పైగా కోటి టీచర్లతో వెళ్ళడం అలవాటయిపోయిన కరుణ నిర్భయంగా ముకుందంతో వెళ్ళింది.

"మాస్టారు కొన్ని రోజులవరకు చాలా బెంగపడిపోయాను. ఆ తరువాత మామూలుగా వున్నారు. నువ్వు వెళ్ళిపోయావన్న బాధకంటే అప్పట్లో నీకు చూస్తున్న సంబంధం. ఆ కుర్రాడు పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకుంటానని కట్నంలేకున్నా పర్వాలేదని భీష్మించుకు కూర్చున్నాడన్న సంగతి తెలిసి, వాళ్ళు పెళ్ళి కంగీకరించారు. కాని అప్పటికే నువ్వు చాలా దూరం వచ్చేసావు" అంటూ అగి క్షణంపేపు కరుణ మొహంలో కదిలే భావాలను అర్థంచేసుకోడానికి ప్రయత్నించాడు.

కరుణ మొహంలో విచారపు రేఖలు చాలా స్పష్టంగా చూడగలిగాడు. అతడు వేస్తున్న వలలో క్రమంగా యిరుక్కోసాగింది కరుణ. "ఎక్కడున్నా నువ్వు సుఖంగా వుండాలనే వాళ్ళు కోరుకుంటున్నారు. నువ్వు సుఖంగానే వున్నావు కదూ కరుణా!"

ముకుందం మాటలకు కరుణ కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

ఆరోజు ముకుందంతో ఏం చెప్పలేకపోయింది కాని అతను దాదాపు ప్రతి రోజూ పిలవటం ఏదో విషయం చెబుతూ హోటల్‌కు తీసుకువెళ్ళడం చేస్తున్నాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ కరుణ చాలావరకూ ముకుందంతో చెప్పేసింది. ఆమె పరిస్థితి అర్థంచేసుకున్న ముకుందం మనసులో జాలిపడిపోయాడు.

"అంత చేతకాని భర్తతో ఏం సుఖపడుతున్నావ్ కరుణా! ఎందుకిలా వచ్చేస్తావూ? ఈ బికారి వెధవ ఏన్నటికి ఈ జన్మలో సుఖపెట్టలేడు. గుర్తుంచుకో"

ముకుందం మాటలు కరుణను బాగా రెచ్చగొట్టాయి.

యింటికి రాగానే తాను ముకుందంతో హోటల్ కెళ్ళిన సంగతి తెలియ కూడదని, రాజు అడిగేకంటే ముందే తానే కోపంగా ఏదో విషయం గురించి అరిచి రాద్ధాంతం చేసేది.

కాని కరుణ కోపాన్ని, చిరాకును అలసటగా అర్థంచేసుకున్నాడే తప్ప తనను చేతకానివాడిగా జమకడుతుందని అర్థంచేసుకోలేకపోయాడు.

రోజురోజుకు రాజుపట్ల కరుణకు కోపం, ఏహ్యభావం పెరిగితే రాజుకు మాత్రం కరుణపట్ల కరుణ, జాలి కలిగేవి.

ఓ నెల గడిచేసరికి కరుణకు నిజం తెలిసిపోయింది. రాజుకు ఉద్యోగం పోయిందన్న విషయం తెలిసి, తనతో చెప్పలేని అతని మనస్తత్వాన్ని, చేతకాని తనంగా, పిరికితనంగా తప్ప మరోలా ఊహించలేకపోయింది.

"ఉద్యోగం పోతే ఏమైంది కరుణా! ప్రయివేట్లు సంపాదించుకున్నాను. అది చాలదా?" అన్నాడు రాజు.

"చాలు మీకు చాలండి! ఈ ప్రయివేట్లు లేకున్నా, పస్తులున్నా, మీకు జీవితం చాలు—మీరు అల్పసంతోషులు. ఎలాంటి దరిద్రపు జీవితంతో నైనా రాజీపడతారు. ఎందుకు? చేతకాక. మీ చేతకానితనాన్ని యిలా తృప్తిపడి సరిపెట్టుకోవడం నావల్ల కాదు. మీ అసమర్థతను దురదృష్టంగా తలచి భరించడం నావల్ల కాదు. జీవితం అంటే కేవలం ఏదో దొరికిన గడ్డి తిని బ్రతకడం కాదండి. అదే జీవితం కాదు జీవితం అంటే అంతేకాదు."

"నేను మనిషిని. నాకు కోరికలు, ఆశలు ఎన్నో వున్నయ్. మిమ్మల్ని ప్రేమించి, నమ్మి వచ్చినందుకు, వాటిలో ఎన్నని సమాధిచేయను? ఎన్ని కోరికలను చంపేసి జీవచ్ఛవంలా కేవలం బ్రతకడం కోసం తినాలంటూ, ఈ చిన్న జీవితంలో సరిపెట్టుకోను. యివాళ కాకపోయినా రేపైనా నన్ను సుఖ పెడతారని, నా కలలు కొన్నైనా నిజం చేస్తారనుకున్నాను. కాని . మీరిలా జీవితాన్ని నిర్లక్ష్యంగా తీసుకుంటారని అనుకోలేదు. కోరి వచ్చినదాన్ని, మీ రెలా బ్రతకమంటే అలా బ్రతుకుతా ననుకోలేదు. ఒక్క మంచి చీర, ఒక్క మంచి నగ లేదు. పార్కులు, షికార్లు లేవు. చివరికి కడుపునిండా తిండి లేదు. ఎందుకండీ ఈ దరిద్రపు బ్రతుకు బ్రతకడం

"మీ దృష్టిలో అనుకోవడంలో తృప్తి, శాంతి వుంటాయేమో! కాని . కాని.... నాకు అనుభవంలోకి వస్తేకాని వుండవు. దేనికీ చలించని రాయిలా శిలలా బ్రతకడం నావల్ల కాదు."

"అంతకి నువ్వనేదేమిటి కరుణా!" అప్పటికి రాజులో సహనం నశించలేదు.

"నేను ఈ జీవితంతో రాజీపడలేను." ఖచ్చితంగా చెప్పింది.

"నీ యిష్టం కరుణా! నేను అనాడే చెప్పాను. అనాడు నీ ఆవేశం అనాలోచితం కాదన్నావు. నాతో ఎలాటి జీవితాన్నైనా పంచుకుంటానన్నావు. ఉద్యోగంపోతే నా తప్పేం లేద. కంపెనీ మూసేశారు. నిన్ను సుఖపెట్టాలని ప్రతి క్షణం ప్రయత్నిస్తున్నాను. కాని ఎందుకో దైవం "

"ఛ అలా అనడానికి సిగ్గులేదు. చేతకానితనానికి అదో అందమైన ముసుగు. అసమర్థతకు అలంకారాలు చేస్తే నా కసహ్యం."

"నిజమే. అది అసమర్థత అయినప్పుడు అసహ్యించుకోవడం కాదు ద్వేషించాలి కాని . ఇది నిజం. మనిద్దరి మధ్య నమ్మకం అనే వారధి విరిగిపోయింది. ప్రేమ, అభిమానం అనేవి యింకిపోయినాయి. యిప్పుడు నేనేం చెప్పినా నీ కర్థం కాదు."

"అనాడు నీ నిర్ణయానికి ఒప్పుకున్నాను. ఈనాడు అంతే_"

"కాని ఒక్క విషయం కరుణా!" అంటూ ఆగి_

"నువ్వంటే నా కిష్టం. యిప్పటికైనా నీ కోసమే నేను శ్రమిస్తున్నాను. బాధపడుతున్నాను. ఆలోచిస్తున్నాను. నా కంటూ మిగిలింది నువ్వే. ఐ లైక్ యు."

"అభిమానం లేని మనిషి—" చీత్కారంగా చూసింది

"అవును. ప్రేమ, అనురాగానికి విలువ తెలీనపుడు అవి అలాగే కన్పిస్తాయి—" రాజు నిశ్శబ్దంగా బయటకు వెళ్ళిపోయాడు.

కరుణ బొమ్మలా నిలబడిపోయింది.

ఆరోజు మధ్యాహ్నం వేళ, ఉద్యోగం కోసం తిరిగి తిరిగి యింటికి తిరిగి వచ్చాడు రాజు. తలుపు తెరిచే వుంది. కుర్చీలో ముకుందం కూర్చుని వున్నాడు.

అతని కాళ్ళదగ్గర కూర్చుని, అతని మోకాళ్ళమీద తలానించి వెక్కి-వెక్కి- ఏడుస్తోంది కరుణ

"నే నిక ఈ నరకంలో వుండలేను ముకుందం, నాకు జీవితం మీద విరక్తి పుడ్తోంది అతన్ని చూస్తుంటే అతన్ని నమ్మివచ్చిన నా అవివేకానికి నామీద నాకే అసహ్యం జుగుప్సగా, జాలిగా వుంది. నే నిక అతన్ని భరించలేను."

ముకుందం ఆమె తలమీద చేయివేసి నిమురుతూ వుండిపోయాడు

రాజు అడుగుల చప్పుడుకు కరుణ తలెత్తి చూసి, లేచి నిలబడింది. ఏనాడు ఊహించని, అనుకోని హఠాత్ దృశ్యానికి రాజు విగ్రహంలా బిగుసుకుపోయాడు

"నేను— వెళ్తున్నాను" అంది కరుణ

దారికడ్డంలేకుండా ప్రక్కకు తొలిగాడు

"పద కరుణా !" అన్నాడు ముకుందం బింకంగా, గర్వంగా

కరుణ అడుగు ముందుకు వేసి, సూట్ కేస్ అందుకుంది. ముకుందం చేయి చాచాడు అతని చేతిలో కరుణ చేయి.

"కరుణా ! గడపదాటేముందు— ఒక్కసారి మళ్ళీ ఆలోచించు. కనీసం ఈసారి వేసే నీ అడుగు తప్పటడుగు కాకూడదని, అవివేకం, అనాలోచితం అసలు కాదని" అన్నాడు రాజు.

కరుణ నిర్లక్ష్యంగా చూస్తూ- "ఓడిపోవడం, మోసపోవడం, జీవితంలో ఒకేసారి జరుగుతాయి. మళ్ళీమళ్ళీ పునరావృతం కావు" అంది వెళ్ళిపోతూ. రాజు ఆమె వెళ్ళినవైపే చూస్తూ "కాకూడదనే కరుణా నా తాపత్రయం, బాధ" అనుకున్నాడు.

• • •

కరుణ వెళ్ళిపోయింది అతనికి దూరంగా, అతని జీవితానికి దూరంగా, ఆ పరిసరాలకు దూరంగా, అతని జ్ఞాపకాలకు దూరంగా శాశ్వతంగా వెళ్ళిపోయింది.

ఒక్క నెలరోజులవరకు మామూలు మనిషి కాలేకపోయాడు రాజు.

అతనికి కరుణమీద కోపం లేదు, ద్వేషం లేదు జాలి తప్ప.

ఒక్క కరుణే కాదు, కరుణలా ఆలోచించి, ఆవేశపడేవాళ్ళంటే ఓ ప్రక్క జాలి, మరో ప్రక్క భయం. జీవితాన్ని ఎంత సులువుగా, తేలిగ్గా తీసుకుంటారు.

ఎండమావులవెంట పరుగెత్తేవాళ్ళకు — మొదటి చూపులోనే ప్రేమ, పెళ్ళి అంటూ పరుగెత్తి, తీరా అనుభవంలోకి వచ్చాక తప్పుచేసామని పశ్చాత్తాపడేవాళ్ళంటే జాలివేసేది.

ఆలోచించండి! ఆవేశపడకుండా, తొందరపాటు లేకుండా ఆలోచించండి. మీరు చేసిందెప్పుడూ మీరు సిగ్గుపడేలా మిమ్మల్ని మీరు అసహ్యించుకునే స్థితికి దిగజార్చకూడదు.

కరుణ విషక్రియణ రాజును చాలా కృంగదీసింది. అతను కరుణను ప్రేమించాడు. అందర్నీ వదిలివచ్చాక, ప్రేమతోపాటు ఆరాధన పెరిగింది. మొదట్లో, తన చిన్న జీవితంతో కరుణ రాజీపడిపోవడం చూసి గౌరవించాడు.

అందుకే, అతని గుండెమీద బలంగా గాయంచేసి వెళ్ళినా అతను కరుణను ద్వేషించలేదు. ముకుందంతో వెళ్ళిపోయినందుకు బాధపడ్డాడే తప్ప శపించలేదు.

రాంబాబు, రాధ రాజును ఓదార్చాలని వచ్చారు. కాని వాళ్ళ ఓదార్పు అతనికి అవసరంలేకుండా పోయింది. పైగా వాళ్ళకు ధైర్యం చెప్పాడు— "మీరైనా సుఖంగా కలకాలం కలిసి వుండండిరా. లేమిలో కష్టాల్లో, కన్నీళ్ళలో కలిసి వుండడమే ప్రేమకు చిహ్నం. అభిమానానికి, ఆరాధనకు అర్థం" అంటూ.

నెల రోజులుగా ఎటూ వెళ్ళకపోవడంతో ప్రయివేట్లు తగ్గిపోయాయి. ఆ యిల్లు ఖాళీచేసాడు రాజు.

"ఒంటరిగా ఎక్కడుంటావురా రాజూ! మాతోపాటే వుందువు కాని" అన్నాడు రాంబాబు.

"వద్దు రాంబాబూ" అంటు మృదువుగానే తిరస్కరించాడు.

ఆ తర్వాత ఉండాలనిపించలేదు.

కరుణలేని జీవితం ఏమిటోగా అన్పించింది.

ఎంతగా వద్దనుకున్నా, ఆలోచనలన్నీ కరుణచుట్టూ తిరిగేవి

రాంబాబు జీవితంలో మార్పు రాలేదు. అదే చిన్న సంసారం. కాని వాళ్ళ

సంసారంతో కలతలు, కన్నీళ్ళు లేవు- వున్న యిద్దరూ చిరునవ్వులు పంచుకుంటూ, ఒకరిమీద ఒకరు మమతలు పెంచుకుంటున్నారు.

రాజు ఆ ఊరు వొదిలి బయలుదేరాడు.

"ఎక్కడికిరా రాజూ!" రాంబాబు బావురుమని ఏడుస్తూ అడిగాడు.

"నాకంటూ ఓ జీవితం మిగిలివుంది రాంబాబు. ఎక్కడో ప్రశాంతంగా బ్రతకాలని వుంది. ఎక్కడున్నా, నువ్వున్నావనే నిజం, ఆత్మీయత, బంధం నాకు తోడుగా వుంటుంది, నన్ను వెళ్ళనీరా!" అన్నాడు.

"అర్థంచేసుకొని, నమ్మకం పెంచుకొని, ప్రేమించి ఆరాధించే తోడు దొరకడం, ఆడవాళ్ళకైనా మగవాళ్ళకైనా అదృష్టం అనేది మాత్రం నిజం. మీరిద్దరూ సుఖంగా వుండండి!" అంటూ దీవించి రైలు ఎక్కాడు.

గమ్యం తెలీకుండా ప్రయాణం మొదలైంది. చివరికి ఈ చిన్న పల్లెటూర్లో ప్రయివేట్లు చెప్పుకుంటూ ఓ విధంగా ప్రశాంతంగా వుంటున్నాను మురళీ."

రాజశేఖరం చెప్పడం ఆపాడు.

కదలిక లేకుండా కూర్చున్నారు మురళి, అరుణ.

చాలా సేపటికి మురళి తేరుకున్నాడు.

"మాస్టారూ!" మురళి ఏదో చెప్పబోయాడు.

"మురళీ! నేను చెప్పేది నీకు అరుణకు అర్థమై వుంటుంది. యిక ఇప్పుడేం మాట్లాడకండి. ప్రశాంతంగా నిద్రపోండి. చాలా రాత్రయింది. మీ రిద్దరూ వీలయినంత తొగ్గా ఆలోచించి ఓ నిర్ణయానికి రండి. మురళీ తొందరపడకండి. మీరు పెళ్ళిచేసుకోవాలి ఎందుకు? క్షణికావేశానికి కాదు జీవితపు చివరి మజిలీ వరకు కలిసివుంటామనే దుకు. అందుకు సరైన నిర్ణయం తీసుకోవాల్సిన బాధ్యత మీదే " అన్నాడు

బయట వర్షం తగ్గిపోయింది.

చల్లటిగాలి వీస్తోంది.

"అరుణా! వెళ్ళి పడుకోమ్మా!" అన్నాడు. అరుణ వెళ్ళి పడుకుంది.

ఆ మర్నాడు—

"మాస్టారూ! మూడు నెలల్లో ఉద్యోగం సంపాదిస్తాను. అరుణ కూడా చదువుకుంది. తనకూ ప్రయత్నం చేస్తాను. అంతవరకు అరుణ బాధ్యత మీదే. మూడు నెలల్లో సంపాయించలేకపోతే, ఆ ఊళ్ళోనే, మీతోపాటు ప్రయివేట్లు



చెప్పుకుంటూ కలిసి బ్రతుకుతాం. అంతవరకూ సెలవ్ అంటూ [illegible] వెళ్ళిపోయాడు.

ఆశించింది అందడం చాలా కాదు. అది అదృష్టవంతులకే దక్కుతుంది.

మురళికి బ్యాంకులో ఉద్యోగం వచ్చింది.

“మీరు చాలా అదృష్టవంతులు మురళీ. మీలా ప్రేమించి పెళ్ళిచేసుకునే వారికి వుండాల్సిన ముఖ్యమైన అర్హతలో ఆర్థికంగా నిలదొక్కుకోవడం, ఆర్థిక ఇబ్బంది లేకపోవడం ఒకటి.”

దీనివల్ల సంసారం సాఫీగా సాగిపోతుంది. మిగతా కలతలు, కన్నీళ్ళు, సహృదయత వుంటే సర్దుకు పోవడమంత కష్టంకాదు" అన్నాడు.

మురళి, అరుణల పెళ్ళి రాజశేఖరమే గుళ్ళో జరిపించాడు. పెళ్ళికి రాంబాబు, రాధ వచ్చారు.

ఆరోజు మురళి అరుణను తీసుకెళ్తున్నాడు.

"మురళీ! ప్రేమించి పెళ్ళిచేసుకున్నా. పెళ్ళిచేసుకుని ప్రేమించుకున్నా, వాళ్ళిద్దర్నీ జీవితాంతం వరకు కలిపి నడిపించేది ఒక్క ప్రేమకాదు, ఒకరిమీద ఒకరికుండే అభిమానం, నమ్మకం ఒకరంటే ఒకరికి వుండాల్సిన పూర్తి అవగాహన అంతే."

"జీవితం సుఖాల నిలయం కాదు, కష్టాల కొలిమి కాదు. జీవితం అందమైన అయితే పాత్ర అందులో పాలు నింపుకున్నా, నీళ్ళు నింపుకున్నా, పూర్తి బాధ్యత మీదే. పెళ్ళి పెద్దలు చేసినా, పిల్లలే చేసుకున్నా, వాళ్ళిద్దర్నీ కలిపివుంచేది ఈ మూడుముళ్ళ బంధమే కాదు. ఒకరిపట్ల ఒకరికి అనురాగం, కష్టాల్లో సుఖాల్లో చెదిరిపోని అనుబంధం."

"పెళ్ళి ఎలా జరిగిందని కాదు ఈనాడు సమస్య. ఎవరు చేసారన్నది కాదు ముఖ్యం కలిసి ఎలా బ్రతుకుతారన్నది."

"మూడు ముళ్ళతో పెనవేసుకొని ముడిపడ్డ జీవితాలు, రెండు హృదయాల కదలికతో కలిసిపోయిన బ్రతుకులు జీవితపు చివరి మజిలీ వరకు అన్యోన్యంగా ఎలా గడుస్తాయనేది. అలా గడిపే శక్తి, మీ కిద్దరికీ వుండాలనే నా కోరిక, దీవెన" అన్నాడు.

మురళి అరుణ చేయిపట్టుకొని బయలుదేరాడు.

"వెళ్ళండి మురళీ, అదిగో మీరు నడవాల్సిన వెలుగు దారి అది పాల పుంత కావాలి మీ జీవితాలకు" అన్నాడు రాజశేఖరం, ఆ యిద్దర్నీ దీవిస్తూ.

సరిగ్గా అప్పుడే తూర్పున వెలుగురేఖలు విచ్చుకున్నాయి.



# వినిపించని వేదన



కొడకొండ సత్యానంద్

ఆషాఢం పూర్తయిపోయిన వెంటనే అత్తారింటికి పరుగుతీసే కొత్త అల్లుడిలా వేగంగా పరుగులు తీస్తోంది రైలు ఆ రైలు వేగానికి భయపడేనేమో అన్నట్లుగా వృద్ధభానుడు పడమటి కొండల మాటకు ఒదిగిపోతున్నాడు...

ఆ రైల్లో టూ టైర్ కంపార్ట్‌మెంటులో పై బెర్తు మీద పడుకున్నాడు చక్రపాణి. అతను నిద్రపోలేదు. ఆలోచిస్తున్నాడు.. ఎడతెరపి లేకుండా ఆలోచిస్తున్నాడు ఆలోచిస్తూ ఊహిస్తున్నాడు.. ఆ హల్లో ఒక నిండు హృదయం ఉన్న రూపాన్ని చూస్తున్నాడు చూస్తూ కల కంటున్నాడు... ఆ కలలో కరిగిపోతున్నాడు

అతని దృష్టిలో ఆ ప్రక్కవాళ్ళెవ్వరూ లేరు .. ఆ ప్రక్కవాళ్ళెవ్వరికీ అక్కడున్నది చక్రపాణి అని తెలీదు.. తెలిస్తే అతన్ని బతకనివ్వరు.... చంపేస్తారు ప్రశ్నల వర్షంలో ముంచేసి, అభిమానపు కౌగిలిలో బంధించేసి చంపేస్తారు

చక్రపాణి ఆలోచిస్తున్నదీ, ఊహిస్తున్నదీ, ఉత్కృతపడుతున్నదీ 'ఆమె' గురించి ఇన్నాళ్ళూ అక్షరాల్లో కన్పించిన ఆమె మనసు ఒంపుసొంపులు గురించి ఆమె అభిమాన చందన సుగంధాల గురించి.

ఒకప్పుడు స్వప్న చక్రపాణి అభిమాని ఇప్పుడు చక్రపాణి ఆమె అభిమాని ఆమె కథకురాలు కాదు... అక్షరాల్లో ఆత్మీయతాభావాన్ని వెల్లువలా కురిపించి, మైమరిపించే అభిమానురాలు

ఒప్పించే ఓర్పు కవ్వించే నేర్పు ఆమె అక్షరాలకుంది

ఆమె మనసు చక్రపాణికి తెలుసు.. ఎందుకంటే ఆమె వ్రాసిన ఉత్తరాల

పరంపరలో పదాల పరిమళాన్ని కలిపి చూస్తే కన్పించే ఆ రూపమే ఆమె మనసని చక్రపాణి అనుకున్న విషయం, నమ్మిన నిజం అతను నమ్మిన నమ్మకం వమ్ము కాదన్నది అతని నమ్మకం

ఆమె ఉత్తరాల్లో ఎన్నెన్ని భావాలు పరిచింది ? ఇంకెన్నెన్ని అర్థాల్ని వివరించింది ? తనకే తెలుసుననుకున్న విషయాలు, తనకు కన్పించినా పట్టించుకోని చిన్న విషయాలు ఎన్నో వివరించింది. ఆమె వ్రాసిన ప్రతి ఉత్తరంలోని ప్రతి పదం చక్రపాణికి గుర్తుంది అన్నీ మననం చేసుకుంటే ఇరవైనాలుగ్గంటలూ సరిపోవన్నది అతిశయోక్తి కాదు

నడచింది మూడ్నాళ్ళ స్నేహమే అయినా ఆమె అతని మనసు నిండి పోయింది అతని రచనల్ని మరో అందమైన మార్గంవైపుకు మళ్ళించింది.

తళతళ మెరిసే అందమైన కన్నె తోడొస్తే అదెన్ని వన్నెల్ని అలరించుకుంటుందో !

ఇది చక్రపాణి విషయంలో నిజమయ్యింది ఆమె స్నేహసౌగంధాలు పీల్చి, విజృంభించి అతనెన్ని రచనలు చేసాడో ? ఆ రచనల్లో ఎంత మాధుర్యం కన్పించిందో ? అతని కెంత పేరు వచ్చిందో ?

అతనామెకు ఎంత ఋణపడి ఉన్నాడో !? ఆమెతో పాటూ ఆమెను, అతనిని కలిపిన ఆ మెతుకు నచ్చిన ఒకప్పటి కథకు ఇంకెంత ఋణపడిఉన్నాడో !

ఆ ఋణాన్ని తీర్చుకోడానికేగా ఇప్పుడు తను వెళ్తుంది . స్నేహితురాల్ని, పెళ్ళికూతుర్ని చూడ్డం ఒకేసారి జరిగిపోతుంది

పెళ్ళి పెళ్ళిగాని, కన్నెపిల్లగానీ గుర్తొస్తే అందరిలానే చక్రపాణి ఒళ్ళు కూడా పులకరిస్తుంది మనసు పరవశిస్తుంది కానీ, వెంటనే ఆ ఆనందం అణగారిపోతుంది అప్పుడే అతని మనసు ఆలోచిస్తుంది తీవ్రంగా ఆలోచిస్తుంది ఆ ఆలోచనల్లో వణికిపోతాడు, భయపడిపోతాడు! బెంబేలు పడిపోతాడు అప్పుడే అతని గుండె జారిపోతుంది... గుండెలో నిశ్శబ్దం నిండిపోతుంది మనసు మంచుగడ్డలా మారిపోతుంది

ఇలాంటి తీయని స్వప్నంలో ఊయల లూగిస్తున్న స్వప్న నన్ను నన్నంగీకరిస్తుందా ? తన మైత్రని గుండెంపై ప్రశాంతి తీసుకోనిస్తుందా? ఓదార్పులేని హృదయానికి సేదనిస్తుందా ?

కళాకారుడిగా నన్నీ లోకం అంగీకరించినా, అభిమానించినా, మనిషిగా నన్ను దగ్గరకు రానిస్తుందా ? అందులోనూ కన్నెపిల్ల- అందమైన, బలమైన ఆలంబనకోసం ఆరాటపడే ఆడపిల్ల నన్ను భర్తగా ఊహించుకోగలుగుతుందా ? స్వప్న స్వప్నకు అంత

విశాలహృదయం ఉందా।

ఉంటుంది తప్పకుండా ఉంటుంది. ఆ పదాల పొందిక చెప్తుంది ఆ విషయం., ఆ వింత భావాలు, లోతైన మాటలు ఆమె అసలు మనసును చూపిస్తున్నాయి.. ఆ ముత్యాల అక్షరాలే 'నేను నీకు అంకితం' అన్నట్లుంటాయి మరింకెందుకు భయం?

ఆలోచనలు ఒకటే ఆలోచనలు.. సుదూర తీరాన ఉన్న స్వప్న గురించే చక్రపాణి ఆలోచనలు మెదడను ఆవిరిచేసే ఆలోచనలు హృదయంలో అమృతం పంపేసే ఆలోచనలు ....గుండె లోతుల్లో స్నేహ గలగలలు వినిపింపజేసే ఆలోచనలు ఆగిపోని ఆలోచనలు ఆమెకు అర్పించుకున్న భావాలోచనలు ఆ ఆలోచనల్లో ఎన్నో అనుభూతులు మళ్ళీ మళ్ళీ మననంచేసుకునే మధురానుభూతులు ఆ ఆలోచనల్లోనే కలిసిపోయాయి.

* * *

తెలతెలవారుతుండగా

రోజూ వచ్చే తీయని కలలోంచి తేరుకున్నాడు చక్రపాణి ఆగిపోక, కలసిపోక పరుగులు తీస్తూనే ఉంది రైలు పట్టువదలని విక్రమార్కునిలా

చక్రపాణి బెర్తు దిగి క్రిందకు వచ్చాడు.. అక్కడ యించుమించు అందరూ పడుకునే ఉన్నారు.. ఎవరో కొందరు సిగరట్లు కాల్చుకుంటూ కిటికీ లోంచి తదేకంగా ఏదో ఆలోచిస్తూ కూర్చున్నారు

టాయ్‌లెట్‌లోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు

లోపలున్న లైటు వెలుతురులో అక్కడున్న అద్దంలో అతని ముఖం స్పష్టంగా కన్పిస్తోంది అప్పుడే అలాంటి సమయంలోనే అంటమైన అద్దం వికారంగా తన వైపు చూసినప్పుడే చక్రపాణి చలించిపోతాడు వణికిపోతాడు బెదిరిపోతాడు

ఆ అద్దంలో తన బింబం ముఖబింబం వికారంగా, అసహ్యంగా, ఎగుడు దిగుడుగా, వంకరటింకరగా కన్పిస్తోంది అలా ఒంటరిగా ఉన్నప్పుడు ఒక్కక్షణం అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నప్పుడు చక్రపాణి గుండెను ఎవరో బలంగా పిసికేసినట్లు ఫీలౌతాడు ఎక్కడున్న ప్రతి ప్రాణం గాని వస్తువు ప్రాణం చ్చి, ఉనవేపు చూసి నవ్వి, కేలుబట్టి కొట్టి, వింతగా, వెటకారంగ గేలుచేస్తున్నట్లుగా, ఒక చిన్నపిల్ల పెద్దవాణ్ని ఏప్రిల్ ఫూల్ చేసినప్పుడు ఎంత ఇదిగా నవ్వుతుందో అంతలా, తనను చూసి నవ్వినట్లుగా అన్పిస్తుంది

కట్టుకున్న ఊహాల మేడలన్నీ కూలి తన వికృతరూపంమీద పడిపోయినట్లు... పరిస్థితులు పరిహాసించి నవ్వినట్లు అన్పి

స్తుంది ఆ సమయంలో చక్రపాణికి..

గుండెను ఎంతలా రాయిచేసుకున్నా తనను తాను ఎంతలా సంభాళించుకున్నా అద్దంముందు కొచ్చేసరికి, తన రూపం తన కళ్ళకు దర్శనమిచ్చేసరికి అన్నీ పటాపంచలైపోతాయి.. నిప్పుల్లో తన గుండె పడిపోయినట్లనిపిస్తుంది

అలా కొంతసేపయ్యాక పగిలిపోతున్న మెదడులోంచి, గజిబిజిగా తయారైన ఆలోచనల్లోంచి ఒక రూపం. సుందర స్వప్నంలో సుందర రూపంలా.. ఊహాసుందరి స్వప్న నడుచుకుంటూ వస్తుంది ఆమె ఏవేవో మాట్లాడుతున్నట్లు, తాను వింటున్నట్లు ఆ మాటల్లో తాను సేదతీర్చుకుంటున్నట్లుగా అన్పిస్తుందతనికి

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు. . అలాగే ఒక మనసులో ఇద్దరికి స్థానం ఉండదు ఔనా రచయిత గారూ!?

వలపెరుంగక బ్రతికి కులికి మురిసేకంటె వలచి విఫలమొంది విలపించిన మేలురా! అని అన్నారెవరో మనిషి పుట్టింది చచ్చిపోవటానికే జననం తర్వాత మనిషికి శరణమయ్యే గమ్యం మరణమే! కాకపోతే ఒక అనుబంధాన్ని పెనవేసుకోవడంలో ఉన్న ఆనందాన్ని అనుభవించిపోతే తప్ప అదృష్టవంతుడు కాలేడు

నేనెప్పుడూ అశుభాలు పలుకుతానని నీ కెప్పుడూ కోపం వస్తుంది కదూ!? కీడెంచి మేలెంచమన్నారు చీకటి తర్వాత వెలుతురొస్తుంది. వెలుతురుపోయాక చీకటి తప్పకుండా వస్తుంది . ఈ జీవితంలో కూడా కీడు, మేలు అని రెండు రకాలున్నాయి .. మేలును ముందనుభవిస్తూ వచ్చేకీడును ఆలోచిస్తూ భయపడేకంటే, కీడనుభవిస్తూ వచ్చే మేలును ఆశించి ఆనందించడం ఎంతో హాయిగా ఉండదూ!?

మనం దూరంగా ఉన్నాం మన మనసులు ఎప్పుడూ పలకరించుకుంటూ పరవశించిపోతుంటాయి కదూ!?

ప్రేమకు కళ్ళు లేవు.. ఔను నిజం దానికి కళ్ళు లేవు ఉన్నవి మనసు, చెవులే! దానికి కావాల్సింది మధురమైన మాటలు, మారిపోని బాసలు, వాడిపోని ఊహలు, ఒక మంచిమనసు... అంతే! ఏమంటావ్ చక్రా?

మల్లెపూవుకంటె దాని వాసన ఎంతో బాగుంటుంది అలాగే మనిషి కంటె అతని మనసు అందంగా ఉండాలి నేను కోరుకునేది, కావాలనుకునేది అదే!

మనిషి కంటే కోయిలంటేనే నాకిష్టం ఎందుకంటే దాని గొంతులో హొయలు దాని అందంలేనితనాన్ని మరిపించేస్తుంది మనసులోని అందం వాకు కల్పిస్తుంది ఎలా? అని అడిగితే నేను చెప్పలేను

అలా స్వప్న వ్రాసిన ఉత్తరాల్లోని కొన్ని మాటలు గుర్తుకొచ్చి అతని ఆత్మ కడలిలోని ఆలోచనా కెరటాల విజృంభణ తగ్గుముఖం పడుతుంది మండిపోతున్న మనసుకు చల్లగాలి తగులుతుంది.

చెమట పట్టిన ముఖాన్ని నీళ్ళతో కడుక్కొన్ని, తుడుచుకుంటూ బయటకు వచ్చాడు

• • •

చక్రపాణి సూట్‌కేస్ తెరిచాడు అందులోంచి ఓ ఉత్తరం తీసి మడత విప్పి చదవడం మొదలుపెట్టాడు ఆ ఉత్తరం స్వప్న ఆఖరిసారిగా వ్రాసిన ఉత్తరం .

చక్రా !

ఎలా ఉన్నావు ? ఈ ఉత్తరంలో ఒక మంచి విషయం ఉంది... ఇన్నాళ్ళూ మనసులు ఉత్తరాల ద్వారా ఊసులాడుకున్నాయే కానీ, ఒకదానికొకటి ఎదురు అవలేదు. కానీ ఇప్పుడా అవసరం వచ్చింది మా ఇంట్లో అందరికీ మన విషయం తెలుసు మనల్ని కలపాలన్నదే వాళ్ళ ఆరాటంలోని అంతరార్థం... ఇన్నాళ్ళూ నాకా ఆలోచన రాకపోయినా ఇప్పుడెందుకో పదే పదే నీ రాకకోసం, మన వివాహంకోసం ఆలోచిస్తున్నాను... అందుకే నువ్వు సోమవారం సాయంత్రం నా దగ్గర కెలాగైనా రావాలి

రైల్వేస్టేషన్లో దిగి అక్కడ సిటీ బస్ గానీ, ఆటోగానీ ఎక్కి 'గాంధీగ్రాం' అంటే వాడు తీసుకొస్తాడు... అక్కడ ఒకే ఒక జూనియర్ కాలేజి ఉంది ఆటో అయితే అక్కడేదిగొచ్చు... ఆ రోడ్డు కాలేజి వెనకభాగం నుండి ఆ కాలనీ కాంపౌండ్‌వాల్‌ను కట్ చేసి అక్కడుండే యారాడ కొండమీదకు పోతుంది ఆ రోడ్డుమీదనుండి నడుచుకుంటూ వస్తే నాలుగో మలుపులో గట్టుమీద ఎర్రచీర, ఎర్ర జాకెట్టు తొడుక్కొని నువ్వు వ్రాసిన 'వినిపించని వేదన' నవల పట్టుకొని ఉంటాను . నువ్వు అక్కడకు రాకపోతే నేను ఎప్పటికీ ఆ కొండ దిగరాను

ఈ ఉత్తరం వ్రాస్తుంటే నా చేతులెందుకో వణుకుతున్నాయి చక్రా ! గమ్యం చేరువౌతున్నకొద్దీ కాళ్ళు పీకేస్తున్నట్లుగా, కాలం గడుస్తున్నకొద్దీ మనసులో తహతహ మరీ ఎక్కువై పోతుంది నాకు

ఎక్కడో కొండమీదకు రమ్మంటుందేమిటా ? అని కదూ నువ్వు ఆలోచిస్తున్నావు ? ఆ ప్రదేశం నా కిష్టం .. ఆ ప్రకృతిలో ప్రశాంతత నా అభిమాన ధనం నా కిష్టమైన వ్యక్తిని మొటమొదట అక్కడే చూడాలన్నది నా కోరిక... కాదనవు కదూ !! ఆ తర్వాత నేను, నువ్వు జంటగా మా ఇంటికి వెళ్దాం.... ఉంటానూ.. కాబోయే నీ....

స్వప్న.

ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకొని బయలుదేరాడు చక్రపాణి

* * *

ఆటో జోరుగా వస్తోంది వీచే చల్లగాలికి చక్రపాణి మేను పులకిస్తోంది వచ్చే ఊహలకు ఆతని మనసు పరవశిస్తోంది

ఆటో జూనియర్ కాలేజిరోడ్డు దగ్గర ఆగింది దిగి డబ్బులిచ్చేసాడు చక్రపాణి ఆటో తిరిగి వెళ్ళిపోయింది

చక్రపాణి చుట్టూ ఒక్కసారి చూసాడు నిర్మానుష్యంగా ఉంది ఆ ప్రదేశం అక్కడక్కడా ఒకరిద్దరు నడుస్తూ కన్పించారు కుడిచేతి వైపు దూరంగా చిన్న కొండమీద శివాలయం, కొంచెం ముందుపిర్డి సాయిబాబా ఆలయం, ఎడమ ప్రక్క విశాలమైన అందమైన కాలేజి . కొత్త మెవగ్గా పెద్ద గ్రౌండ్., ఆ గ్రౌండ్ వానుకొని పెద్ద కొండ

చక్రపాణి ముందుకు కదిలాడు

అతని హృదయంలో అతృత ఏడు గుఱ్ఱాల జోరులో ఉంది ఏదో తహ తహ కొండంత ఎదిగిపోతుంది

అతను ఊహిస్తున్నది వ్యప్న రూపం గురించి కాదు ఆమె ప్రవర్తన గురించి అతను ఆలోచిస్తుంది ఆమె అందచందాల గురించి కాదు అభిమాన అనురాగాలు సంగమించిన అందమైన మనస్సు గురించి . అతను కోరుకుంటున్నది అందమైన ఆమె శరీరాన్ని కాదు . తన్నానందింపజేసే సంస్కార సుగుణాన్ని

అక్కడ రోడ్డు సిమెంటురోడ్డుతో కలిసింది అది కొండమీదకు దారి తీసింది

పాదవడిగా అడుగులేద్దామనుకుంటే ఆవి తడబడుతున్నాయి నెమ్మదిగా వెళ్దామంటే మనసు తొందరపడి ముందుకు తోసేస్తుంది

ఇంకొంత దూరం నడిస్తే ఆ కొండ చేరువౌతుంది ఈ దారిలోంచే నా చెలి వెళ్ళి ఉంటుంది ఈ దారి చివరనే ఆమె నాకోసం ఎదురుచూస్తుంటుంది... ఈ దారే తననేంచేసినా ! నన్ను మెచ్చి నా చెలి చెంత చేరినా, ఈసడించి ఏవగింపుగా మాట్లాడి అవమానపరచినా, ఈ దారిలోనే జరిగిపోతుంది.

ఛ స్వప్న అలా ప్రవర్తించదు

అలాంటిదే అయితే నా ఫోటో పంపమని ఒకసారి ముచ్చటగా వ్రాసినా తను భయపడి పంపలేదు ఏమనుకుందో ఏమో ఆ విషయాన్ని మళ్ళీ ఎప్పుడూ వ్రాయలేదు

కొండగాలి చక్రపాణికి స్వాగతం పలుకుతోంది సిమెంటు రోడ్డుమీద నడుస్తుంటే ఆ దారి తన కాలివి స్పర్శిస్తుంటే అదో అనుభూతి, మరేదో ఆనందం కలుగుతోంది

ప్రక్కనే కాలేజీ ప్రహరీ గోడ ఎదురుగా ఆ కాలనీ కాంపౌండ్ వాల్

.... ఆ కొండమీదకు పోయే ఈ దారి కోసం చిన్న ద్వారం

ఆ ద్వారం దాటాడు చక్రపాణి... అతను వెనక్కి తిరిగి చూడలేదు.... చూసుంటే ఎలా ఉండేదో గానీ అతను చూడలేదు

అతని జీవితంలో అదృష్టంలోంచి దురదృష్టం తిరిగిచూస్తుంది దుర దృష్టంలోంచి అదృష్టం తిరిగిచూస్తుంది .... అందుకేనేమో అతను వెనక్కి తిరిగి చూడలేదు

ఆ రోడ్డు తెల్లగా, ఎత్తుగా, వంపుగా ఎంతో రమణీయంగా ఉంది

ఈ దారి ప్రకృతి స్వర్గానికి దారి ... నా దేవత గుడికి వేసిన ముత్యాల బాట అని అనుకున్నాడు చక్రపాణి.

ఇన్నాళ్ళూ అతను దేన్ని గురించి ఒక్కసారిగా కృంగిపోయాడో అది అసలతనికి గుర్తేలేదు అది ఆ దారి మహిమేనేమో!!

ప్రేమ పరిపక్వదశకు వస్తే మనసు సంతృప్తితో నిండిపోతుంది అందో ళన ఆవిరైపోతుంది

ఇన్నాళ్ళూ ఎరుగని ఏదో హాయి తేలికదనం పొందుతున్నాడు చక్రపాణి రోడ్డుమీద కొంచెం కొంచెం ముందుకు నడుస్తుంటే భూమ్మీద పచ్చరంగు ఒలికిపోయినట్లున్న ప్రకృతి అందాలు కనిపిస్తున్నాయి ఆకాశాన్ని ముద్దు పెట్టుకున్నట్లున్నశిఖరాగ్రాలు, ఆకొండల మధ్యలో పల్లెటూరిపిల్ల ఫాలభాగాన కుంకుమ బొట్టులా ఉన్న సూర్యబింబం

ఇవేమీ చక్రపాణి గమనించడం లేదు

అతను చూసేది ఎదురుచూపులే .. ఆ చూపుల్లో ఆత్రుత 'ఆమె' కోసమే

స్వప్నాలను నిజంచేయబోతున్న స్వప్న కోసమే

కష్టంగా ఉన్నా గబగబా ఎక్కు తున్నాడు... కమలప కూడా తిరిగాడు...

అక్కడ ఆ రూపం ఆమె రూపం ఆమె చేతిలో 'వినిపించని వేదన' పుస్తకం

చక్రపాణి కళ్ళు చెదిరిపోయాయి . పచ్చని ప్రకృతి, తెల్లని ఆమె మేను, రెపరెపలాడుతున్న ఆమె చీర చెంగు.... ఇదంతా, ఆ ప్రదేశమంతా భరతమాత కట్టుకున్న చీరలా ఉంది.

ఇ ఇద్దరి మధ్యా పదడుగుల దూరం

ఇన్నాళ్ళూ, పరుగెత్తిన కాలం ఇప్పు డాగిపోయినట్లయ్యింది .... పరుగెత్తీ, పరుగెత్తీ అలసిపోయినట్లుంది .

ఆమె కళ్ళల్లో వింత భావం ఉంది . . సమస్త కళలూ సంగమించిన ఓ శరీరం ఆమె మోములో ప్రతిబింబించి నట్లుంది పదేపదే పలికిన పదం ... పేరు స్వప్న . ఆన్న రెండక్షరాలు ఇప్పుడు పలుకుదామని ఉంది - ఆవే శంగా, ఉద్వేగంతో పిలవాలని ఉంది .



కానీ, గొంతుక్కి ఏదో అడ్డుపడినట్లుగా ఉంది.... అది పొంగి పొరలుతున్న ప్రేమా? ఎగిరి గంతులేస్తున్న అభిమానమా? ఉర్రూతలూగుతున్న ఉద్రేకమా? ఉయ్యాల లూగుతున్న ఆనందమా? కళ్ళెంలేని కోరికల పరంపరా? ఏమిటి? ఏమిటి?

అది భాష కందని భావం.... ఆ భావంతో అతని పెదవులు వణికిపోతున్నాయి. వడగళ్ళ వాన పడినట్లు, వరదొచ్చేస్తున్నట్లు, ఆమని ఆనందతాండవం చేస్తున్నట్లు.... ఏదో, ఏదోలా, విప్పలేని వింత భావాలు, రాగాలు.... రవళిస్తున్నాయి....

అతి కష్టంతో పెదవుల్లోంచి ఒక పదం బయటపడింది....

'స్వ... ప్నా.... !'

బరువుగా, బొంగురుగా వచ్చిందా పిలుపు.... ఆ బరువులో ఆవేదన ఉంది .... ఆ బొంగురులో ఆరాధన ఉంది....

నల్లని కళ్ళు అందంగా చూసాయి ... .... అతన్ని పరికించి చూసాయి....

మామూలు జోళ్ళు, లూజు షరాయి, లాల్చీ, వాటిలో సన్నగా పీలగా ఉన్న శరీరం, దళసరి అద్దాలు, వాటిల్లోంచి కన్పిస్తున్న భూతం కళ్ళు, దళసరి కనుబొమలు, చిన్న ఎర్రని తల.... నల్లని రంగుతో ఉన్న చక్రపాణి కన్పించాడు....

'స్వప్నా !'

ఆ పిలుపుతో ఆమెలో చప్పున ఓ భావం మెదిలింది....

ఎందుకో ఆమె తల క్రిందకు వాల్చేసింది....

అంతే! అతను ఆ రోడ్డు మొదట్లో మరచిపోయిన ఆలోచనలు.... మళ్ళీ, మళ్ళీ.... పెనుగాలిలా.... సుడిగాలిలా .... తుఫానులా .... చెలరేగిపోయాయి .... కానీ, అతనిలోని భావాల పరంపర పెల్లుబికింది....

'స్వప్నా! స్వప్నా! ఏమిటి స్వప్నా? ఇదేమిటి? నీ కోసం ఇన్నాళ్ళూ కాచుకొని ఉంది, నీ ఉత్తరం అందగానే వరుగెత్తి అలసి సొలసి వచ్చిన నాకిచ్చే స్వాగతం ఇదేనా? పలికే మొదటి మాట మౌనమా?'

ఆమె ఒక్కసారి తల పైకెత్తి చూసింది. ఆ కళ్ళలో ఒక భావం కనిపించింది చక్రపాణికి.

అదే.... అదే ఆ భావం పేరు, ముద్దు పేరు, అసలు పేరు అసహ్యమే!

ఎప్పటివో మాటలు గుర్తుకొచ్చాయి. అందమైన ఆడపిల్లలకు కావాల్సింది బలమైన ఆధారం, అందమైన ఆలంబన. నా ఈ చింపిరి ఆకారం కాదు. చితికిపోయిన జీవితం కాదు.

స్వప్నా! నువ్వు కూడా నువ్వు కూడా అందరిలాంటి దానివేనా? అయితే నీ వన్న మాటల కర్థం ఏమిటి? గొంతులోంచి వచ్చిన భావుకతేనా అది? ఎండిపోయిన గోదారి గలగలలేనా అవి? స్వప్నా!

ఆమె అటువైపుకు తిరిగిపోయింది.

అంతేనా స్వప్నా! స్వప్నాల్లోనే నా బ్రతుకు కరిగిపోవాలా? నువ్వు నాకో స్వప్నంగానే మిగిలిపోవాలా?

ఆమె ఏమీ బదులివ్వలేదు. అటువైపు నుండి తల తిప్పలేదు. వెక్కుతూ ఏడుస్తోంది...



నా రూపం చూసింతర్వాత ఆమె ఇన్నాళ్ళూ కట్టుకున్న ఆశల హర్మ్యాలు కూలిపోయాయన్నమాట.... కన్నకలలు చేదునిజాలైనాయన్నమాట! అందుకే ఆమె అంతలా బాధపడుతుంది.... తను ఊహించుకున్న రూపం నాది కాదని వెక్కి వెక్కి ఏడుస్తుంది.... మరి ఆమె ఇన్నాళ్ళూ వ్రాసిన వ్రాతల కర్థం, అంతరార్థం ఏమిటి?

అతనిలో కోపం రగులుతుంది....

"స్వప్నా! నాకు కోపం వస్తోంది.... ఆరాధనతో, చల్లదనంతోపాటు తిరగబడితే కోపాగ్ని కూడా ఉంటుంది వంచి విఫలమవ్వడంలో హాయి ఉందని నువ్విలా ప్రవర్తిస్తున్నావా? ప్రేమకు కళ్ళులేవని నన్ను చూసి కళ్ళు మూసుకుంటున్నావా? కోయిల రూపంలో కమ్మని గొంతును వినలేవా? మనసులోని అందం నీకు కన్పిస్తుందన్నావే, మరి నన్ను చూసి ముఖం చాటుచేసుకున్నావేం? ఇంతటి నీచమైనదానివి నన్నెందుకు ఆకర్షించావ్? సంస్కారం ఉట్టిపడే మాటలెందుకు వ్రాసావ్? అవును నాకు అందం లేదు నాకు అందం లేదు కాకిని నల్లకాకిని కానీ, నువ్వు మోసగత్తెవు ఆహా! నీలోని ఆరాధన, అభిమానం ఇదా? గుండెల్ని చింపేసే అభిమానం నీలో ఉందనుకున్నాను. గుండెలు పగిలిపోయేంత అసహ్యం ఉందా? నా గుండెలో నీకో పెద్ద గుడిని కట్టి దానిలో దేవతవు నువ్వే అనుకున్నానే కానీ ఇదా? ఛీ! ఛీ! నా దేవత ఇంత నీచమైనదా? ఈ లోకంలోని మనుష్యులు మనుష్యులు కారు రాక్షసులు కానీ, నువ్వు నువ్వు. ఛండాలురాలివి"

ఆమె ఒక్కసారిగా తల వెనక్కి తిప్పి. కళ్ళు పెద్దవిచేసి చూసింది ఎర్ర జీరల్తో ఆమె కళ్ళు అతి భయంకరంగా ఉన్నాయి.... ఆ కళ్ళల్లో నన్నని కన్నీటి పొర ఆమె ఊగిపోతుంది కాళిలా.... ప్రళయకాల రుద్రిలా.

అతను ఆగిపోయాడు ఆ చూపుతో అతను చల్లారిపోయాడు...

"సారీ నన్ను క్షమించు స్వప్నా. సారీ, క్షమించండి ఎగురుతున్న గాలిపటం తెగిపోయి ఏ చెట్టుకో అంటుకొని ఆ చెట్టు నాది అంటే ఎలా కుదురుతుంది! కోపంలో ఏదో నోరు జారిపోయాను మనం మనుష్యులం దేవతలం కాదు. ఆశలు, కోరికలు, ఊహలు ఉంటాయి మనకు. అందంలేని నన్ను ఆడపిల్ల కూడా కోరుకోదు ఎంతో అందం ఉన్న మీరు నన్నెలా అంగీకరించగలరు! దురాశ నా కళ్ళు కప్పేసింది నోరు జారించేసింది నన్ను క్షమించండి

అవి అన్నంతలో ఆమె చేయి విసురుగా విసిరింది 'వెళ్ళిపో' అన్నట్లుగా....

అంతవరకు కనురెప్పల్లో ఒదిగి ఉన్న కన్నీరు ఉబికింది గులాబి చెంపల మీదుగా జాలువారింది ఆ చర్యకు చక్రపాణి కళ్ళవెంట కూడా కన్నీరు ఆగలేదు

నన్ను, నా రూపాన్ని చూసి ఎంతగా ఆమె నిరాశపడిందో ఉబికిన ఆ కన్నీరే చెప్తుంది అనుకుని

"వెళ్ళిపోతాను ఉండమన్నా

ఉండను నేను... ఉండమనేవారు కూడా లేరు నాకు.... వస్తాను ." అని గిరుక్కున తిరిగిపోయాడు చక్ర పాణి ...

అతని గుండె మండిపోతుంది. . మనసు కాలిపోతుంది . మెదడు పగిలిపోతుంది శరీరం అంతా చెమ టలు, వణుకు... వివరించి చెప్పలేని వణుకు ... పల్లం వల్ల, అతనిలో ఆవేశంవల్ల అడుగులు వడిగా పడు తున్నాయి అతను వెనక్కి తిరిగి చూడలేదు

అశ నన్ను మోసం చేసింది అక్ష రాల్లోనే ఆత్మీయతాభిమానాల్ని వెల్లువలా కురిపించి మోసంచేసిన వంచకురాలు..

ఆమె విషాద కథల్ని సృష్టించే కథకు రాలు.... పదాల్లోని పరిమళం ప్రవర్త నలో లేదు . . అక్షరాల్లో సంస్కారం మనస్సులో లేదు... నేనోడిపోయాను కాదు. .. మోసపోయాను మోజు వరదలో కొట్టుకుపోయాను

అతని ఎర్రని కళ్ళలో కన్నీటి వర్షం. . . ఆవేదన వడగాల్పులు రక్త వరదొచ్చి గుండె పగిలిపోయేలా అంది కళ్ళు రెండూ పేలిపోతున్న ట్లుగా ఉన్నాయి . అతన్ని తాకితే వేయి వోల్టుల కరెంటుషాక్ కొడ్తుందేమో అన్నట్లుగా అన్నాడు

చెమటపట్టిన ముఖం తో, చెరిగి పోయిన తలతో, ఎన్నో భావాలు మిళిత మైన భావంతో, అతను పిచ్చివాడిలా ఉన్నాడు ప్రేమబిచ్చగాడిలా ఉన్నాడు

వడివడిగా పడిన అడుగులు ఒక్క సారిగా అక్కడ ఆగిపోయాయి ఎత్తిన కళ్ళకు అక్కడ ఆ కాలనీ కాంపౌండు వాల్ మీద . అందంగా వ్రాసిన నాలుగు అక్షరాలు కన్పించాయి అవి చూసిన మరుక్షణం అతని నోరు పెగల్లేదు మెదడులో ఉరుములు, మెరుపులు తాను నిల్చున్న చోట నేల పగిలి తాను కూరుకుపోయి నట్లు అన్పించింది

అతన్ని వ్యాప్న మోసంచేయలేదు.. అతన్ని అతనే మోసంచేసుకున్నాడు . అపార్థం చేసుకున్నాడు. వెళ్ళేటప్పుడు ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుంటే .. ఇప్పటికి పున్నమి వెన్నెల కురిసేది. . అభిమాన, అనురాగ సంకెళ్ళు పడి ఉండేవి ..

అంటే . అంటే ఇందాక ఆమె చేయి చూపించింది ఈ గోడపైనా?

అతను ఒక్కసారిగా వెనక్కి తిరిగి చూసాడు. .

ఆమె పరుగెత్తుకుంటూ వస్తోంది .. జీవిత నౌక దూరమైపోతుందన్న ఆతృత, ఆవేదన ఆ పరుగులో ఉంది. ..

ఆగలేకపోయాడు చక్రపాణి . పరుగెత్తాడు . బలహీనంగా ఉన్నా, గుండె బరువెక్కిపోతున్నా పరుగెత్తాడు.

.... ఆమె కౌగిలిలోకం కోసం .. ఆమె హృదయసామ్రాజ్యం కోసం.

ఆ కొండ మీద ఒక నిమిషం పాటు ఉరకల, పరుగుల ప్రళయం ఆ ప్రళయం సృష్టించింది ప్రేమ కౌగిలిని కలిపిందో ప్రేమ జంటని ఆ కౌగిలిలో ప్రేమ స్నేహాల విలువ హిమాలయాల్ని దాటింది

అతను ఒగరుస్తున్నాడు. ఆమె ఆయాసపడుతోంది

భావాల పరంపరలు, అనురాగాల రవళులు ఒక్కసారిగా ఒక్కుమ్మడిగా చెలరేగిపోయాయి...

స్మృతుల స్మృతిలో, అనురాగం లయంతో ప్రేమసంగీతం విన్పించింది ఆ హృదయాల్లో

"నన్ను క్షమించు స్వప్నా! నన్ను క్షమించు ఇందాకా ట్నుంచి నీ ముఖంలో ఆ భావాలకు కారణం ఇదా? నేను గుర్తించలేకపోయాను స్వప్నా, నన్ను క్షమించు నాకు వివరంగా నోరువిప్పి చెప్పలేని ఆ వేదన నాకు విన్పించలేదు . కానీ... కానీ ఇప్పుడు నాకు కన్పిస్తుంది... నీ మనసు కన్పిస్తుంది అందులోను అందాలు కన్పిస్తున్నాయి.. మధురమైన నీ భావాలు గుండెలోన ఉండిపోవాలని, అవి నాకే వినిపించి, అంకితమైపోవాలని, అవి గొంతుదాటి బయటకు రాగూడదని... ఆ దేవుడు నా కోసం కల్పించిన అవకాశం స్వప్నా! ఇది నా వరం... 'చెప్పలేక, నా బలహీనత సృష్టించిన విపరీత ప్రవర్తనను భరించలేక అప్పుడు నీవెంత వలిగిపోయావో, నీ మనసెంతగా కుమిలిపోయిందో ఊహిస్తేనే నా గుండె నీరైపోతుంది.... నన్ను క్షమించు స్వప్నా!"

అతని గుండెలో గువ్వలా ఒదిగిపోయిందామె ...

ఆనందంగా వర్షిస్తున్న కళ్ళు, సంతోషంతో వణుకుతున్న పెదవులు ఎవరికీ విన్పించకుండా, నిశ్శబ్దంగా మాట్లాడుకుంటున్నాయి....



# నాకు నచ్చిన నా కథ



వాసిరెడ్డి సీతాదేవి

నాకు చిన్నతనం నుంచి సర్కస్ అన్నా, బాక్సింగ్ అన్నా, వెయిట్ లిఫ్టింగ్ అన్నా చూడానికి ఇష్టపడను. అలాంటివి చూడడంలో నాకు ఆనందం కలుగదు. ఏదో బాధ కలుగుతుంది.

చాలా సంవత్సరాలు హైదరాబాద్ ఎగ్జిబిషన్‌లో ఓ వ్యక్తి వంటిమీద కిరసనాయిల్ పోసుకుని, నిప్పు అంటించుకొని చాలా ఎత్తునుంచి కిందనున్న నీళ్లటాంకులోకి దూకేవాడు. అది చూడటానికి చాలామంది ఎనిమిది తర్వాత టికెట్ కొని అక్కడికి వెళ్ళేవాళ్లు, ఎవరు ఎన్నిసార్లు పిల్చినా నేను మాత్రం ఆ దృశ్యం చూడలేనని చెప్పేశాను. అలాంటివారిని ప్రభుత్వం ఎందుకు అనుమతిస్తుందని మథనపడేదాన్ని.

ఈ కథ ఆగస్టు 1968 లో జయశ్రీకి రాశాను. 1969 లో ఎగ్జిబిషన్‌లో కిరసనాయిల్ పోసుకుని నిప్పంటించుకునే వ్యక్తి రాలేదు. ఎక్కడో లేక ఇక్కడేనో ఇలాంటి ఫీట్ చేస్తూ చచ్చిపోయాడని— అది విని నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈ కథ రాసిన ఆరునెలల తర్వాత ఈ విషయం తెలిసింది నాకు. చాలా చిత్రంగా ఉంది కదూ!

కొందరు నాస్తికులు ఆస్తికులు కావడం, ఆస్తికులు నాస్తికులు కావడం చూస్తుంటాము. విభిన్న విశ్వాసాలు ఉన్నవారిమీద ఒకే సంఘటన ప్రభావం



పడి. వారి విశ్వాసాలు సమూలంగా మారిపోవడం కూడా జరుగుతుంది.

ఈ కథ నాకు నచ్చిన నా కథలలో ఒకటి.

# తమసోమా జ్యోతిర్గమయ

"ఏవరూ? గోపాలం! నువ్వటోయ్?"

గోపాలం కాళ్లకు సడన్ బ్రేక్ పడినట్టు ఆగిపోయాడు

ఎదురుగా సిద్ధాంతిగారు కన్పించారు. పచ్చగా, పొట్టిగా, లావుగా, గుండ్రంగా ఉన్న విగ్రహం ఒకదానిమీద ఒకటి మూడు సున్నాలు చుట్టి నట్టుంది. చొక్కా లేకుండా కప్పుకున్న నీలం శాలువాలోనుంచి బొజ్జ కన్పి స్తున్నది. మోకాళ్లవరకు ధోవతి. చేతులకు సింహతలాటాలు. లలాటం మీద కుంకుమబొట్టు.

"ఏమిటోయ్ అలా చూస్తావ్? నాన్నగారు కులాసాగా ఉన్నారా?"

"ఆరోగ్యం అంత బాగా లేదు."

"నీ చదువు పూర్తి అయిందా?"

"ఆఁ ఎం ఏ. పాసయాను. ఉద్యోగాన్వేషణలో ఉన్నాను. నాన్నగారికి ఇదో దిగులు."

"అన్నీ తెలిసిన మీ నాన్నగారు ఈ చిన్న విషయాలకు దిగులుపడడం ఏమిటి?"

"అన్నీ తెలిసినవారికి సమస్యలు ఉండవా?"

"ఉంటాయనుకో, దిగులుపడి చేసేది మాత్రం ఏముంది?" ప్రాప్త వ్యమర్థం లభ్యతే మనుష్యః దేవో౽పి తం లంఘయితుంనశక్తః." అన్నాడు సిద్ధాంతి అరమోడ్పు కన్నులతో కుడిచేతిని గాలిలోకి విసురుతూ.

"నాకు సంస్కృతం రాదు. అర్థం తెలవిస్తారా?" వణ్కు మందిన గోపాలం అడిగాడు

"అంటే మానవుడు తను పొందవలసిన వస్తువును తప్పక పొందును. దానిని భగవంతుడు కూడా ఆపలేడు," సిద్ధాంతి గర్వం ఉట్టిపడే స్వరంతో అన్నాడు.

"అంటే మనకు ప్రాప్తం ఉంటే దానంతట అదే లభిస్తుందంటారు? భగవంతుడు కూడా అడ్డుకోలేడన్నమాటేగా?"

"అక్షరాలా అంతే!" బొడ్లోనుంచి ముక్కుపొడుం డబ్బా తీస్తూ అన్నాడు.

"అంటే భగవంతుడు కావాలనుకున్నా ఒక వ్యక్తిని బాగుచెయ్యనూ లేడు-పాడుచెయ్యనూ లేడు- అంతేగా!"

"అవునవును!" కొంచెం తడబడ్డాడు సిద్ధాంతి.

"అయితే మరి భగవంతుడు చెయ్యగలిగిందేమిటో తెలవిస్తారా!"

సిద్ధాంతి పొడుంకాయ మూత తీశాడు. అరచేతిలో ఇంత పొడుం వేసుకుని ముక్కుదగ్గర పెట్టుకుని గట్టిగా పీల్చాడు.

"ఎక్కడిదాకా!" సంభాషణ మారుస్తూ గోపాలాన్ని అడిగాడు.

"అవాడినుంచి అనంతలోకి" అన్నాడు గోపాలం

సిద్ధాంతి ఫొల్లున నవ్వాడు. చేతిలో ఉన్న పొడుంకాయ మూత పెట్టి బొడ్లో దోపుకున్నాడు. అరచేతిని కాలువాకు తుడిచుకున్నాడు. పిల్లి అరచేతితో ముక్కు తుడుచుకున్నాడు

"తమరు ఎక్కడ్నుంచీ, ఎక్కడిదాకా!"

"కలెక్టరుగారింటినుంచి వస్తున్నానోయ్! నలుగురు ఆడపిల్లల తర్వాత ఓ వంశోద్ధారకుడు జన్మించాడు. ఆ కుర్రాడికి జాతకం రాసి వస్తున్నాను."

"బ్రహ్మాండంగా వుంది. అదృష్టజాతకుడు. ఎనభై ఏళ్ళు జీవిస్తాడు. మహారాజ వైభవం అనుభవిస్తాడనుకో!"

గోపాలం సిద్ధాంతి పక్కనే నడుస్తున్నాడు. అతనికి ఏమీ లేదు. ఏమీ తోచక, భవిష్యత్తు గురించిన ఆలోచననుంచి తప్పించుకోవడానికి పేవ్‌మెంటు మీద నడుస్తున్నాడు. అయినా అతన్ని ఆలోచనలు వదలడం లేదు. సిద్ధాంతి మంచి సమయానికి దొరికాడు అతన్ని ఒక పట్టాన వదిలిపెట్టాలని లేదు.

"ఒకవేళ మీ జాతకం "

"అఁ అఁ ఎంతమాట! నేను వ్రాసిన జాతకాన్నే సందేహిస్తున్నావా!"

"ఒకప్పుడు మీ నాన్నగారు మంచి స్థితిలో ఉన్నారు. మీరు నా జాతకం కూడా బ్రహ్మాండంగానే రాశారు."

సిద్ధాంతి నడక వేగం పెంచాడు. గోపాలం కూడా నడక వేగం పెంచాడు,

"మీ జాతకం ప్రకారం కలెక్టరుగారి అబ్బాయి ఎనభైఏళ్లు బ్రతికి తీరాలంటారు. అవునా!"

"అవును !"

"ఒకవేళ సంవత్సరం తిరక్కుండానే.... లేక "

"అలా రాసిరావడానికి వీలులేదు."

"అకాల మృత్యువని దేన్ని అంటారు ?"

సిద్ధాంతి ఆ మాటలు వినిపించుకోనట్టు చకచక నడుస్తున్నాడు.

"ఆ కాలం వస్తే లక్ష ప్రయత్నాలు చేసినా మృత్యువునుండి తప్పించుకో లేమంటారు గదూ ?"

"ఈ కుర్రకుంక ఇవ్వాళ నా వెంటపడ్డాడేం ?" మనసులోనే అనుకున్నాడు సిద్ధాంతి.

"అవును నాయనా ! నా కాలే మ్రియతే కశ్చిత్ ప్రాప్త కాలేన జీవతి." అన్నాడు పైకి.

"అంటే నాకు ఫలానా రోజు ఫలానా జబ్బుతో చావాలని రాసిపెట్టి వుంటే, దాన్ని తప్పించుకోలేమంటారు, మన ప్రయత్నాలు వ్యర్థం అంటారు. అంతేనా !"

"అంతే నాయనా !"

"మరెందుకండీ మీ అబ్బాయికి జబ్బుచేస్తే డాక్టర్ నాయర్ కాళ్ళమీద పడ్డారెందుకండీ నా బిడ్డను బ్రతికించమని ఏడుస్తూ ?"

సిద్ధాంతి ముఖం బోనులో పడిన ఎలుక చందమైంది.

"ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీ. మన ప్రయత్నం మనం చెయ్యాలిగా ?"

గోపాలం ఫక్కున నవ్వాడు.

సిద్ధాంతి వినిపించుకోనట్టే నడిచాడు.

"మీ సిద్ధాంతాలన్నీ పరస్పర విరుద్ధంగా ఉన్నాయి గురూగారూ !"

సిద్ధాంతి నడక వేగం పెంచాడు.

"ఆ మేకపిల్లను చూడండి."

గోపాలం అన్నది ఏమిటో అర్థంకాక సిద్ధాంతి నిలబడిపోయాడు.

"ఆ మేకపిల్లకు భగవంతుడు మరో ఆరునెలలకు చావు రాసిపెట్టాడే అనుకోండి. ఇవ్వాళ అది చావదుగా ?"

"చావదు "

"నేను దాన్ని కొని ఈ రోజే చంపితే ?"

మీది రాతిగుండెంట గదా.. అక్క ఈ కొబ్బరికాయలు మీ గుండె మీద పగలకొట్టుకుని తొరగా తీసుకు రమ్మంది బావగారూ!!



సిద్ధాంతి గంభీరంగా నవ్వాడు. ఆ నవ్వు గోపాలాన్ని ఎంత అజ్ఞానంలో పడివున్నావు నాయనా!" అని జాలిపడినట్టుంది.

"దానికి ఈనాటితో ఋణం తీరితేనే నీకు అలాంటి బుద్ధి పుట్టిస్తాడు ఆ సర్వాంతర్యామి 'తాదృశీ జాయతే బుద్ధిః యాదృశీ భవితవ్యతాః' ఎలా రాసి పెట్టివుంటే అలాగే మనచేత పని బుద్ధి చేయిస్తుంది."

"అంటే బుద్ధి స్వతంత్రంగా పనిచేయదన్నమాట!"

"చెయ్యదు" ఖచ్చితంగా అన్నాడు సిద్ధాంతి.

"అంటే మానవుడు చేసే పనులకు అతడు బాధ్యుడు కాదన్నమాటేగా? మరి ఇది పుణ్యం! ఇది పాపం! ఇది చెయ్యి! ఇది చెయ్యకు! అనే నీతిబోధలు ఎందుకు? మీ ధర్మశాస్త్రలు ఎందుకూ?"

సిద్ధాంతికి కోపం వచ్చింది. ముక్కుపొడుం గట్టిగా పీల్చి ఉక్కిరి బిక్కిరై పోయాడు.

"మానవుని బుద్ధి స్వతంత్రంగా పనిచెయ్యదు గదా? అది భగవంతుడి నిర్ణయానికి బద్ధమై ఉంటుంది అంటున్నారు"

"నేను అనడం ఏమిటి! శాస్త్రాలు ఘోషిస్తున్నాయి."

"అదేలెండి. మరైతే భగవంతుడు అందరి చేతా మంచిపనులే చేయించవచ్చుగా ?"

సిద్ధాంతి సమాధానం ఇవ్వలేదు

"ఇవాళ తమరి దగ్గర చాలా ముఖ్యమైన విషయం తెలుసుకున్నాను."

"ఏమిటో అది ?" నొక్కుతూ అన్నాడు సిద్ధాంతి.

"పాపం చేసిన వ్యక్తి బాధపడనక్కర్లేదు."

సిద్ధాంతి రక్కున నిల్చున్నాడు.

"రామ ! రామ ! నేను అలా అన్నానా ?"

"ఇంతకు ముందే కదండీ అన్నారు ?"

"ఏమని ?"

"బుద్ధి స్వంతంత్రమైంది కాదనీ, ఏది చేయించినా ఆ లీలామయుదేవనీ..."

"మీలాంటి నాస్తికులకు సమాధానం ఇవ్వలేను నేను మా గురువు చెప్పింది నమ్మాను. మరొకరికి చెబుతున్నాను."

అంతలో రోడ్డుపక్కగా శవం ఎదురైంది శవవాహకులు వేగంగా నడుస్తున్నారు.

సిద్ధాంతి పేవ్‌మెంటు మీద ఓరగా నిల్చుని కళ్ళు మూసుకున్నాడు.

"భగవాన్ ! ఈ మృతుని ఆత్మకు శాంతి కలుగునట్లు చెయ్." అని ప్రార్థించాడు.

గోపాలం సిద్ధాంతి ముఖంలోకి చూస్తూ నిల్చున్నాడు.

సిద్ధాంతి కళ్ళు తెరిచాడు.

"ఇవ్వాళ ముక్కోటి ఏకాదశి, ఎంత పుణ్యంచేసుకుంటే ఇవ్వాళ చావు లభిస్తుంది ?" తన్మయత్వంతో అన్నాడు సిద్ధాంతి.

"అదేమిటి గురువుగారూ ! ఆ చావు మీకే లభించినట్టు ఆనందపడి పోతున్నారు ?" అన్నాడు గోపాలం.

సిద్ధాంతి తృప్తి పడ్డాడు. గోపాలం కేసి చురచుర చూశాడు.

"అయితే గురువుగారూ ? ఈ రోజు చనిపోయినవాళ్లు తిన్నగా వైకుంఠానికే వెళ్తారటగా ?" అన్నాడు గోపాలం.

సిద్ధాంతి కోపం ఎగిరిపోయింది.

"అవునయ్యా గోపాలం. ఇవ్వాల్టి రోజు వైకుంఠం ద్వారాలన్నీ బార్లాతెరిచి

ఉంటాయి. తిన్నగా ఆ శేషతల్పశాయి పాదపద్మాల దగ్గరికే వెళ్ళి వాలిపో వచ్చును." ఆనందపారవశ్యంతో అన్నాడు.

"అయితే స్వామీ ఆత్మ అనేది ఒకటి ఉన్నదంటారా?"

"అయ్యో! ఎంతమాట? ఈ శరీరం అశాశ్వతం. ఆత్మ శాశ్వతమైనది. ఆత్మకు చావులేదు. ఆత్మ అమరం. ఈ శరీరం కేవలం మనం ధరించిన చొక్కా లాంటిది. అది మాసిపోతే తీసేస్తాం. అలాగే ఆత్మకూడా శిధిలమైన శరీరాన్ని విసర్జిస్తుంది"

"ఒకోసారి పసిశరీరాల్నీ, మంచి వయసులో ఉన్న శరీరాల్ని కూడా ఆత్మ వదిలేస్తుదేం?"

"అదంతా పూర్వజన్మ సుకృత విశేషం నాయనా! ఈ భూమిమీద ఎంత కాలం రుణం ఉంటే అంతే కాలం అనుభవించి పోతారు."

"కొందరు నిర్జీవంగానే పుట్టారు."

"ఇవన్నీ చాలా పెద్ద విషయాలు. నీకు అర్థం కావు."

"అందుకేగా స్వామీ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను." వ్యంగ్యంగా అన్నాడు గోపాలం.

సిద్ధాంతి ముఖం ఎర్రగా అయింది.

"కోపం వచ్చిందాండి?"

"కోపం ఎందుకూ?" కోపంగా అన్నాడు సిద్ధాంతి.

"ఒక్క సందేహం?"

సిద్ధాంతి పలకలేదు. ఉలకలేదు. గోపాలం వదలలేదు.

"ఆత్మ అంటే ఏమిటి? దానిని ఈ శరీరం తాలూకు ఆ ధివ్యాధులూ ఈతిబాధలూ బాధిస్తాయా"

"శరీరం, ఇంద్రియాలూ, మనసు, బుద్ధి వీటికి అతీతమైనదీ సత్-చిత్-ఆనంద్-స్వరూపమైనదీ మరొకటి ఉన్నది. అదే ఆత్మ. ఆత్మ నిత్య నిర్మలమైంది. సర్వ స్వతంత్రమైంది ఆత్మ స్వయం ఆనంద స్వరూపం. దానికి బాధ లేమిటి? ఆత్మ ఆ పరమాత్మ అంశమే! దానికి శరీరం తాలూకు ఎలాంటి కల్మషం అంటదు."

"కొంచెం ఆగండి స్వామీ! మీలోనూ నాలోనూ ఉన్న ఆత్మ ఒకటేనా?"

"అతురాలా! నీలోనూ, నాలోనూ, సమస్త జీవరాసుల్లోనూ ఉండే ఆత్మ ఒక్కటే. అంతా ఆ పరమాత్మ అంశం. యోగమాయ చేత కప్పబడ్డ ఆత్మ తన అసలు స్వరూపాన్ని విస్మరించి ఈ భౌతికసుఖాల కోసం ప్రాకులాడుతుంది."

అంటూ గోపాలం ముఖంలోకి ఇప్పుడైనా అర్థం అయిందా?" అన్నట్లు చూశాడు సిద్ధాంతి.

గోపాలం అదోలా నవ్వాడు.

"ఒకవైపు ఆత్మ ఆనందస్వరూపం, స్వయం స్వతంత్రమైంది అంటున్నారు. దానికి శరీరం తాలూకు ఈతిబాధలు అంటవంటున్నారు. మరోవైపు యోగమాయలకు వశం అవుతుందంటున్నారు. సాక్షాత్తూ పరమాత్మ అంశమైన ఆత్మను యోగమాయ కప్పివేయడం ఏమిటి? ఇంతకుముందు శవం ఎదురైనప్పుడు మృతుని ఆత్మకు శాంతి కలుగుగాక అని భగవంతుని ప్రార్థించారు. సత్- చిత్- ఆనంద స్వరూపం అయిన ఆత్మకు అశాంతి ఎలా కలుగుతుంది? శాంతి కలగాలని మళ్లీ ప్రార్థించడం ఏమిటి? పైగా చావు బ్రతుకులనేవి భౌతిక కాయానికి సంబంధించినది కదా? మరి " ఆగి సిద్ధాంతి ముఖంలోకి చూశాడు గోపాలం.

సిద్ధాంతి ముఖంలో చిరాకు కన్పించింది. గోపాలానికి అతనిమీద జాలి వేసింది.

"ఒకసారి నాన్నగారిని చూడటానికి రండి." అన్నాడు గోపాలం మాట మారుస్తూ

సిద్ధాంతి ముఖం విప్పారింది.

"అలాగేనోయ్! ఇప్పుడు ఎక్కడ కెళ్తున్నావ్?"

"నాకే తెలియదు" అన్నాడు గోపాలం.

"అయితే నాతో రా!" అన్నాడు సిద్ధాంతి.

"ఎక్కడికి?"

"ఇవ్వాళ ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో పదహారు సంవత్సరాల బాలుడు ఒంటిమీద పెట్రోలు పోసుకొని నిప్పంటించుకొని, మూడు వందల గజాల పైనుంచి కిందనున్న బావిలోకి దూకుతాడట. చూద్దాం! పద!"

గోపాలం ఆశ్చర్యంగా సిద్ధాంతి ముఖంలోకి చూశాడు. "మీకు ఇలాంటి కోరికలు కూడా ఉన్నయ్యా?"

"ఏదో సరదా!" గొల్లున నవ్వాడు సిద్ధాంతి.

"అవును! ఇతరులను అపాయంలో చూడటం చాలామందికి సర్దాగానే ఉంటుంది." గోపాలం తనకు తనే అనుకున్నట్టు చిన్నగా గొణిగాడు.

సిద్ధాంతి అర్థంకానట్టు చూశాడు.

"బాక్సింగ్, రెజిలింగ్, సర్కస్ ఫీట్స్, పులుల మధ్య కూర్చుని వాటిని రెచ్చగొట్టడం, మొదలైన దృశ్యాలను చూడటానికి జనం ఎందుకు సర్దాపడు తుంటారు?" -

"ఎందుకేమిటి? అదో వింత! ఇందులో ఇతరులు అపాయంలో ఉంటే సంతోషించే ప్రశ్న ఎక్కడుంది?"

"ఎవరైనా పిల్లితో, కుక్కతో ఆడతారంటే వెళ్తారా? పది గజాల ఎత్తు నుంచి ఎవడో దూకుతున్నాడంటే మీరు వెళ్తారా?"

"అందులో విశేషం ఏముంది?"

"అందులో అపాయం ఏముంది అనండి."

సిద్ధాంతి ఆలోచనలో పడ్డాడు.

"ఒకరకంగా ఇలాంటివి చూసి ఆనందించడంలో క్రూరత్వం ఉంది. మనిషి జంతువులనుంచి వచ్చాడనే దానికి ఇది నిదర్శనం మానవుడిలోని ప్రాథమిక అంటే పాశవిక ప్రవృత్తులకు సంతృప్తి కావాలి."

"అబ్బబ్బ! ఇక నీ ఉపన్యాసం మానెయ్! ఇంతకీ నువ్వు ఎగ్జిబిషన్ గ్రౌండ్సుకు వస్తావా రావా?"

"వస్తాను పదండి."

ఇద్దరూ ఎగ్జిబిషన్ గ్రౌండ్సుకు వచ్చేసరికి బాగా చీకటిపడింది. ఎగ్జిబిషన్ ఆవరణలో దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. జనం వస్తున్నారు. ఆడవాళ్ళు, పిల్లలూ మరీ ఎక్కువగా వుండడం గోపాలానికి మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఇలాంటి వాటికి పిల్లల్ని తీసుకురావడం ఎందుకు?" అనుకున్నాడు గోపాలం,

టికెట్టు కొనుక్కొని బావి దగ్గరకు వెళ్ళారు. అప్పటికే జనం చుట్టూ కూర్చుని ఉన్నారు. ఇప్పటినుంచే జనంలో కూర్చోవడం గోపాలానికి నచ్చ లేదు. అసలు గోపాలానికి ఆ వింత చూడాలని లేదు. ఆ కుర్రవాడిని చూడాలని ఉన్నది సిద్ధాంతి కళ్ళు ఎవరికోసమో వెతుకుతున్నట్లు అనిపించింది గోపాలానికి. ఇద్దరూ ముందుకు నడిచారు! ఒకచోట ఒక కుర్రవాడు ఖాకీ దుస్తుల్లో కన్పించాడు. అతని చుట్టూ ఓ పది పదిహేనుమంది యువకులు ఉన్నారు. ఇద్దరూ ఆ గుంపు దగ్గరకు వెళ్ళారు.

అంతలో ఓ గుబురుమీసాల వ్యక్తి అక్కడ చేరిన జనాన్ని మందలించి

దూరంగా పంపిచాడు. సిద్ధాంతిని చూడగానే అతని ముఖం విప్పారింది. చేతులు జోడించి నమస్కారించాడు,

"అయ్యావార్లూ రండి! రండి! పొద్దుట తమకోసం కబురు పంపించాను." అన్నాడు ఆ వ్యక్తి ఉత్సాహంగా.

"కబురు అందింది యాదగిరీ! ఉదయం రావడానికి తీరిక చిక్కలేదు. అందుకే ఇటొచ్చాను. నీ కొడుకు జాతకం రేపొచ్చి చూస్తాలే!"

"తమరు టికెట్ కొనడం ఏమిటి? నాకు కబురుచేస్తే"

"ఫర్వాలేదులే. ఈ కుర్రవాడు కొన్నాడు." అంటూ గోపాలాన్ని చూపించాడు

యాదగిరి వాళ్ళిద్దర్నీ బావికి పదడుగుల దూరంలో చుట్టూ మూయగట్టిన డేరాలోకి తీసుకువెళ్ళాడు. ఖాకీ దుస్తుల్లో ఇంతకుముందు కన్పించిన కుర్రవాడు అక్కడే ఉన్నాడు.

యాదగిరి గత పాతికేళ్ళుగా తిరునాళ్ళలోనూ, ఎగ్జిబిషన్స్‌లోనూ, మ్రేరీగో రౌండ్స్, లక్కీ డిప్పులూ, చటాక్కాయా-చిటాక్కాలూ కలిపి అనేక తమాషాలు చేయించి, జనానికి వినోదాన్ని అందించి బాగా డబ్బుసంపాయించాడు.

యాదగిరి కుర్రవాణ్ణి సిద్ధాంతికి పరిచయంచేశాడు.

ఆ కుర్రవాడు పచ్చగా ఉన్నాడు. బొద్దుగా ఉన్నాడు. ఆకర్షణీయంగా ఉన్నాడు. కళ్ళలో మెరుపు ఉంది. ముఖంలో పసితనం ఉంది. పసితనాన్ని పార దోలి యవ్వనం ఆ ముఖాన్ని ఆక్రమించే ప్రయత్నంలో ఉన్నట్టు నూనూగు మీసాలు చెబుతున్నాయి.

యాదగిరీ, సిద్ధాంతి "ఇప్పుడే వస్తాం" అంటూ బయటికి వెళ్ళారు.

గోపాలం కళ్ళు ఆ కుర్రవాడి ముఖంమీదనే ఉన్నాయ్. ఈ కుర్రవాడు చచ్చిపోతే! గోపాలం వెన్నెముకలోకి చలి కుదుపు వచ్చింది.

"నీ పేరేమిటి బాబూ!" అన్నాడు.

"నాగేష్" అన్నాడు. గొంతు చాలా బొంగురుగా ఉంది ఆ వయసుకు మగపిల్లల గొంతు అలాగే ఉంటుంది అనుకున్నాడు గోపాలం.

"ఎంత కాలంగా చేస్తున్నావ్?"

"ఇదే మొదటిసారండి!" ఉత్సాహంగా అన్నాడు.

తుళ్ళిపడ్డాడు గోపాలం.

"మొదటిసారా! భయం వెయ్యడంలేదూ?"

నాగేశ్ నవ్వాడు. ఆ నవ్వుతో అతని ముఖంలోకి కొత్త వెలుగు వచ్చింది. ఆ నవ్వులో ఆత్మవిశ్వాసం ఉన్నది.

"భయమా? ఎందుకూ?" విశ్వాన్ని జయించడానికి బయలుదేరిన సికిందర్ ఎవరైనా పై ప్రశ్న వేస్తే యిలాగే ఎదురుప్రశ్న వేసివుండేవాడేమో!

"ఈ విద్య నువ్వు ఎవరిదగ్గర నేర్చుకున్నావ్?"

"ఎవరి దగ్గరా నేర్చుకోలేదు మా కుటుంబవృత్తే ఇది." అన్నాడు నాగేశ్ నిర్లక్ష్యంగా.

"మీ నాన్నకూడా ఇదే పని చేశాడా?"

"అవును మా నాన్నే కాదు. మా నాన్న నాన్న, వాళ్ళ నాన్నకూడా ఇదే పనిచేశారు." ఉత్సాహంగా అన్నాడు

"మీ నాన్న ఉన్నాడా?"

"లేదండీ! చనిపోయాడు. పూనాలో ఈ ప్రదర్శన యిస్తూ చనిపోయాడు."

గోపాలం ఉలిక్కిపడ్డాడు! నాగేశ్ కళ్ళలోకి లోతుగా చూశాడు. ఆ కళ్ళలో కాంతిరేఖలు కదులుతూ కన్పించాయి.

"మీ తాత ఎలా చచ్చిపోయాడు?"

"మా తాత చాలాకాలం ఈ ఫీట్సు చేశాడు. చివరకు ఇది చేస్తూనే చచ్చిపోయాడు."

"మరి వాళ్ళ నాన్న?"

"మామూలు జబ్బుతోనే చచ్చిపోయాడట."

"ఇదంతా తెలిసే నువ్వీ సాహసం చేస్తున్నావా?"

నాగేశ్ నవ్వాడు. గలగల నవ్వాడు. పసిపాప నవ్వినట్టు నవ్వాడు. ఎవరో చక్కిలిగింతలు పెడ్తుంటే నవ్వినట్టు ఆగి ఆగి నవ్వాడు.

"బాబుగారూ! ఒకవేళ మీ తాతగారూ, వారి నాన్నగారూ ఆఫీసులో పని చేస్తూ చచ్చిపోయారనుకోండి. అందుకు మీ నాన్నగారు ఆఫీసులో పనిచెయ్యడానికి భయపడ్తారా? మీరు భయపడ్తారా? మీ నాన్న ఆఫీసులో చనిపోతే ఆఫీసులో పనిచెయ్యడానికి?"

గోపాలం ఆశ్చర్యంగా ఆ కుర్రవాడి మొఖంలోకి చూశాడు. అప్పుడే లోపలకు ప్రవేశించిన సిద్ధాంతి కుర్రవాడి చివరి మాటలు విన్నాడు.

"శబాష్ కుర్రాడా!" అన్నాడు వీపు తడుతూ.

గోపాలానికి సిద్ధాంతిమీద కోపం వచ్చింది.

"అదీ ఇదీ ఒకటి ఎలా అవుతుంది?" గోపాలం అన్నాడు.

"మీ నాన్న దగ్గర ఈ విద్యను ఎందుకు నేర్చుకోలేదు. నేర్చుకోకుండా పేటప్రాక్టీసు ఎలా చేస్తావ్?" మళ్ళీ గోపాలమే ప్రశ్నించాడు.

"మా నాన్నకు నేను ఈ వృత్తి చెయ్యడం ఇష్టంలేదు. నన్ను చూడనివ్వే వాడు కూడా కాదు. రెండు మూడుసార్లు నేనే ఆయన చూడకుండా జనంలో కూర్చుని చూశాను."

"మీ నాన్నకు నువ్వు ఏంచెయ్యాలని ఉండేది."

"బాగా చదువుకొని పెద్ద ఉద్యోగం చెయ్యాలని మా నాన్న కోరిక."

"ఎంతవరకు చదువుకున్నావురా కుర్రాడా." సిద్ధాంతి అడిగాడు.

మొన్ననే స్కూల్ ఫైనల్ పరీక్ష రాశాను."

నాగేశ్ జవాబుకు ఇద్దరూ విస్తుపోయారు

"ఇంత చదువుకొని ఇదేం పని? ఏదైనా ఉద్యోగంచూసుకోక?" గోపాలం అన్నాడు.

నాగేశ్ ఎంతో అనుభవజ్ఞుడిలా నవ్వాడు. ఆ నవ్వుల్లో పసివాడి అమాయకత్వం లేదు. చేదు అనుభవాలు మనుషుల వయసును పెంచుతాయి కాబోలు!

"బాబుగారూ ఇంకా మీకు పరిస్థితులు తెలిసినట్టులేదు. ఈ రోజుల్లో ఎంఏలూ బియ్యేలూ ఉద్యోగాలు దొరక్క తిరుగుతున్నారు."

"అందుకని ఎప్పటికీ ఇదే వృత్తి చేస్తావా?"

"లేదు. నేను ఇంకా చదువుతాను. ఐఏయస్ పాసవుతాను. కలెక్టర్ను అవుతాను." తనకు తనే చెప్పుకుంటున్నట్టు అంతర్ముఖుడై అన్నాడు. అలా అంటున్నప్పుడు ఆ కళ్ళు తళతళ్ళాడుతున్నాయి. ఆ వెలుగులో అతను తన భవిష్యత్తును స్పష్టంగా చూస్తున్నట్టు ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

గోపాలం కళ్ళలో నీరు తిరిగింది. నోట మాటరానివాడిలా ఆ పసిముఖంలోకి చూస్తున్నాడు.

"నువ్వు తప్పక గొప్పవాడివి అవుతావురా కుర్రోడా." సిద్ధాంతి అన్నాడు.

"సిద్ధాంతిగారూ నాగేశ్ చెయ్యిచూడండి." అన్నాడు గోపాలం.

సిద్ధాంతి గోపాలం ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"ఇవన్నీ నేను నమ్మను. కాని ఎందుకో ఇప్పుడు నమ్మాలనిపిస్తుంది. చూడండి," అన్నాడు గోపాలం

నాగేశ్ కుతూహలంగా కుడిచెయ్యి ముందుకు చాపాడు.

సిద్ధాంతి చెయ్యి అందుకుని పరీక్షగా చూశాడు. అరచెయ్యి నొక్కి చూశాడు. వేళ్ళు చూశాడు. రెండో చెయ్యి చూశాడు. మళ్ళీ కుడిచేతిని పరీక్షగా చూశాడు.

"ఆహా! అదృష్ట జాతకుడివిరా! నువ్వు పెద్ద డైరెక్టర్వు అవుతావు. అప్పుడు నాకు పంచెలచాపు పెట్టాలి సుమా!" నాగేశ్ ముఖంలో సిగ్గూ, ఆనందం, ఉత్సాహం ముప్పిరిగొన్నాయి.

"సిద్ధాంతిగారూ! నాగేశ్ ఎంతకాలం బ్రతుకుతాడో చెప్పండి" నాగేశ్ వినకుండా సిద్ధాంతి చెవులో నోరు పెట్టి ఆత్రంగా అడిగాడు గోపాలం.

"ఎనభై సంవత్సరాలకు ఢోకాలేదు" అన్నాడు పెద్దగానే సిద్ధాంతి.

"సరిగ్గా చూడండి."

"ఈ రేఖ చూడు కోడేరు వేసినట్టు ఎంత పొడవుగా వుందో! ఎక్కడా కట్ కాలేదు. అడ్డుగీత లేదు."

గోపాలం మనసులో ఏదో పీడిస్తున్నది. దానినుంచి విముక్తి పొందడానికి తన మనసునే మథ్యపెట్టుకుంటున్నాడు.

"ఇంకా చదువుతానన్నావు ఎలా చదువుతావు?" గోపాలం అడిగాడు.

"ఈ ప్రదర్శనలు ఇస్తాను. కాలేజీలు తెరిచేటప్పటికి బోలెడంత సంపాదిస్తాను. ఇప్పటికిప్పుడే ఐదు వందలు కలెక్షన్. నా వాటా వంద."

"మిగతాది?"

"సగం యాదగిరికి, కొంత ఖర్చులకు పోతుంది. ఈ సెలవల్లో సంపాదనతో మా అక్కకు పెళ్ళిచేస్తాను. నా చదువుకు ఎక్కువెక్కువ సెలవలు వచ్చినప్పుడల్లా ప్రదర్శనలు ఇస్తాను."

"ఈ విద్య నీకు ఎవరూ నేర్పలేదు. దీని మెళకువలు నీకు తెలియవు. వద్దు ఇలాంటి పని చెయ్యకు." గోపాలం బాధగా అన్నాడు.

"భయపడకండి బాబుగారూ! ఇదిగో చూడండి. ఈ ఆంజనేయస్వామి వారి బిళ్ళ. దీన్ని మా పూర్వుల దగ్గర్నుంచి ప్రదర్శనలు ఇచ్చేటప్పుడు వేసుకున్నారు." అంటూ గుండీలు తొలగించి షర్టు లోపలికి ఉన్న ఆంజనేయస్వామి బిళ్ళ-నల్లదారంలో గుచ్చి కట్టి తళతళ మెరుస్తున్న బిళ్ళను చూపించాడు. అరచేతి వెడల్పున ఉన్న ఆ రాగిబిళ్ళమీద సంజీవి పర్వతాన్ని అరచేతిలో ఎత్తుకొని ఎగురుతున్న ఆంజనేయస్వామి బొమ్మ స్పష్టంగా కన్పించింది. ఆ బిళ్ళను కళ్ళకద్దుకుని షర్టులోపలకు వేసుకొని గుండీలు పెట్టుకున్నాడు నాగేశ్. చాలా

ఉత్సాహంగా ఉన్నాడు. ఎన్ని నయాగరా జలపాతాలైతే అతని ఉత్సాహంతో సమానం అవుతాయి ?

"మీ నాన్న చచ్చిపోయిన రోజు ఇది వేసుకోలేదా ?"

"చచ్చిపోయాడు. ఆ రోజు ఉదయమే మా అమ్మ ఈ బిళ్లను చింత పండులో రుద్ది, కడిగి, తుడిచి, గూట్లో పెట్టి పూజచేసింది. మీ నాన్న మర్చి పోయి వెళ్ళిపోయాడు "

"అదీ అట్లా చెప్పు !" అన్నాడు సిద్ధాంతి.

"మీ నాన్న మామూలు బట్టలు వేసుకొని ఉండడు. మీ అమ్మగార్ని అడక్కపోయావా ?"

"బాబోయ్! మా అమ్మకు తెలిస్తే ఇంకేమైనా ఉందా ? బావిలోకి దూకి చచ్చిపోతానంటుంది." అన్నాడు నాగేశ్ తేలిగ్గా నవ్వేస్తూ.

గోపాలంకి ఆ కుర్రవాడి రెక్కపట్టుకొని ఈడ్చుకొని వెళ్ళిపోవాలని ఉంది.

"చూడు నాగేశ్ ! ఇవ్వాల్టి కిది మానెయ్ !" గోపాలం అన్నాడు-రేపు మీ అమ్మతో మాట్లాడదాం.

"అదెలా బాబూగారూ డబ్బు కలెక్షన్ అయిపోయిందిగా ?"

"దానికేముంది? ఎవరి డబ్బు వాళ్ళకిచ్చేస్తే సరి !"

"అలా చేస్తే జనం యాదగిరిని ప్రాణాలతో వదుల్తారా ? అది వాళ్ల వంశంలో ఆనవాయితీగా వస్తున్న విద్య. పైగా ఆంజనేయస్వామి వాడి గుండెమీద దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు. చేతిలో జర్రిపోతులా జీవిత రేఖ ! భయమెందుకయ్యా !" అన్నాడు సిద్ధాంతి.

గోపాలంకి సిద్ధాంతిని వంగతీసి బాదాలనిపించింది.

నాగేశ్ కళ్ళలో కాంతిరేఖలు కదిలిపోతున్నాయ్

శరీరంలోని ప్రతి అణువులో జీవితం నిండుగా ప్రవహిస్తుంది గోపాలం ఆ కుర్రవాణ్ణి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

దూరంగా జనంలో అల్లరి. ఈలలు. నాగేశ్ టెంటులో నుంచి తొంగి చూశాడు.

మైక్‌లోనుంచి కంట్రాక్టరు యాదగిరి కంఠం బిగ్గరగా వినిపిస్తోంది.

"త్వరపడండి."

"సమయం మించిపోకుండా త్వరపడండి."

"ఐదు నిముషాలలో అతిలోక భయంకర ఫీట్ జరుగబోతున్నది.

ప్రవేశం ఒక్క పావలా మాత్రమే!

ఇరవై అయిదు నయాపైసలు!

త్వరపడండి.

నాగేశ్ అవి వింటున్నాడు.

సిద్ధాంతి వళ్లు పులకించింది.

గోపాలం వళ్లు జలదరించింది.

మళ్లీ మైక్‌లో స్వరం.

"ప్రపంచంలో కనీ వినీ ఎరుగని వింత!

ముక్కుపచ్చలారని పదహారు ఏళ్ల బాలుడు! సాక్షాత్తు అభిమన్యుడు!

ఐదు వందల గజాల ఎత్తునుంచి అగ్నిగోళంగా మారి, సరాసరి మృత్యు గహ్వరంలోకి ఎలా దూకుతాడో కనులారా చూడండి.

ఒక్క పావలా మాత్రమే!

వెల్ ఆఫ్ డెత్!

ఒక కప్పు టీ ధరకు

వెల్ ఆఫ్ డెత్!

రెండు రబ్బరు బెలూన్ల వెల?

ఇరవైదు నయాపైసలు మాత్రమే!

త్వరపడండి!

షో బిగిన్ కాబోతోంది!

వెల్ ఆఫ్ డెత్!

పదహారేళ్ల అభిమన్యుడు."

యాదగిరి కంఠం కంచుగంటలా మ్రోగుతుంది.

"వెల్ ఆఫ్ డెత్! అభిమన్యుడు వ్యూహం పద్మ వ్యూహం గోపాలం చెవుల్లో గింగురుమంటున్నది యాదగిరి కంఠం.

మెదడులో ఏదో కదిలినట్లు అయింది.

గుండెల్లో తుమ్మముల్లు కసుక్కున దిగినట్టు అయింది.

గోపాలం బయటికి వెళ్తూనే నాగేశ్ చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"బాబుగారూ! భయపడకండి. టైం అయిపోయింది." నాగేశ్ గోపాలం ముఖంలోకి చూస్తూ అంటున్నాడు.

"పోనీయవయ్యా అంతా ఆంజనేయస్వామే చూసుకుంటాడు " సిద్ధాంతి.

"మళ్ళీ అర్ధగంటలో వచ్చి మీకు కన్పిస్తాను. నమస్కారం బాబూగారూ! అంటూ గోపాలం చెయ్యినుంచి తన చేతిని విడిపించుకొని చరచర బయటికి వెళ్ళిపోయాడు.

దూరంగా బావిదగ్గర నిచ్చెన ముందు నిలబడ్డ నాగేశ్‌ను తదేక దృష్టితో చూస్తున్న గోపాలాన్ని భుజం తట్టి "రావోయ్ గోపాలం" అన్నాడు సిద్ధాంతి.

"నేను రాను. మీరు వెళ్ళండి."

సిద్ధాంతి గోపాలం ముఖంలో పెర్రివాణ్ణి చూసినట్టు చూసి ముందుకు కదిలాడు."

మరో రెండు నిముషాలకు నిచ్చెన మెట్లలా కట్టిఉన్న ఇనపమెట్లను గబగబా ఎక్కిపోతున్నాడు నాగేశ్. వేలకొద్దీ కళ్ళు ఆ కుర్రవాడితోపాటు పైకి ఒకొక్కక్కమెట్టే ఎక్కుతున్నాయి. అందరూ గాలి పీల్చుకోవడం కూడా మర్చిపోయినట్టు చూస్తున్నారు.

గోపాలం మెడ విరుచుకుని పైకి చూసాడు.

చుక్కల్లో చందమామలా నాగేశ్— విశాలమైన ఆకాశంలో తెల్లని నల్లని మబ్బులు కింద ఇనపచట్రంలో నిలబడి ఉన్నాడు.

పదహారేళ్ళ నాగేశ్ ఐదేళ్ళ పిల్లవాడికంటే చిన్నగా కన్పిస్తున్నాడు.

బావిచుట్టూ జనం ఇసుకపోస్తే రాలకుండా ఉన్నారు. మోరలు పైకెత్తి కన్నార్పకుండా చూస్తున్నారు. ఆరునెలల గర్భిణీస్త్రీ ఏణ్ణర్ధం పిల్లాడ్ని చంక నేసుకొని గుండెలు చిక్కబట్టుకొని పైకి చూస్తోంది. నాగేశ్ జేబులో నుంచి సీసా తీశాడు.

"పెట్రోల్! పెట్రోల్!" జనంలోనుంచి కేకలు.

సీసా బిరడాతీసి వంటిమీద వలకబోసుకున్నాడు.

సీసాను కింద బావిలోకి విసిరాడు.

రెండో జేబులోనుంచి అగ్గిపెట్టె తీసి అందరికీ చూపిస్తున్నాడు. అగ్గిపెట్టె కన్పించకపోయినా అతను చూపిస్తున్న దేమిటో జనానికి అర్థం అయింది.

సిద్ధాంతికి చిరుచెమటలు పట్టి చంకలోని పంచాగం, రొంటినున్న ఐదు రూపాయల నోటూ చెమ్మగిల్లాయి. ఆ సమయంలో ఓ చిటికెడు ముక్కు పొడుం పట్టిస్తే బాగుండు ననిపించింది కాని ఆ లోపల ఆ దృశ్యం కాస్తా జరిగిపోతే?

"చూడండి జనులారా. మృత్యువుతో పోరాటం. వెల్ ఆఫ్ డెత్" తార స్థాయిలో ఉన్న యాదగిరి కంఠం అకస్మాత్తుగా ఆగిపోయింది.

వెంటనే పెద్దగా గంట మోగింది.

ఒకటి . రెండు మూ :

పేదవాడి ఆకలిలా అగ్నిదేవుడు భగ్గుమన్నాడు.

వాలుకలు చాచిన అగ్నిజ్వాలతో పాటు ఓ ఆర్తనాదం వినిపించింది.

ఆ మండుతున్న ఆకారం క్షణాలలో గిర్రున తిరుగుతూ వచ్చిపడింది. వెల్- ఆఫ్- డెత్ అదే బావిలో పడలేదు. బావి దగ్గర్లో నిల్చుని పైకి చూస్తున్న వాళ్ళమీదనే పడింది.

జనం కకావికలై పరుగెత్తసాగారు.

కొందరికి బట్టలు అంటుకున్నాయి.

పిల్లా- జల్లా, ఆడా- మగా, విచక్షణ లేకుండా విరగదొక్కుకుంటు న్నారు.

క్రిందపడ్డవాళ్ళ మీదగా నడిచి ప్రాణాలు రక్షించుకోవడమే ఆ భీభత్సంలో పరమధర్మంగా పాటించబడింది.

గోపాలం గుండె బద్దలైంది.

మస్తిష్కంలో అగ్నిగోళాలు లేచాయి.

కళ్ళలో అంధకారం సుళ్ళు తిరగసాగింది. ఏవేవో రూపాలు అల్లిబిల్లి తిరిగాయి.

సిద్ధాంతి వచ్చి రెక్కపట్టుకొని లేపేంతవరకూ గోపాలం ఈ లోకంలో లేడు, స్పృహవచ్చిన గోపాలం లేచి మట్టి దులుపుకొని సిద్ధాంతి భుజం ఆసరాగా బయటకు నడిచాడు.

కొద్దినిముషాల క్రితం- ఆనందంతో, ఉద్రేకంలో పరవళ్ళు తొక్కుతూ కేరింతలు కొడ్తోన్న ప్రదర్శనలో వాతావరణం భీభత్సంగా మారింది. ఆర్తనాదాలతో మారుమోగింది.

సిమెంటు రోడ్డుమీద నడుస్తోన్న గోపాలం, ఇసకలో కూరుకుపోతు న్నట్టు అడుగులో అడుగు వేస్తున్నాడు. పక్కనే సిద్ధాంతి పాదాలు భూమిని భారీగా తాకుతున్నాయి. ఇద్దరి మధ్య మౌనం హిమాలయ పర్వతంలా నిల్చింది. గోపాలం మనసు వేడిగా- ఉదకం ఘనీభవించే స్థితిలో ఉన్నది. సిద్ధాంతి మనసు

వేడిగా- మంచుకరిగే స్థితిలో ఉన్నది. నడుస్తూ నడుస్తూ గోపాలం ఆకస్మాత్తుగా ఆగిపోయాడు.

దేవాలయంలో నుంచి గంటలు వినిపిస్తున్నాయి! అది ఆంజనేయస్వామి వారి గుడి. శనివారం కావడం వల్ల గుళ్లో హడావిడిగా ఉంది. గర్భగుడిలోంచి ఆంజనేయస్వామివారి దండకం స్పష్టంగా వినిపిస్తోంది. గోపాలానికి ఏమీ కనిపించడం లేదు. అంతా చీకటి. లోపల చీకటి బయట చీకటి! చీకటి! చీకటి! వెలుగునుంచి చీకట్లోకి పడిపోయాడు.

చేతులు జోడించి మంత్రముగ్ధుడిలా గోపాలం దేవాలయ ప్రాంగణం దాటి లోపలకు నడుస్తున్నాడు.

సిద్ధాంతి చూస్తూ నిల్చున్నాడు. గోపాలాన్ని .అనుసరించడానికి అడుగు ఎత్తబోయాడు. విద్యుత్ తగిలినట్టు అడుగు వెనక్కి వేశాడు.

సిద్ధాంతికి మళ్ళీ కాళ్లకింద ఏదో చల్లగా తగిలి 'కిచ్' మన్నట్టు అనిపించింది.

అది పసిబిడ్డ పొంగొంతుకో, లేక చూలాలి విందు గర్భమో !

సిద్ధాంతి తల విదిలించుకున్నాడు

చంకలోని పంచాంగం చేతిలోకి తీసుకొని చూసాడు.

కళ్ళు జ్యోతుల్లా మండుతున్నాయి.

మనసును చుట్టిఉన్న చీకటి పటాపంచలైనట్టు అనిపించింది.

చేతిలోని పంచాంగం ఆంజనేయస్వామివారి గుడి గోడనక్కగా దొర్లుతున్న కుక్కమీదకు విసిరాడు.

రొంటినున్న ఐదు రూపాయల కాగితం తీసి గుడి గోడకు ఆనుకుని కూర్చుని ఉన్న కళ్ళులేని కబోది గిన్నెలోకి విసిరాడు. రెండుసార్లు తల పంకించి, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, ముందుకు, ఆంజనేయస్వామివారి గుడిదాటి వెళ్ళిపోయాడు.





# మన్నించండి మాస్టారూ!

ప్రఫుల్లచంద్ర

"ముహూర్తం చూసుకునే వచ్చారా పంతులుగారూ!"

డ్రాయింగ్ రూంలో శ్రీవారి స్వరం హేళనగా వినిపించగా— వచ్చింది ఎవరా— అని కర్టెన్ కొద్దిగా తొలగించి చూసింది, ప్రక్కగదిలోని సౌమ్య.

సోఫాలో ఒక ముసలాయన. పసిమి నిమ్మ వర్ణం. కళ్ళలో దివ్య తేజస్సు. గంధపు బొట్టు. నిగనిగల గుండు. గోపాదమంత శిఖకూడా వున్నట్లుంది. చూపరులలో గౌరవాన్ని ప్రేరేపించే ఏదో విలక్షణ ఆకర్షణ.

ఆయన ప్రక్కనే కూర్చున్నది కొడుకు కాబోలు. ఇద్దరికీ ఎంత తేడా! తండ్రి శాంత సరళ స్వభావుడు. కొడుకు కొరకొరల యాంగ్రీ యంగ్‌మేన్.

ముసలాయన గోడు వెళ్ళబోసుకుంటున్నాడు. రిటైర్ అయ్యాడట. కొడుకు ఎమ్.కామ్. ఫస్ట్‌క్లాస్ ఉద్యోగం దొరకలేదు. ఇద్దరాడపిల్లలు పెళ్ళికి సిద్ధంగా వున్నారు. స్వయంఉపాధి పథకం క్రింద కొడుకు బ్యాంక్ లోన్‌కి అప్లయిచేసాడట.

"నీవు లోను శాంక్షన్ చేస్తే మావాడు కిళ్ళీబంకు, మొబైల్ లాండ్రీ లాంటి దేదైనా నిర్వహించడానికి సిద్ధంగా వున్నాడు నాయనా!"

అంత దీనంగా అడగవలసి వచ్చి

నందుకు కాబోలు ఆయన స్వరం రుద్ధం అయింది లోకంలోని నైరాశ్యం అంతా ఆ స్వరంలోనే దోబూచులాడుతోంది. కొడుకు తలవంచుకున్నా, జేవురించిన ముఖం, ఉబ్బిన ముక్కుపుటాలు– అతని ఆవేశాన్ని తెలుపుతున్నాయి. ఛీ! యింత బ్రతుకూ బ్రతికి యిలాంటి నికృష్ట ఉపాధిలు చేయడం అతనికి మతరామూ యిష్టం లేనట్టుంది. మరి దేశంలోని నిరుద్యోగ సమస్య అలాంటిది.

సౌమ్యకు ఆ వృద్ధమూర్తి మీద అంతులేని జాలి కలిగింది. కర్టెన్ మూసేసి సంభాషణ వింటోంది.

ఎకసెక్కంగా నవ్వారు శ్రీవారు. "తమరు, సద్బ్రాహ్మణ సంజాతులు మొబైల్ లాండ్రీ– కుల వృత్తి కాదే!"

ఆ హేళన– ముసలాయన హృదయంలో శూలంలా దిగబడి పోతుంది. శ్రీవారెందు కంత అసహ్యంగా మాట్లాడుతున్నారో అర్థం కాలేదు సౌమ్యకు.

అయితే అతనికొక సరదా వుంది. ఎవరేది అడిగినా ముందు నిరాకరించటం, కాసేపు ఏడిపించి, తరువాత సరేననడం– ముందు కవ్వించి, కష్టాలు అనుభవించనిచ్చి, తరువాత తీరికగా వరాలిచ్చే దేవునిలా!

కాని అతని ఈ సరదా ఆశ్రితుల పట్లనే గాని ఆఫీసు వ్యవహారంలో కాదు. బ్యాంక్‌లో అతడు నిజాయితీపరుడైన స్ట్రిక్ట్ ఆఫీసర్.

ముసలాయన బ్రతిమాలుతున్న కొద్దీ, శ్రీవారి స్వరంలో హేళన ఎక్కువ అవుతున్నది. అతని కది సరదా. కవ్వింపులా వుండవచ్చు గాని ముసలాయన కొడుక్కి మాత్రం గాయంమీద కారం రాసినట్లుంది. పైగా యిచ్చే లోన్‌లో యిరవై శాతం లంచం కోరడం– ముష్టిలో ముష్టిగా అనిపించి కసిగా చూసాడు.

అప్పుడే స్నేహితు దెవరో వస్తే బ్యాంక్ మానేజర్ బయటకు వెళ్ళగా లభించిన ఏకాంతంలో – కోపం అంతా కక్కేసాడు యువకుడు.

"చూసావా నాన్నా? ఈయన నేదో తప్పి తలకెత్తుతాడని నీవు ఆశించావు గాని నాకు మొదట్నించీ నమ్మకం లేదు. ఈ జాతే అంత! వీళ్ళు ప్రభుత్వానికి దత్తపుత్రులు! ఉద్యోగాలు వీళ్ళకే. ప్రమోషన్లు వీళ్ళకే. అప్పులు, భూములు, యిళ్ళు– అన్నీ వీళ్ళకే. మనకు మిగిలింది పట్టెడు బూడిద, భుజం మీంచి అడ్డంగా ఒక దారం– ఉరిపోసుకోడానికి!"

తగ్గు స్వరంలో అనడానికి ప్రయత్నిస్తున్న కొద్దీ యువకునిలో ఆవేశం తన్నుకువస్తోంది. స్వరంలో కసి బుసలు కొడుతోంది. కళ్ళలో క్రోధం

మెరుస్తోంది. గుండెలో నిస్పృహాయత మూల్గుతోంది.

భర్తనూ, ఆయన కులాన్నీ ఆ యువకుడు నిరసిస్తోంటే ప్రక్క గది లోని సౌమ్య హృదయం కలుక్కు మంది.

ముసలాయన ముఖం గంభీరంగా మారింది. ఆలోచిస్తూ తల వంచు కున్నాడు.

"ఏమి టాలోచిస్తున్నారు?"

"నలభై ఏళ్ళ క్రితం - వేసవి సెల వుల్లో మా తాతగారి గ్రామం వెళ్ళాను. ఆయనొక పెద్ద భూస్వామి. ఆ రోజున ఆయన సేవకులు కొందరు ఒక యువ కుడిని కొరడాలతో కొడుతున్నారు. కాళ్ళతో తన్నుతున్నారు. పిడికిళ్ళతో గుద్దుతున్నారు. ఆ యువకుడు బాధతో విలవిలలాడిపోతున్నాడు ఉండ గడు చుట్టుకుపోతున్నాడు. వంటిమీద తట్లు తేలుతున్నాయి. నల్లని శరీరంమీద ఎర్రగా రక్తం తొంగిచూస్తోంది. అయినా విచిత్రం ఏమంటే - ఆ యువ కుడు ఏడ్వటంలేదు. ఎవరినీ ప్రతిమాలం లేదు. కాళ్ళా, వేళ్ళా పడలేదు.

ఇంతకూ అతడు చేసిన నేరం ఏమిటి? మా తాతగారి పొలంలోని నూతి నీళ్ళు చేదుకుని తాగడం!

దెబ్బలు తిని, తిని, స్పృహ కోల్పోయే ముందు, గభాలున లేచి, శక్తినంతా కూడదీసుకుని మా తాతగారి వద్దకు మెరుపులా లంఘించి వచ్చి దళి తుని నేలకొరిగాడు ఒరిగిపోతూనే చటుక్కున తలఎత్తి చుట్టూ చూసాడు. ఆ చూపులో శాపం ఉంది. ఉక్రోషం వుంది నిస్పృహాయత వుంది. తీవ్రత వుంది...." అని కాసేపు ఆగి "ఆ తీవ్రతతో పోల్చితే నీ తీవ్రత ఎంత అని ఆలోచిస్తున్నా బాబూ! అతడు పొందిన అవమానంలో నీ అవమానం ఏమాత్రం! అతని ఆక్రందనలో నీ ఆక్రందన శాతం ఎంత? ఆలోచిస్తున్నా బాబూ!" శాంతంగా అని సోఫాలో చారబడి కళ్ళు మూసుకున్నా డాయన. ఇంకేమి అనలేదు. ఆయన ముఖంలో విషాదం అలముకుంది.

తండ్రివైపు కొరకొర చూసాడు కొడుకు. ఆ చూపు గుచ్చి, గుచ్చి అడు గుతున్న దొకే ప్రశ్న: ఎప్పుడో, ఎవరో తాతముతాతలు చేసిన తప్పుకు మేం శిక్ష అనుభవించాలా?

విశ్వద్దిం.... విచిత్ర విశ్వద్దిం....

ఆ నిశ్శబ్దాన్ని భరించలేక సౌమ్య కిచెన్‌లోకి వెళ్ళింది. అమెలో ఆలోచ నలు ముసురుకుంటున్నాయి.

శ్రీవారు మారిపోయారా? విశాల హృదయుడు, కులమతాలకు అతీతుడు - అని నమ్మి అతనిని ప్రేమించి, కులాంతర వివాహం చేసుకున్నందుకు - తనూ అందరిలాంటివాడనే నిరూపించ బోతున్నారా! ఆ ముసలాయన కులాన్ని

ఆయన అలా హేళన చేయడం క్షంతవ్యమా?

• • •

ఖావి భారత పౌరులను తయారు చేసే ఒక పాఠశాల

ఆ పాఠశాల ఉపాధ్యాయులలో రెండు వర్గాలు ఒక దానికి ద్వైపాదీనం మాష్టారు, మరోదానికి లక్ష్మణాచార్యులు నాయకులు. వారికి న్యాయాన్యాయాలతో పని లేదు. ఒకవర్గం అవునన్న దాన్ని రెండోవర్గం వ్యతిరేకించడమే.

రెండు వర్గాలలోనూ- కులం కాటు వేయని విశాలహృదయులు, అందరి మన్నన పొందినవారూ- జ్ఞానానందం, జానకిరామయ్య లాంటివారు లేకపోలేదు. కాని వారికి బోధన తప్ప యితర విష యాలు పట్టవు. బోధన తప్ప మిగిలిన అన్ని విషయల్లోనూ తల మున్కలయే ఉపాధ్యాయులను గాని, వారి ప్రేరణతో రెండు వర్గాలుగా చీలిపోయి కిష్కిందా కాండ జరిపే పిల్లకోతులను గానీ- ఈ జ్ఞానానందాలు జానకిరామయ్యలూ మార్చలేరు.

ఆ రోజు పాఠశాలలో వాతావరణం చాల ఉద్రిక్తంగా వుంది పరీక్షల్లో ఒక విద్యార్థి కాపీ చేస్తుండగా జానకి రామయ్య పట్టుకున్నాడు. విద్యార్థి హరిజన్: జానకిరామయ్య బ్రాహ్మణుడు కావడంతో ప్రారంభం అయింది అసలు రగడ..

ఆ సాయంకాలం ఊరి చివర కాలు వలో స్నానంచేసి జానకిరామయ్య వస్తుండగా దారిలో అల్లరిగుంపు ఎదు రైంది. నానా రభస చేసి రాళ్ళు విసిరారు. గుంపులోని వర్షప్రసాద్ విసరిన రాయి అయన నుదుట బలంగా తగిలింది. శివుడు మూడోకన్ను తెరచినట్లు రక్తం ఉబ్బుమంది.

రక్తం కంటబడేసరికి అందరూ నిశ్చలంగా ఆగిపోయారు. ప్రసాద్ వణికిపోయాడు. అతడు తొమ్మిదో క్లాసు విద్యార్థి. మిగిలినవారు పాఠశాల విద్యా ర్థులు కారు. తమాషా చూడడానికి గుంపుతో వచ్చి, వాళ్ళతోబాటు తమా షాగా రాయి విసరితే- కర్మ కాలి- ఆ రాయే తగిలింది. మాష్టారు చూడనే చూసారు .

జానకిరామయ్య- చుట్టూ నిశ్చలంగా ఒకసారి పరికించి, కారుతున్న రక్తాన్ని తుడుచుకోనైనా తుడుచుకోకుండా ధీర గంభీరంగా ముందడుగు వేశాడు.

ఇంటికి వెళ్ళాక ఆ రాత్రి ప్రసాద్‌కి నిద్రపట్టలేదు ఆలోచనలు.. ఆలో చనలు

జానకిరామయ్యగారు మంచి మాస్టారు. ఆయన చెప్పే పాఠాలు గంటలతరబడి వినాలనిపిస్తుంది. భారత, రామాయణ గాథల్లో తనకు అనేక సందేహాలు వచ్చేవి.

చెట్టు వెనకనుండి రాముడు వాలిని




చంపడం అన్యాయం కాదూ? రాక్షసులకు కొమ్ములూ, కోరలూ ఉన్నాయా? ఆ రోజుల్లో సంఘజీవనం ఎలా ఉండేది?

ఇలాంటి ప్రశ్నలు క్లాసులో అడిగితే అందరూ నవ్వుతారు. అందువల్ల మాస్టార్ల యింటివద్ద ఆడగాలి కాని చాలమంది తనను యింటికి రానివ్వరు. కాని జానకిరామయ్యగారు మాత్రం అరుగు మీద చాపవేసి కూర్చోబెట్టి ఆప్యాయంగా సందేహాలు తీర్చుతారు. ఆయన స్వరంలో మాటలు ఎంత పొందికగా వినిపిస్తాయి! అవే మాటలు యితరుల నోటనుండి వస్తే గాలికబుర్లలా వినిపిస్తాయి!

చిన్నప్పటి నుండి తన కెందుకనో, పార్వతీదేవి అంటే భక్తి. మాస్టారు భార్యను చూస్తే ఆ పార్వతీదేవి ప్రత్యక్షమైనట్లు మనసు హాయిగా వుంటుంది! తనకు దాహంవేస్తే ఆమె గ్లాసులోనే మంచినీళ్ళు యిచ్చేది. ఇతరులైతే తన దోసిలిలో మంచినీళ్ళు పోస్తారు!

మరి మాస్టారుమీద తనెందుకు రాయి విసరినట్లు ?

మనసు విలవిలలాడిపోయి, కళ్ళు జలజల వర్షించాయి.. ఇందంతా దైవాధీనం మాస్టారివల్ల నే జరిగింది. ఆయన యింటికి చాలమంది విద్యార్థులూ, యితరులూ వస్తూవుంటారు తరతరాలుగా అగ్రవర్ణులు తమ కులాన్ని ఎలాగ అణగదొక్కి ఉంచారో- ఆయన వివరిస్తూ వుంటాడు, వింటున్నంతసేపు ఆవేశం కలుగుతుంది. వీలైనప్పుడల్లా అగ్ర కులస్తుల మీద ప్రతీకారం తీర్చుకోవాలనిపిస్తుంది.

ఇలాగే లక్ష్మణాచార్యుల వారింటిలోనూ విద్యార్థులూ చేరుతూవుంటారు. ఎవరిమీదనో కారాలూ, మిరియాలూ నూరుతూ వుంటారు.

వారిని చూస్తే వీరికి, వీరిని చూస్తే వారికీ- అసూయ, ద్వేషం! అలా ద్వేషం అనే సైతాన్ తన మనసులో ప్రవేశించాడు మనిషిని పెంచాలి ప్రేమించాలి. గౌరవించాలి కాని ఆ సైతాన్ తన కళ్ళు కప్పివేసి మంచిని కనిపించకుండా చేసాడు. అందుకే అందుకే తను రాయి విసిరాడు.

జానకిరామయ్య మాస్టారికి క్షమాపణ చెప్పుకోవాలని నిర్ణయించుకున్న తర్వాతనే ప్రసాద్ హృదయం చల్లబడి విద్రపట్టింది- ఆ రాత్రి.

కాని మర్నాడు స్కూలుకి వెళ్ళే దారి కిరువైపులా గోడలనిండా రాతలు జానకిరామయ్యను, ఆయన కులాన్నీ దూషిస్తూ, గుండు పింకీను అపహాస్యం పట్టిస్తూ

ప్రసాద్‌కి మరింత భయం వేసింది. తను రాయి విసరడం చూసిన మాస్టారు ఈ రాతలుకూడా తనవే అనుకోరు? ఈపాటికే ఆయన హెడ్మాష్టారికి ఫిర్యాదు చేసివుంటారు. తనకు శిక్ష తప్పదని భయపడుతూనే స్కూలుకి వచ్చాడు. స్టాఫ్‌రూంలోనికి తొంగి చూసాడు. అదొక రణరంగంలా వుంది.

"దోషులను శిక్షించే వరకు మనం పరీక్షల్ని బహిష్కరించాలి" లక్ష్మణాచారి ప్రతిపాదించాడు.

"సాటి మాస్టారికి అవమానం జరిగినందుకు నాకూ బాధగానే వుంది. కాని దోషుల్ని పట్టుకోడం నిమిషాల్లో జరిగే పనికాదు. మనం పరీక్షల్ని బహిష్కరిస్తే దోషులు కాని విద్యార్థులకే ఎక్కువ అన్యాయం జరుగుతుంది" అడ్డుతగిలాడు దైవాధీన.

కొట్టుకుంటారేమో అన్నంత తీక్రంగా వాగ్యుద్ధం చెలరేగింది తరువాత.

అయితే జానకిరామయ్య మాస్టారు తన పేరు బయటపెట్టలేదన్న మాట! సంతోషం బదులు మరింత దుఃఖం కలిగింది ప్రసాద్‌కు .రికొంచం వంగి లోనికి చూసాడు.

ఒక మూల జ్ఞానానందం మాస్టారూ,



నుదుట చేత్తో జానకిరామయ్య కూర్చుని ఉన్నారు. ఇద్దరి ముఖాలలోనూ విషాద మేఘాలు కమ్ముకుని ఉన్నాయి. కళ్ళు అరమూతలు పడిపోయాయి. పెదవులు కంపిస్తున్నాయి—మనసులోనే ప్రార్థించు కుంటున్నట్లు.

"ప్రభూ!... దేవా! కులవైష మ్యంతో రెచ్చిపోతున్న ఈ పిచ్చివాళ్ళ బారినుండి, మా పాఠశాలను, దేశాన్ని రక్షించు తండ్రీ!....

హెడ్మాస్టర్ ప్రతిపాదంగా ఉపాధ్యా యులు పరీక్షలు నిర్వహించడానికి అంగీకరించారు గాని విద్యార్థులు కాపీ చేస్తున్నా, చూసీచూడనట్లు వదిలేసారు. అందుకు కొందరు సంతోషించినా, కష్ట పడి పాఠాలు చదువుకున్న ప్రసాద్ లాంటి వాళ్ళు బాధపడ్డారు.

వేసవి సెలవుల తరువాత, వెంకోజీ లకు—జానకిరామయ్య మరో ఊరికి బదిలీ చేయించుకున్నాడు. పిల్లలంతా

ఎంతో బాధపడ్డారు. బదిలీ ఆపుచేయించ డానికి ప్రయత్నించారు కాని మనసు విరిగినచోట మనజాలనని వెళ్ళిపోయా డాయన. ఆయన వున్నంత కాలమూ క్షమాపణ చెప్పుకోడానికి ధైర్యమే చిక్కలేదు ప్రసాద్‌కి. కాని రాత్రి పడుకునేటప్పుడు మాత్రం గురువు గార్ని ధ్యానించి "క్షమించండి మాస్టారూ!" అని విలపించేవాడు.

ఆయన వెళ్ళిపోయాక స్కూల్ వాతావరణమే మారిపోయింది. నోటి శక్తి, భుజబలమూ గల విద్యార్థులు దైవా ధీనం అవారిల ప్రేరణతో క్లాసుల్లో అల్లరిచేయడం ప్రతి సమస్యనూ చిలికి చిలికి గాలివాన చేయడం, కసితో బసలు కొట్టడం

ఈ క్రోధాంధుల యుద్ధంలో అమా యకు లెందరో నలిగిపోయారు. అదృష్ట వశాత్తు ప్రసాద్ తండ్రికి బదిలీ కావ డంతో-కులం కాటువేయని యింకో స్కూలులో చేరి ప్రసాద్ బ్రతికి పోయాడు.

• • •

డ్రాయింగ్‌రూంలోనికి మూడు కప్పులతో ఓవల్టిన్ తెచ్చిన సౌమ్య-భర్త ఒంటరిగా దీర్ఘాలోచనలో ఉండడం చూసి ఆశ్చర్యపోయింది.

ముసలాయనా, కొడుకూ వెళ్ళిపోయి నట్లున్నారు...."లోన్ శాంక్షన్ చేస్తు న్నారా, లేదా?" సౌమ్య స్వరం సౌమ్యంగా మాత్రం లేదు.

"ఆయన-మామూలు-యివ్వవన్నారు మరి!"

"జాలి లేదా మీకు? ఆయన్ని. ఆయన్ని లంచం అడుగుతారా మీరు!"

"అడక్క పోడానికి ఆయన ప్రత్యే కత ఏమిటి?"

ఏమిటో సౌమ్యకు తెలియదు కాని-ఆ వృద్ధసౌజన్యమూర్తి ప్రాణం మీదకు వస్తేగాని ఇతరుల సాయం అర్థించని అభిజాత్యుడు చాల కష్టాల్లో వుండి వుంటాడు. కనుక తప్పక సాయం చేయ వలసిందే. అనిపించింది సౌమ్యకు.

"ఆ లంచం నే విస్తా. వాళ్ళబ్బాయికి లోన్ ఇప్పించండి లేదా నా నగలు అమ్మి అయినా సరే నే నాయన కిస్తా" కటువు గానే అంది సౌమ్య.

"నటన చాలించి గంభీరంగా మారిపో యాడతడు.

"జానకిరామయ్యగారి కుటుంబానికి సాయంచేయలేకపోతే మానవత్వం అనే మాటకే అర్థంలేదు. నా మనుగడే వ్యర్థం. ఇన్నేళ్ళ కాయన యిలా నా ముందు ప్రత్యక్షం కావడం నా కెంత సంతో షంగా వుందో తెలుసా? పదిహేనేళ్ళ క్రితం నాలో సైతాన్ ప్రవేశించాడు. నాది తెలిసీ తెలియని వయస్సు. మాస్టార్ల లోనూ స్వార్థపరులుంటారని తెలియదు. స్వార్థం కోసం వాళ్ళ వైషమ్యాలు

రేపడానికి కూడా వెనుదీయనని తెలియదు. అలాంటి స్వార్థపరుల బోధన వల్ల నా కళ్ళకు పొరలు కమ్మాయి. హృదయానికి యినుపతెరలు పడ్డాయి. నేను భయంకర అగాధంలో కూలిపోయేలోగా మాస్టారి క్షమాగుణం నా కంటి పొరల్ని తొలగించివేసింది. ఇనుప తెరల్ని కరిగించివేసింది. నే నప్పుడు ఆయనకు క్షమాపణ చెప్పలేకపోయాను ధైర్యం చాలక కాని యిప్పుడు నేనొక మనిషిగా మారాను. క్షమాపణ చెప్పుకునే అర్హతను, ధైర్యాన్ని సంపాదించుకున్నా.

మాస్టారు నన్ను గుర్తించనేలేదు. ఈ పదిహేనేళ్ళలో ఆయన కొంచమైనా మారివుంటారా- అని పరీక్షించడానికే అలా నటించాను. నా పిచ్చిగాని, ఆయనకు పరీక్ష పెట్టడానికి నేనెంతటి వాడను! ఆయన కొంచెం కూడా మారలేదు. ఎంత కవ్వించినా ఆయనకు కోపం రాదు. కోపం బదులుగా ఆయన స్వరంలో జాలి కురుస్తుంది. ఖేదం పలుకుతుంది. సమాజం నిండా వికటాట్టహాసం చేస్తున్న అవినీతి పిశాచాల మధ్య ప్రభావితం కాకుండా దృఢంగా నిశ్చలంగా వెలుగుతున్న న్యాయజ్యోతి ఆయన. ఆ జ్యోతి ఆరిపోకుండా కాపాడుకోవలసిన బాధ్యత నాకుంది.

అడగగానే సాయంచేస్తే లభించే ఆనందం క్షణికమే. అందుకే కరకుగా నటించాను. నిజానికి కొద్దికాలంగా మా తమ్ముడి చేత ఒక లఘు పరిశ్రమ ప్రారంభింపజేయాలని ప్రయత్నిస్తున్నా. నమ్మకస్తుడైన ఒక భాగస్తుని కోసం వెదుకుతున్నా. ఇప్పుడే మాస్టారి యింటికి వెళ్తా. ఆయన పాదాల మీద పడతా పదిహేనేళ్ళ క్రితం అడగలేక పోయా- ఇప్పుడు అడుగుతాను- మన్నించండి, మాస్టారూ!-అని. కన్నీటితో ఆ దివ్యచరణాలు కడుగుతాను. మాస్టారి అబ్బాయిని మా తమ్ముడి పరిశ్రమలో మానేజింగ్ పార్ట్‌నర్‌గా తీసుకుంటా" తన్మయంగా చెప్పుకుపోతున్న భర్తను యింతలేసి కళ్ళనిండా సంతృప్తి నింపుకుని చూస్తూ "మీరు నిజంగా వరం ప్రసాదించే దేవుడు!" అనుకుంది సౌమ్య.






(గత సంచిక తరువాయి)

## 35

తలలు రెండూ యున్నాడని సెప్పినానా!

కేసెట్టక తప్పదన్నారు కూలోళ్లు.

కేసు పోక తప్పదన్నాడు సిట్టిబాబు.

"ఇప్పుడు తోకమీద నిలబడినోళ్లే, రేపు తోక ముడిచేస్తారు. ఇప్పుడు కళ్ళారా జూసినోళ్ళే, కోర్టులో మాం అక్కడ నేఁవంటారు. కాకపోతే రాఁవుఁడుగోడు కొబ్బరి సెట్టెక్కి వరదాకి గెంతిసినాడంటారు. మల్లమ్మ మదం ఎక్కువై కోకిప్పుకుని గెంతినాదంటారు.



నుదుట కట్టుతో జానకిరామయ్య కూర్చుని వున్నారు. ఇద్దరి ముఖాలలోనూ విషాద మేఘాలు కమ్ముకుని వున్నాయి. కళ్ళు అరమూతలు పడివున్నాయి. పెదవులు కంపిస్తున్నాయి—మనసులోనే ప్రార్థించు కుంటున్నట్లు.

"ప్రభూ!... దేవా!.... కులవైషమ్యంతో రెచ్చిపోతున్న ఈ పిచ్చివాళ్ళ బారినుండి, మా పాఠశాలను, దేశాన్ని రక్షించు తండ్రీ!....

హెడ్మాష్టర్ ప్రతిమాలగా ఉపాధ్యాయులు పరీక్షలు నిర్వహించడానికి అంగీకరించారు గాని విద్యార్థులు కాపీ చేస్తున్నా, చూసీచూడనట్లు వదిలేసారు. అందుకు కొందరు సంతోషించినా, కష్టపడి పాఠాలు చదువుకున్న ప్రసాద్ లాంటి వాళ్ళు బాధపడ్డారు.

వేసవి సెలవుల తరువాత—నెలరోజులకు—జానకిరామయ్య మరో ఊరికి బదిలీ చేయించుకున్నాడు. పిల్లలంతా

ఎంతో బాధపడ్డారు. బదిలీ అవుచేయించ డానికి ప్రయత్నించారు కాని మనసు విరిగినచోట మనజాలనని వెళ్ళిపోయా డాయన. ఆయన వున్నంత కాలమూ క్షమాపణ చెప్పుకోడానికి ధైర్యమే చిక్కలేదు ప్రసాద్కి. కాని రాత్రి పడుకునేటప్పుడు మాత్రం గురువు గార్ని ధ్యానించి "మన్నించండి మాస్టారూ!" అని విలపించేవాడు.

ఆయన వెళ్ళిపోయాక స్కూల్ వాతావరణమే మారిపోయింది. నోటి శక్తి, భుజబలమూ గల విద్యార్థులు దైవా దీనం. అవారిల ప్రేరణతో క్లాసుల్లో అల్లరిచేయడం పతి పుస్తకమూ చిలికి చిలికి గాలివాన చేయడం, కసితో బసలు కొట్టడం

ఈ క్రోధాంధుల యుద్ధంలో అమా యకు లెందరో నలిగిపోయారు. అదృష్ట వశాత్తు ప్రసాద్ తండ్రికి బదిలీ కావ డంతో-కులం కొటువేయని యింకో స్కూలులో చేరి ప్రసాద్ బ్రతికి పోయాడు.

• • •

డ్రాయింగ్రూంలోనికి మూడు కప్పులతో ఓవల్టిన్ తెచ్చిన సౌమ్య-భర్త ఒంటరిగా దీర్ఘాలోచనలో ఉండడం చూసి ఆశ్చర్యపోయింది.

ముసలాయనా, కొడుకూ వెళ్ళిపోయి నట్లున్నారు... "లోన్ శాంక్షన్ చేస్తు న్నారా, లేదా?" సౌమ్య స్వరం సౌమ్యంగా మాత్రం లేదు.

"ఆయన-మామూలు-యివ్వవన్నారు మరి?"

"జాలి లేదా మీకు? అయన్ని అయన్ని లంచం అడుగుతారా మీరు?"

"ఆడక్కపోడానికి ఆయన ప్రత్యే కత ఏమిటో?"

ఏమిటో సౌమ్యకు తెలియదు కాని- ఆ వృద్ధసౌజన్యమూర్తి ప్రాణం మీదకు వస్తేగాని ఇతరుల సాయం అర్థించని అభిజాత్యుడు చాల కష్టాల్లో వుండి వుంటాడు. కనుక తప్పక సాయం చేయ వలసిందే అనిపించింది సౌమ్యకు.

"ఆ లంచం నే విస్తా. వాళ్ళబ్బాయికి లోన్ ఇప్పించండి లేదా నా నగలు అమ్మి అయినా సరే నే నాయన కిస్తా" కటువు గానే అంది సౌమ్య.

"నటన చాలించి గంభీరంగా మారిపో యాడతడు.

"జానకిరామయ్యగారి కుటుంబానికి సాయంచేయలేకపోతే మానవత్వం అనే మాటకే అర్థంలేదు. నా మనుగడే వ్యర్థం. ఇన్నేళ్ళ కాయన యిలా నా ముందు ప్రత్యక్షం కావడం నా కెంత సంతో షంగా వుందో తెలుసా? పదిహేనేళ్ళ క్రితం నాలో సైతాన్ ప్రవేశించాడు. నాది తెలిసీ తెలియని వయస్సు. మాస్టార్ల లోనూ స్వార్థపరులుంటారని తెలియదు. స్వార్థం కోసం వాళ్ళ వైషమ్యాలు

ఆ బాబులు ఆళ్ల చేత అలాగే జెప్పించి గల్రు.

దళ్ళిచ్చి జెప్పిస్తారు.

బయపెట్టి జెప్పిస్తారు.

“మీ కూలోళ్లలో యింకా కట్టు సాల్దు” అనీసినాడా బాబు.

కాని కూలోళ్లొగ్గనేదు.

వాయం జరగాలన్నారు.

ఎలా జరగదో చూస్తావన్నారు.

కోరట్లో నిజం చెప్పకపోతే ఊరొగ్గేస్తావన్నారు.

“నిజం చెప్పేక ఊళ్ళో ఉండలేక పోయినా ఊరొగ్గేస్తావన్నారు.”

“నువ్వు సిటీ కొచ్చి రెండు మరకల్లాటి కేసులు తగిలించు- మిగతాది మావు జూసుకుంటాం” అన్నారు.

రావుడుగోడు కేసెట్టండి — కేసు పోతే- ఆ లంజికొడుకు నన్ను కోటలో పెట్టు కట్టినాడుగాని— నాను అడ్ని పట్లిగ్గా — రచ్చబండకాడ రావిసెట్టు కట్టీసి— అడ్ని నాను కొట్టను. అది బట్టలిప్పేసి ఒంటికి తేనెరాసీసి — ఒగ్గేస్తాను.

అంతే. మర్నాటికల్లా అడు బతికుండగానే సీవలు పట్టీసి — అయ్యేసం పెయ్యాలన్నమాట

ఆ లంజికొడుకుని యిరిపించడానికి ఊరు పెదబాబులంతా దిగినా- పది మందిర్ని ఏసి— మరీ సస్తాను” అన్నాడు.

“మానం పోయిన ముండని— పేసం ఉన్నా లేనట్టే- మీరంతా కేసెట్టి నన్నేటి సెప్పమన్నా సెప్తాను. ఈ ఊర్లో యిప్పుడు పరవాన్నం తినేస్తున్నానేటి? ఈ ఊరొగ్గేస్తే పస్తులుండాలని బయపడ్డానికి? కాని- ఒక్క మాట- ఆ బాడుకోవోడికి పిచ్చపడినా- ఒగ్గీసినా- నా కొకటే.

నా కొక్కవలసిందల్లా ఒకటే- ఢిల్లీ గేదెలా గుంటాదే అది పెళ్ళాం- అదిగో అది, యిత్తనాల పోతులా గుంటాదే అది కొడుకు - అదిగో- అళ్ళిద్దర్నీ జుత్తుంపట్టుకుని రచ్చబండకాడికి యీడ్చి- ఊరందరి మద్దెల- అళ్ల కోక లిప్పేసి కూకోపెట్టకపోతే- నా పేరు మల్లమ్మే కాదు” అంది మల్లమ్మ

అది మాట్లాడక ముందు- జూస్తే - యిది బతికుందా? సచ్చిపోనాదా అన్న అనుమానం వచ్చేట్టుండేది. కాని మాటాడుతున్నంతసేపూ దెయ్యంపట్టిన దాన్లా అయిపోనాది.

“మనిప్పుడు ఏదే బారం. నువ్వేటి జెప్తే అది సేస్తాం.”

ఊరొగ్గిసి పొమ్మంటే పోతాం.

అగ్గిలోకి గెంతమంటే- గెంతేస్తాం.

కాని- ఆ ఇద్దరు లంజకొడుకుల్నీ జైలుకంటించాల నువ్వు” అన్నారు కూలోళ్ళు సిట్టిబాబుతో.

“మీరేటి జేద్దామనుకుంటున్నారు? అది జెప్పండి ముందు” అన్నాడా బాబు.

“కడుపుతో ఉన్నది - మంతర్సాని

ముందవి కనమన్దు కదా! యేటి సెయ్యాలో సెప్పాల్సింది నువ్వు" అన్నాడో కుఱ్ఱ నంజికొడుకు.

"పోలీసు రిపోర్టే యిస్తావో కోరట్లో కేసే ఎడతావో- నీ యిష్టం. ఇంక దబ్బంటావా- ఎంత కావాలో జెప్పు-

ఇప్పు డెలాగూ ఓ పూట పస్తుం టున్నాం కదా. రెండుపూట్లా పస్తులుం డైనా సరే నువ్వెంత కావాలంటే అంతా నీ కాళ్ళకాడ పడేస్తాం.

యీ కేసులు పోవు.

పోడానికీల్లేదు.

యిందులో పిసరంతైనా అబద్ధం ఉందేటి? కలికాలంలో దరమదేవత ఒంటికాలిమీద కుంటుతాదంటారా. ఒంటి కాలిమీద కుంటక్కర్లేదు నిలబడితే సాలు. ఆ బాడుకావోళ్ళకి సిచ్చలైపో తాయి.

యీ కేసులుగాని పోయేయో—దరమ దేవతకి కుంటడానికైనా, పరిగెత్తడాని కైనా, రెండు కాళ్ళుంటాయో, నాలుగు కాళ్ళుంటాయో - తెల్దుగాని దానికి పేణంవే నేవని రుజువైపోద్ది" అన్నారు మాలోళ్ళు.

అంతవరకూ తపస్సులో కూర్చున్న మునిలా కళ్ళు మూసుకొని వింటున్న సిట్టిబాబు కళ్ళిప్పేడు. అప్పుడా బాబు కళ్ళు సూడ్డానికే బయమేసేసింది.

సీకట్లో సిరతపులి కళ్ళలా ఉన్నాయి. అ బాబు గుండెల్లో మంటంతా కళ్ళ ల్లోకి ఎక్కిపోనాది.

అయితే మాటలు మాత్తరం శాంతం గానే మాట్లాడుతున్నాడు.

"ఇది డబ్బునోడిది రాజ్జెం... అంటే బీదోడికి- బతకడానిక్కూడా ఉల్లేదన్న మాట.

కోరట్లో ఐనాసరే కూరల మార్కెటులో నన్నాసరే డబ్బునోడిదే మాట - అదు జెప్పిందే సత్తెం.

అది వాక్కు- వేదవాక్కు.

మీ రనే దరమదేవత అది పక్కనే, అది మొదటి పెళ్ళాంలా- నిలబడుం టాది.

లచ్చింతల్లి ఆ కొత్తకొడుకుని వొరించేసినాది.

సరస్వతల్లి అది నాలికమీద దస కత్తు జేయిస్తున్నాదన్నమాట.

అసు బలంవోడుకొని, డబ్బు కరు సెట్టి-

పుల్ని పిల్లిని సేసీగల్దు.

అది రాజ్జెంలో- అద్ని- ఎవ్వరూ- మినిస్టర్లు, ఎమ్మెల్లేలు, పోలీసోళ్ళు, జెడిజీలు, అళ్ళూ- యీళ్ళూ కాదు- ఆ బగమంతుడు కూడా ఏటీ సెయ్యలేదు.

అద్ని కుట్టిన తేలుకి కూడిపోద్ది.

అద్ని కరిసిన పాముకి పేణాలు పోతాయి.

అదు- యిదిగో- యీ రావుడిగోడి తోలు తీసీసినాడు. యీ దాడిమీద కేసెడతా దనకుండారి.




ఆదేటి వోడిస్తాదంటే.

ఆ నేరమప్పుడు తనక్కూడ లేసంటాడు. ఆన్నా రామ్చంద గోదే తెగ తాగిసి— అన్ని నానా బూతులూ తిట్టి. ఆడు బూతులు, కేసెడతాడన్న బయానికి వొళ్ళంతా తనే కొరడాతో కొట్టిసుకొని— తప్పుడు కేసెట్టేదంటాడు.

ఆది ప్లీడరు కొత్త కార్లో కోరటు కొస్తాడు.

ఈడి ప్లీడరుకి కారాకిల్లీ కొనుక్కోడానికి కూడా కాణీ జోబీలో ఉండదు.

ఆది సాచ్చులు గొప్పోళ్లు, సదువుకున్నోళ్ళు. మరింక అళ్ళు అబద్ధాలాడేరంటే— అవి నిజమేనేమోనని అళ్ళే నమ్మేసెటట్టుంటాయి. అంత బాగా అబద్ధాలాడగల్రు.

ఇంక యీడి సాచ్చులు ఒట్టి తీదెదవలు. పెళ్ళాం పేరడిగితే, గాబరాపడిపోయి పక్కింటోడి పెళ్ళాం పేరు చెప్పే రకం.

నువ్వు గవర్నమెంటు గెజెటు కోరటుకి అట్టుకెళ్తే అది పోర్జరీ అని నమ్మించిగల్దు ఆడు.

ఆడి పోర్జరీలు మాత్తరం— కోయంబత్తూరు నోట్లలా సెలామణీ అయిపోతాయి.

ఇంక జెడిజీలు అంటావా— అడి ప్లీడరు అర్గుమెంటు సెప్తావుంటే బూతుపాట ఇన్నంత శ్రద్ధగా యింటారు.

యీడి మస్టి ప్లీడరు సెప్పే సింకి అర్గుమెంటు మంచి జెడిజీ అయితే యింటాడు. సెద్ద జెడిజీ అయితే యిన్నట్టు వటిస్తాడు.

అట్ట యిన్నా యినకపోయినా ఆ అర్గుమెంటుకి సింకి కాయితాలకున్న యిలవకూడా ఉండదు.

గొప్పోడు తీసే గొయ్యి ఎలాగుంటా దంటే, మనం అందులో పడినా అది గొయ్యి అని మనకి తెల్దా. ఆ గొయ్యి బూఁవిఁలో కట్టిన మేడలా అగుపడుద్ది మనకి.

గొప్పోడి రాజ్జెం అంకెం అయీ వారకూ, కోరటూ అంఁదే– గవర్నమెంటూ అదిదే.

ఇక్కడో మాలోడూ– అక్కడో మాలోడూ తిరగబడి నాటం లేదు.

తిరగబడ్డోడు తగలబడిపోతాడు.

దీపాన్ని అరపాలంటే– ఒక్కొక్క పురుగూ ఎల్తే దాని రెక్కలే కాల్తాయి. కాని దీపం మాత్తరం ఎలుగుతూనే ఉంటాది.

కొంద పురుగు లెక్క ఒక్కసారే మీదవడితే–పడి సచ్చినా దీపం అరిపోద్ది.

కొంద్దైై పురుగులు సుకపడ్తాయి.

ఇప్పుడు నేనేం చెప్పితా నా మాట ఎరు ఇనరు. నాను కేసులొద్దంటే–నాను కూడా గొప్పోళ్ళ పార్టీలో కలిసిపోవాలని యియ్యేళ గొకపోతే లేపన్నా అంటారు.

కాని– ఓ రకంగా కేసులెట్టడం కూడా మంచిదే. నాను చెప్పే యీ 'తీరీ' (తియరీ)మీకు నడినెత్తికి ఎక్కద్ది కేసులు సంకనాకిపోయాక– సిటీలో నాకు తెలిసిన ఒక ప్లీడరున్నాడు అతగోడికి ఉత్తరం యిస్తాను. పట్టుకొని ఎళ్ళండి" అన్నాడు.

అన్నాక ఎంఁనే ఓ ఉత్తరం బరిరి రాఁవుఁడిగాడి పేతిలో ఎట్టివాడు.

అన్నట్టు సెప్పడం మరిసిపోన్నా. ఇదంతా జరిగినప్పుడు మా యాదడి– సిద్దిబాబకాడే ఉంది. కడుపులో నొప్పి వచ్చి మందు కెల్లినాదట. ఇదంతా యిన్నాక దానికి కడుపు లేకుండా నే పురుడొచ్చేసినట్లయిపోనాదట

రేత్తిరి కూడు కెళ్లినప్పుడు, దాన్ని జూస్తే నాకే బియంఏసిపోనాది. ఈసిన పులిలా ఉంది మనిషి. అంతవారకు దానికి "పోలిటిక్సు"లో యింటరెస్టు లేదు. కీదోళ్ళ బాదలు పర్దానికే పురటారని ఒప్పేసుకొని బతికేది.

ఆ రేత్తిరి దాన్ని జూస్తే నక్సలైట్లై పోద్దేమోనని జడిసిపోన్నా.

అన్నాయం మీదో 'లెక్చరూ', అదరనం మీద ఓ 'స్పీచీ' దంచేసినాది.

దంచేసినాక "సి. స్పి. యిదేం రాజ్జెం? దుర్యోదను డంతటోడు అదదాని కోక యిప్పించబోతే–నానా సంకలు నాకినాడు. అలాంటిది– యీ 'సువ్వర్‌కే బచ్చా"గోడు– పోస్టు కవరిప్పేసినట్టు

కోకిప్పేస్తాదా? మల్లమ్మముండ అడికి యీడా? జోడా? సీరిప్ప సొగసు జూడ్డానికి?

దానికి దయిర్యం నేకపోనాది " బట్టి - బతికిపోనాడు. నా నైతేనా? అది పేగులు పీకేసి- మెళ్లో యేసుకొని- కోకిప్పుకొని మరీ దణ్ణం ఎట్టించుకుండీ వాన్ని దణ్ణం ఎట్టించుకున్నాక- మరింక జెనమలో అడికి అవా-మొగా తేడా తెల కుండా అది గుడ్లు పీకీసిదాన్ని.

అదు కాస్సరి కదా- అది పనవదు కూడా- పరాయివాన్ని కాదు- అతరికి పెళ్ళాన్ని కూడా మళ్ళీ కోకిప్పమన కుండా జేయిప్పినాన్ని.

కోకిప్పటోయిన కౌరవులంతటోళ్లు కలికంలోకి కనపళ్లేదు- యింకేళ్ళ మాట యేరే జెప్పాలా? ఈళ్ళకి మూకలు పండుకొని రోజు లొచ్చీసినాయి.

సి. స్పి. ఈళ్ల కూడు తిండంకన్నా పస్తుండి సావడం నయ్యం. ఇంతన్నా యవాం!"

ఆలా మాటాడినంతసేపూ పిచ్చెక్కిన ఎలుగ్గొడ్డులా- ఊగిపోనాది.

నిజం జెప్పాలంటే ఆ రేత్తిరి నాకూ ప్రాణ్ణం నయించనేదు బాబూ.

## 36

"యేట్రా కెప్టెనూ! ఆ మల్లమ్మ లంజ "రేప్" సర్టిఫికెట్టు పుట్టించేసినా దేట్రా సిట్టిబాబు కాదు!" అ రేత్తిరి అడిగినాడు మా బాబు.

పెట్రోలు పోసి వొళ్ళు అంటించేసినట్టు అయిపోనాది నాకు. అంతవొరకూ ఆ బాబు ఏ అకదాన్ని- లంజా-లండీ అని వోడు కాదు. కోకిప్పినోడు మా పాటీ పెద్ద కాబట్టి మల్లమ్మ లంజైపోనాది. మా బాబద్దేశంలో.

ఈ బాబు బుద్ధి యిదివొరకు పెదితే యిప్పుడు పెదపదితున్నా దనిపించినాది నా మటుకు నాకు.

ఏటి పెప్దామా? అనాలోచిస్తూవుంటే ఆ బాబే మళ్ళీ అడిగినాడు "యేటి? కేసెట్టినాదేటి!" అని.

"కూతురికి కూడెట్టలేంది- అదేం కేసెడతాదండి" అన్నాన్నేను.

"అహాఁ!" పీకలవొరకూ పులావ్ తిని తేనిపినట్టున్నాడండి అ "అహాఁ".

"కానండి- పాటీన పెవాళ్ళి- పీకొచ్చి- అటిజేత- కేసులెట్టించీ జెనం- తయారైనారండి- ఈళ్లో" అని సల్లగా ఓ మాట- కుట్టినాను.

"యెవుర్రా ఆ జెనం" అదుర్దా దిగమింగే అడిగినాడు

"ఇంకెవరండీ! మీ ఓరసల్లే- సిట్టిబాబూ- అతగోడి సిస్సులూను" అన్నానండి- మంట కొంచెం- గాజేద్దారని.

"నీ కెలా తెలుసురా?" అంతవొరకూ పడక్కుర్చీలో పడుక్కునున్నోడు- నెగిసి- మేకు దిగ్గొట్టినట్టు- కూకున్నాడండి.

"అ కూల్లంజి కొడుకులు- ఆ బాబు

కాడికి- ఎల్లిన ప్రకు- నా నక్కడే- ఉన్నానండి దెబ్బకి పలాస్త్రీ- రాస్తే సాంన్నాడండి రావుగోడు- కొబ్బరి కాయలు తను తీసుకున్నానని కూడా- ఒప్పేసుకున్నాడండి అయినా ఆ సిట్టి బాబు- వొప్పుకోనేదండి. - ముండకాడి కెత్తే- జబ్బు పెళ్లానికి తగులుకున్నా దవి సామెత- జెప్పినట్టు- కొట్టినో డొకడూ- తిన్నోడు మరొకడూ- మద్దెల ఈ బాబు కెందుకండి వొంటి దురద? తవరుగోరు నమ్మరు-గానండి బాబూ- తపస్సు జేస్తున్న ఇస్వామిత్తురిల్లా-ఒంటి కాలుమీద నించకపోనాదండి- అ తర వాత- రంటో- యెవర్తో అది- దాన్ని జూసి ఇస్వామితురిల్లా- ఒంటికాలు- దాన్ని- పేరంబించినాదండి. ఉన్న ట్టుండి -"దేన్ని"- అని "హ త్తెరి- ఆ ఇస్పినాదం 'బంచాత్'గాడికి బూబిం యెక్కడ్నించొచ్చినాది? తోట ఎక్క డ్నుంచొచ్చినాది? అయి పడీసుకున్న అస్తులే గదా? ఊరికి పెద్దదొంగ ఆడు. అడి దొంగకాయల్లో- నాలుగు నువు తీసుకుంటే దొంగతనం యెలా గవుద్ది? నీ జేనికి నువ్వు జేసింది పోలీసు పని? ఇయ్యేళ- కోక తీపేసిన్నాడు- నువ్వూరుకుంటే- రేపు పెళ్లాన్ని పక్క లోకి పంపమంటాడు- అది పెళ్లాన్ని అనుకునేవ్? నీ పెళ్ళాన్ని- నీ కాడ డబ్బు లేకపోతే నాతో జెప్పు- నాను యెడతాను మదుపు- నీకు సొమ్ములు రాకపోతే నాతో జెప్పు- నాను జెప్తాను సాధ్చికం- బేపనోడు పంతరాలు పడివినట్టు పరీ జెప్తాను- నీకు ప్లీడర్ని పెట్టిపని నాది- ప్లీడరంటే- ఇలాటిలా టోడనుకున్నావేట? అని మొకం జూస్తే - నక్సలైటు పోలీసోడు గూడా- మూణ్ణాళ్లు సద్దర మానేస్తాడు. అని వోదన ఇంటే- ఇందిరాగాంధీ లాటిది గూడా మంచం వెక్కియాలన్న మాట- ఇలాటిషాయాలన్నీ నా కొగ్గి- అర్జుని డికో సీకుష్ణమూర్తన్నట్టు- అకరికి- మేస్ట్రీటు కతికే రకమైతే అదికి లంచం పారీసి పూచీ నాది- దరమా మీటరు- పేమెంట్లతో సహా- ఈ అస్ప త్రిరి అమ్మేసి- యెంత కావాలంటే- దానికి రెండు రెట్లు- ఇలా పిక్క మీద ఎంట్రక- పీకి పారీసినట్టు- దిగిదదీసి మరీ పారేస్తాను. దొంగోడు దొరికిన్నాడే దుమ్ము లిసిరియ్యాల. అంతేగాని మరో పాలి- వొచ్చినప్పుడు జూసుకుందాం అని వొగ్గిసినావో- మళ్ళీ వొస్తాడు. రంకు మరిగినోడు నీలాటిరేవుని గాసి నాదని- తప్పకుండా మళ్ళీ వస్తాడు గాని తుపాకీ పట్టుకొని మరీ వస్తాడు. వొచ్చి నీ ఇంట్లో యేమీ అడగకపోతే- నీ పెళ్ళాన్ని పట్టుకుని మరీ- యెల్తాడు. అంచేత- ఆ ఇస్పినాదం నంజికొడుకు -ఆ నాగుపాంవుగోడు- తలెత్తిన్నాడే. బుర్ర సిదగపొడిసియ్యాల- పరంచేత వా మాటిని- యెనకడుగు- ఎయ్యాక."

అని నంటిపిల్లోడుకి మనం మాటలు జెప్తావేఁ? అదిగో అలాగ- మరీ మరీ జెప్పి- బోదపరిసి- అని సేతిలో ఇన్ని నోట్లూ- ప్లీడరికో ఉత్తరం ఎట్టినాడండి, అలాగే మల్లమ్మ ముందవి గూడా రెచ్చగొట్టినాడండి- "నువ్వు కూడా- ప్లీడరి కాడికి- ఆ బాబు మెడికల్ సర్టిపికట్టులు కావాలని అంటే నాతో వొచ్చి జెప్పండి- తాఁనఁర జబ్బుగోడు తొడ బకురుకున్నట్లు -యెన్ని సర్టిపికెట్లు గావాలంటే- అన్నీ బఁరేస్తాను" అన్నాడండి. ఈ కేసుల్తో- ఈ ఊర్ని- రష్యాలోనో- చైనాకోనో- కలిపేస్తా దంటా బాబు-" అని అబద్దాలు జెప్పి నండి- ఎందుకు జెప్పినావు- అని అడిగితే- నాకే తెలదండి- అప్పుడు నా కడుపు- ఇలాగెలాగ- ఉడికిపోనావంటే- నానేటి జేస్తన్నానో- యేటి మాటాడు తున్నానో- నాకే తెఁదండి.

"రాఁవఁనాదం మన కుడిబుజవేఁ" అన్నారండా బాబు- పదకొండ్ర్చిలో -ఇలా జావకారిపోతున్నట్టు- కారిపోతూ.

"ఎడం కాలైనా- కుడి బుజమైఁనా- కేసు తప్పేటట్టు నేదండి" అని ఓ బంతం ఏసినాను.

"అతగోడు- జెయిలు కెళ్ళడాని కీల్లేదు" అన్నారండి.

"జెరిమానాతోటి సరిపోయేటట్టు- సూద్దుకగాల్నండి" అని దయిర్యం జెప్పి నానండి- సీకటి కాబట్టి సరిపోనాది గానండి- బాబూ- నేకపోతే- నా నవ్వు ఆ బాబు జూస్తే పీక పిసికీసుండి పోదండి.

"ఈల్లేదు- అతగోడి వొంటిమీద- ఈగకూడా వోలడాని కీల్లేదు" అన్నా దండి వొరండాలో పచారుచేస్తూ

"వొంటికి కిఁనఁయిలు- రానుకో మనండి" అందా మఁపించినాదండి నా మట్టుకు నాకు-

"ఆ బాబుని- అరిజెంటుగా- లాక్కొ రాగా" అని పని పురమాయించినాదండి.

ముందా బాబునీ- తరువాత మా గేంగునీ లాక్కొచ్చినాదండి-

ఆ వారి బాబుకాడి కెళ్ళాలంటే- అరదరేత్తిరి- దాటిపోనాదండి. అవారి బాబు అరదరేత్తిరి వొరకూ- పెళ్ళాం కాడుంటే- ఆ తరువాత- మరదలి 'కేరాఫ్'లో ఉంటాడండి.

తింటున్న మేక-ముక్కని- ఎట్ట మనడిగితే- పులి- యెడద్దేటో గాని బాబూ-అమరదలు మరిడీ- అవారి బాబుని అయిదు నిముషా లొగ్గదండి- పొద్దు పొడిసే వొరకూను- మరంచేత రాఁవఁ సెంద్రరావు బాబు- ఇల్లు సేరుతున్నా వండి.

(సశేషం)

―――




"పండగనాటికి తప్పకుండా వస్తారు కదూ!" అని కంపార్టుమెంటులో కిటికీ ప్రక్కన కూర్చున్న లక్ష్మి ప్లాటుఫారంమీద నిలబడిన వాసును అడిగింది. అందమైన ఆమె కళ్లలో ఆశలు, కలలు, కోరికలు తొణికిసలాడటం గమనించి వాసు నిట్టూర్చాడు. క్షణం తరువాత తేరుకొని లక్ష్మి చెయ్యి అందుకొని సున్నితంగా నొక్కి వదుల్తూ, 'వస్తాను లక్ష్మీ' అన్నాడు. రైలు వేగం పుంజుకుంది. వాసు కనబడినంతవరకు చెయ్యూపి తన సీట్లో సర్దుకొని కూర్చొని అతను నొక్కి వదిలిన చేతిని పెదవులకు, చెంపలకు, రాసుకుంటూ పరవశించసాగింది.

• • •

లక్ష్మి పదేళ్లపిల్లగా ఉండగా తల్లిదండ్రులు పోయారు. అప్పటినించి అన్న విక్రమ్, వదిన రమ ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో పెంచి పెద్ద చేసేరు. బి.ఏ ప్యాసయిన అందమైన లక్ష్మికి పెళ్లి సంబంధాలు చూడసాగేరు విక్రమ్. అతనికి లక్నోలో ఎంబ్రాయిడరీ చేసిన చీరలు, కుర్తాల వ్యాపారం ఉంది. వ్యాపారం పనిమీద అతను తరుచుగా ఢిల్లీ వెళ్తూ ఉండేవాడు. అక్కడ తన ఫ్రెండు సుభాష్ ఇంట్లో దిగేవాడు. బ్యాంకులో పనిచేసే సుభాష్ ఒకసారి విశాఖపట్నం నించి క్రొత్తగా బదిలీఅయి వచ్చిన ప్రొబేషనరీ ఆఫీసరు వాసును పరిచయం చేసి లక్ష్మిని అతనికిస్తే బాగుంటుందని విక్రమ్‌కు సూచించాడు. వాసు తల్లిదండ్రులు విజయనగరం నించి కాశీ యాత్రకు వెళ్లివచ్చి వాసు దగ్గిర ఉంటున్నారని చెప్పాడు.

అందమైన వాసు రూపం, ఉద్యోగపు హోదా, మాట నెమ్మది చూసి

ముచ్చటపడిన విక్రమ్ సుభాష్‌ను తీసుకొని వాసు ఇంటికి వెళ్లాడు. వాసు తండ్రి నారాయణమూర్తి తల్లి కాంతమ్మ వారి నెంతో మర్యాద చేశారు. తాము కూడా ఆంధ్రప్రాంతానికి చెందినవారమేనని, అయితే వ్యాపార రీత్యా లక్నోలో స్థిరపడ్డామని తన చెల్లెలు లక్ష్మిని వాసుకి చేసుకోమని అడగటానికి వచ్చానని చెప్పాడు విక్రమ్. మంచిరోజు చూసుకొని వాసు, నారాయణమూర్తి, కాంతమ్మ లక్నో వెళ్లి లక్ష్మిని చూసేరు. లక్ష్మి అందంతో పాటు ఆమె పుట్టింటివారి ఐశ్వర్యం కూడ వారి నెంతగానో ఆకర్షించింది. లక్ష్మి నచ్చిందని వెంటనే చెప్పేశారు. లక్ష్మికి కూడ వాసు నచ్చినట్లు తెలుసుకున్నాడు విక్రమ్. పాతికవేలు కట్నం ఇచ్చి, క్రొత్త కాపురానికి కవసరమైన హంగులన్నీ సమకూరుస్తానని, అందరికీ ఖరీదైన బట్టలు పెడతాననీ చెప్పాడు విక్రమ్. వాసు, నారాయణమూర్తి, కాంతమ్మ ఆశను తనంత తానుగా ఇస్తానన్న కట్నకానుకల సంగతి విని పొంగిపోయారు. తాము విజయనగరం వెళ్లిపోవాలని, ఆ లోపలే పెళ్లి జరిపించమని కోరేరు.

శుభ ముహూర్తంలో లక్ష్మీవాసుల పెళ్లి వైభవంగా జరిగిపోయింది. వాసు ముగ్గురక్కలు కుటుంబాలతో వచ్చారు. విజయనగరంలో చదువుకుంటున్న తమ్ముడు, చెల్లెలు వచ్చారు. విక్రమ్ చేసిన మర్యాదలు, పెట్టిన బట్టలు అందరికీ ఎంతో సంతోషాన్ని కలగజేసేయి. పెళ్లవగానే వాసు అక్కలు, తమ్ముడు, చెల్లెలు వెళ్లిపోయారు. గృహప్రవేశానికి లక్ష్మిని తీసుకొని రమ, పిల్లలు ఢిల్లీ వెళ్లేరు.

గృహప్రవేశం, సత్యనారాయణ వ్రతం, టీపార్టీ ఘనంగా జరిగిపోయేయి. కాంతమ్మ రమకు, పిల్లలకు ఖరీదైన బట్టలు పెట్టింది. లక్ష్మినక్కడే ఉంచి, రమ, పిల్లలు ఢిల్లీ నించి లక్నో వెళ్ళిపోయేరు. నారాయణమూర్తి, కాంతమ్మ వేడుకలు ముగియగానే విజయనగరం వెళ్లిపోయేరు.

• • •

తెల్లని జరీపువ్వుల చీరెలో ముస్తాబై గదిలో అడుగుపెట్టిన లక్ష్మిని కన్నార్పకుండా చూశాడు వాసు. 'రా లక్ష్మీ' అంటూ ఆప్యాయంగా, ప్రేమగా ఆహ్వానించాడు. సోఫాలో తన ప్రక్కన చోటు చూపిస్తూ. తియ్యని అనుభవాల కోసం తనువు, మనస్సు తహతహలాడుతూ ఉండగా అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళి సోఫాలో వాసు ప్రక్కన కూర్చున్నది లక్ష్మి.

'లక్ష్మీ', అంటూ భుజాలు పట్టుకొని తమకంతో ఆమెను దగ్గరకు లాక్కోబోయిన వాసుకు ఒక్కసారి శరీరమంతా చెమటలుపట్టి నిస్సత్తువ ఆవహించినట్లు

అయింది. పట్టు సడలిపోయి అతని చేతులు క్రిందకు వాలిపోయేయి.

'ఏమండీ! ఒంట్లో బాగా లేదా' సిగ్గు, కొత్తగా మర్చిపోయి ఆత్రుతగా అడిగింది లక్ష్మి.

వాసు సర్దుకొని, 'కొంచెం అలసటగా ఉంది లక్ష్మీ! మరే లేదు. నువ్వెళ్లి మంచంమీద పడుకో,' అంటూ సోఫాలో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు. లక్ష్మి నిరాశతో క్రుంగిపోతూ అర్ధరాత్రి వరకు నిద్రపట్టక మంచంమీద దొర్లుతూనే ఉండిపోయింది.

లక్ష్మిని వాసు ఎంతో ప్రేమగా చూస్తున్నాడు కాని రాత్రి ఎంతో కోరికతో ఇద్దరూ చేరువయే వేళకు ఏదో భయం పట్టినవాడిలాగా చెమటలు కార్చుకొని దూరంగా వెళ్ళిపోవడం చూస్తున్నకొద్దీ లక్ష్మికి బెంగపట్టుకుంది. తన నెంతో అపురూపంగా చూసుకుంటున్న అందమైన వాసు కోరికలు తీర్చలేని, తీర్చుకోలేని అశక్తుడు కాదుకదా అన్న అనుమానం, భయం ఆమెకు కలగసాగేయి.

'ఏమండీ ఒకసారి డాక్టరు దగ్గరకు వెళ్లరాదూ' అని ఒక రోజు తీరిగ్గా కూర్చున్నప్పుడు వాసును సిగ్గువిడిచి అడిగింది లక్ష్మి. వాసు జాలిగా ఆమె వైపు చూసి, 'నా ప్రవర్తనకు చాల బాధ పడుతున్నావు కదూ! తప్పకుండా రేపే డాక్టరు దగ్గరకు వెళ్ళి నా సమస్యకు పరిష్కారం తెలుసుకుంటాను లక్ష్మీ! తొందరపడి ఈ విషయం మీ వదినకు వ్రాయకుండా ఉంటావుకదూ!' అన్నాడు. అలాగేనంటూ తల ఊపింది లక్ష్మి.

మరునాడు రాత్రి పొద్దుపోయాక ఇంటికి వచ్చాడు వాసు. స్నానంచేసి భోజనానికి కూర్చున్నాడు. లక్ష్మి వడ్డిస్తూ ఆత్రుతగా అతని ముఖంలోకి చూసింది. 'సాయంత్రం ఆఫీసుపని అయ్యాక డాక్టరు దగ్గరకు వెళ్ళాను లక్ష్మీ! బలానికి రెండు నెలలపాటు ఇంజక్షన్లు తీసుకోవాలనీ, తరువాత దాంపత్యజీవితం ప్రారంభించవచ్చుననీ చెప్పేడు' అన్నాడు వాసు. రెండు నెలలంటే రెండు యుగాలా! రెండుకోట్ల యుగాలా! లక్ష్మి మొహంలో ఆశానిరాశలు దోబూచులాడటంగమనించి నిట్టూర్చాడు వాసు. 'ఈ రెండునెలలూ మీవాళ్ళింటికి వెళ్ళి ఉంటావా!' అని అడిగాడు మృదువుగా.

'వెళ్ళను. మిమ్మల్ని చూస్తూ ఇక్కడే ఉంటాను'. అంది కలలు నిండిన కళ్ళతో అతన్ని చూస్తూ. రోజులు గడుస్తున్నకొద్దీ వాసులో ఒక విధమైన స్తబ్దత, నిర్లిప్తత, నిరుత్సాహం చోటుచేసుకోసాగేయి. అర్ధరాత్రివేళ లక్ష్మికి మెలకువ వస్తే మంచంమీద పడుకొని కళ్ళు విప్పార్చుకొని సీలింగ్‌వైపుచూస్తూ కనబడేవాడు. ఒక్కొక్కసారి తీవ్రమైన అశాంతికి, అలజడికి లోనైనట్లు అస్థిమితంగా హాల్లో పచార్లుచేస్తూ ఉండేవాడు. లక్ష్మిని చూడగానే ఉలిక్కిపడి, 'లక్ష్మీ! వెళ్ళి



వడుకో. నాకేం కాలేదు. ఇంజక్షన్లు కే।పె।క గడువు పూర్తవుతుందని పీత్రైతే చేస్తున్నాయి. అంతే', అనేవాడు. లక్ష్మి షర్బతు కలిపి తెచ్చి ఇస్తుంటే ఆమెకు తనమీదున్న శ్రద్ధకు, ప్రేమానురాగాలకు అతని కళ్ళు అప్రయత్నంగా తడి అయ్యేవి.

• • •

-దీపావళికి ఇద్దర్నీ రమ్మని మరీ మరీ చెప్పివెళ్ళాడు విక్రమ్. అప్పటికి డాక్టరు దీపావళి ముందురోజు రాత్రికే వస్తానని చెప్పి వారం ముందుగా లక్ష్మిని పంపించాడు వాను.

వచ్చినప్పటి నించి లక్ష్మి పరధ్యానంగా ఉండటం చూసి రమ నవ్వుతూ 'మరదలికి మా తమ్ముడిమీద ధ్యాసా? పుట్టబోయే బాబు గురించి కలలా?' అని హాస్యంచేసేది.

'ఇప్పటికి అలాంటి అదృష్టం పట్ట లేదులే వదినా ' అంటూంటే లక్ష్మి కళ్ళ వెంబడి జలజలా నీళ్ళు రాలాయి.

'లక్ష్మీ! ఏడుస్తున్నావా? ఏమైంది?' రమ కంగారుగా అందోళనగా లక్ష్మి భుజం మీద చెయ్యి వేసింది. వాసు కిచ్చిన మాటకోసం రెండు నెలలుగా తనలో ఇముడ్చుకున్న బాధను రమ దగ్గిర వెళ్ళ గ్రక్కి బావురుమంది లక్ష్మి. అంతా విన్నాక రమ తేలిగ్గా నిట్టూర్చింది.

'దీపావళి వెలుగులతో నీ బ్రతుకులోకి వెన్నెల వస్తుంది' అంటూ లక్ష్మిని ఉత్సాహపరిచింది.

విక్రమ్, లక్ష్మి, వాసుకు ఖరీదైన బట్టలు కొన్నాడు. రమ ఎన్నోరకాల పిండివంటలు చేయించింది. ఎక్కడ చూసినా దీపావళి సంరంభమే. ముందు రోజు సాయంత్రం లక్ష్మి ముస్తాబై వీధిగేటు దగ్గిర నిలబడింది. వాసు గురించి ఆలోచిస్తూ పరధ్యానంగా ఉంది పోస్టుమాన్ కేకవిని ఉలిక్కిపడి తనపేర వచ్చిన పొడుగాటి కవరును అందుకుంది.

'పైలైతే ఈ రాత్రికే వస్తానన్న వాసు ఇంతపెద్ద ఉత్తరం వ్రాసాదేమిటీ? సెలవు దొరకలేదా? రావడంలేదా? ఇంకా ఒంట్లో బాగోలేదా?' అని తనలో తను మధనపడుతూనే గదిలోకి నడిచి మంచం మీద వాలి కవరు చింపి కాగితాలు బైటికి తీసింది. అక్షరాల వారుంవెంట ఆమె కళ్ళు పరుగులు పెట్టసాగేయి.

'లక్ష్మీ!

ఈ ఉత్తరానికి బదులు నేనే నీ చేతుల్లో ఉంటానని ఆశపడి ఎదురుచూసిఉంటావు. నిన్ను నిరాశ పరుస్తున్నందుకు క్షమిస్తావు కదూ!

నీకు-నీకేకాదు, నా తల్లిదండ్రులకి కూడ తెలియని చీకటికోణాలు నా గత జీవితంలో ఉన్నాయి. వెందు మనస్సుతో నన్ను నమ్మి నాచేత మూడుముళ్ళు వేయించుకొని, నానించి ఏమీ పొంద కుండానే ప్రేమానురాగాలతో సేవచేసిన అమృతమూర్తివి నువ్వు. నీతో చెప్పు కుని నా వ్యధాభారాన్ని దించుకోవాలనే ఆశతో నేనీ ఉత్తరం వ్రాసేను. నోటితో చెప్పుకోలేక నా బాధామయ గాథను కాగితంమీద పెట్టాను. ఓర్పుతో చివరి వరకు చదువుతావు కదూ.

నేను బి.కాం ప్యాసయి బ్యాంకులో ఉద్యోగం సంపాదించే నాటికి, నా ముగ్గురక్కలకు పెళ్ళిళ్ళుచేసి మా అమ్మ, నాన్నగారు ఆర్థికంగా చితికిపోయేరు. ఇంటిమీద అప్పు చేసేరు. నా తమ్ముడు కాలేజీలో, చెల్లి హైస్కూల్లో చదువు కుంటున్నారు. నేను ఉద్యోగంలో చేరిన నాటినుంచి నాకు, నా తల్లిదండ్రులకి ధనదాహం పట్టుకుంది. పదివేల రూపా యల కట్నంతో పాటు స్కూటరు కూడ కోరటంతో చాల పెళ్ళి సంబంధాలు తప్పిపోయాయి. చివరకు దివి తాలూకాకు

చెందిన వ్యవసాయదారుడు వెంకట్రామయ్యగారు పదివేల రూపాయల కట్నం, సంక్రాంతికి స్కూటరు ఇస్తానని చెప్పేరు. అప్పుడు మేము మరో మెట్టు ఎక్కి పెళ్ళి సమయంలో ఐదు వేల రూపాయలు బట్టల నిమిత్తం ఇమ్మన్నాము. అతను ఒప్పుకున్నాడు. అతని కూతురు కమలతో నా పెళ్లి వేసవిలో జరిగిపోయింది. సమయానికి అందకపోవటంతో బట్టల నిమిత్తం ఇస్తానన్న ఐదువేలు ఇవ్వలేక పోయే సరికి మేమందరం కోపం తెచ్చుకొని రభస చేసేము. స్కూటరుతో పాటు ఇస్తాను శాంతించమని ప్రతిమాలుకున్నారు.

నేను, కమల విశాఖపట్నంలో కాపురం పెట్టేము అమ్మ వచ్చి కొన్నాళ్లపాటు మాతో వుంది. శ్రావణ మాసంలో నోములు నోచుకుంటానని కమల సరదాపడింది కాని అమ్మ ఒప్పుకోలేదు.

'మీ వాళ్లు వాగ్దానం చేసిన కానుకలు ఇచ్చాకే ఏ పేడుకలైనా,' అనేయటంతో కమల చిన్నబుచ్చుకుంది. స్కూటరు ఇవ్వలేదన్న కొరత నన్ను పీడిస్తూ ఉండటంతో అకారణంగా కమలను కసురుకుంటూండేవాడిని.

మామగారు దసరాకు రమ్మని వ్రాస్తే ఏకంగా సంక్రాంతికి వస్తామని, డబ్బు జతపెట్టి ఉంచమని వ్రాసేను. కాని ఆ ఏడు కార్తీకమాసంలో వచ్చిన ఉప్పెనలో నేను స్కూటరు గురించి కన్న కలలన్నీ కొట్టుకుపోయాయి అత్తగారు, మామగారు, కమల తమ్ముళ్లు ముగ్గురూ అన్నీ పోగొట్టుకొని ప్రాణాలు మాత్రం దక్కించుకో గలిగేరు. పుట్టింటివారంతా ఎలాగున్నారో అనే ఆందోళనతో కమల ఏడుస్తుంటే నేను జాలిపడలేదు. వాళ్ళ క్షేమం తెలుసుకుంటానని ఊరడించలేదు. ఇంటిల్లో శోకాలు పెట్టొద్దని కోప్పడ్డాను. నాకు స్కూటరు బట్టలకు డబ్బు ఇస్తామని చెప్పి మోసం చెయ్యడం వల్లనే వాళ్లకా కష్టాలు వచ్చాయని మూర్ఖంగా తిట్టాను

కమలకు దుర్దినాలు ప్రారంభమైనాయి. కొన్నాళ్లు ఉందామని వచ్చిన అమ్మ, నాన్న కమలను ఏదో నెపంతో తిడుతూ ఉండేవారు. అమ్మ కమల చేత ఇంటి చాకిరీ అంతా చేయిస్తూ తిండి సరిగా పెట్టేది కాదు. పుట్టింట అపురూపంగా పెరిగిన కమల అర్ధాకలితో అరవచాకిరీ చేస్తూ రాత్రిళ్లు నేను ఇచ్చే అరటి పండ్లనో, బిస్కెట్లనో ఆప్యాయంగా అపురాపురుమంటూ తినేసి నా చేతుల్లో వాలిపోయి నా కోరికలు తీర్చేది.

అమ్మ, నాన్న విజయనగరం వెళ్లిపోతూ, 'ఈ దరిద్రగొట్టు పెద్దమ్మను పుట్టింటికి పంపెయ్యి. స్కూటరుకి, లాంచనాలకి డబ్బు తేగలిగినప్పుడే గుమ్మం తొక్కమను,' అని సలహా

ఇచ్చేరు. వారి సలహా నాకు దారి చూపినట్లయింది.

కమలను ప్రేమగా చూడటం మొదలుపెట్టాను. ఒకనాటి రాత్రి కమల సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ తను తల్లి కాబోతున్నట్లు చెప్పింది.

నేను సంతోషం పటిస్తూ, 'నువ్వింక మీదట కొళాయినీళ్ళు మోసి కష్టపడనక్కర్లేదు కమలా! మన కొంత చక్కని ఇల్లు చూసేను,' అన్నాను. తన గురించి నేను తీసుకుంటున్న శ్రద్ధకు కమల కళ్ళలో వెలిగిన దీపాలు సూటిగా చూడలేక కళ్ళు వాల్చుకున్నాను. వాల్చుకున్న కళ్ళముందు స్కూటరు మెదలగానే మనస్సు ఎళ్ళి కరుడుగట్టింది.

వారం తరువాత కొత్త ఇంట్లోకి మారేము. దసరాకి కమల వెళ్ళి పుట్టింట పదిరోజులుండి వచ్చింది. స్కూటరుకీ, లాంఛనాలకీ డబ్బు ఇవ్వనక్కరలేదని నేను కమలచేత పెట్టిన కబురు విని మామగారు పొంగిపోయారుట. అయినా కాలు చెయ్యీ కూడదీసుకున్నాక ఏదోరూపేణా ముచ్చట తీరుస్తానని అన్నారుట.

ఆరోజు దీపావళి. కమలకు నైలెక్సు చీర జాకెట్లు, స్వీట్సు, ప్రమిదలు, బాణసంచా కొన్నాను. తలంట్లు పోసుకుని పిండివంటలతో భోజనాలు చేసేము. సాయంత్రం అరవుతుండగా కమల స్నానంచేసి నైలెక్సుచీర కట్టుకొని ప్రమిదలో చమురు, వత్తులువేసి దీపాలు వెలిగించింది. కమల వీధిగడపలో దీపాలు పెడుతూ ఉండగానే నేను వంటింట్లో కాగితం ముక్కలు, పట్టకారు తీసి దాచేశాను. గదిలో ఫ్యాను ఫుల్ స్పీడులో పెట్టేసి కుర్చీలో కూలబడి కణతలు రుద్దుకోసాగేను.

'ఏమండీ! అలాగున్నారేం?' లోపలికి వచ్చిన కమల అడిగింది ఆత్రుతగా.

'చాల తలనొప్పిగా ఉంది కమలా! కాఫీ పెడుదూ' అన్నాను. కమల స్టౌ వెలిగించడానికి వంటింట్లోకి వెళ్ళగానే వీధి తలుపు, పెరటి తలుపు గడియలు పెట్టి తాళాలు వేసేశాను.

'అబ్బా! తల పగిలిపోతూంది కమలా! కప్పు కాఫీ పెట్టడానికింత సేపా?' కమలను గాబరా పెట్టేస్తూ అరవడం మొదలు పెట్టేను.

'అయ్యో! గిన్నె దింపడానికి పట్టకారు కాని, కాగితాలుకాని కనబడలేదు!' అంటూ కంగారులో అనాలోచితంగా కొంగుతో గిన్నె దింపుతూ ఉండగా చీర అంటుకుంది. నేను గబగబ వెళ్ళి బాత్‌రూంలో దూరేను. అది గమనించని కమల నేను గదిలోనే ఉన్నాననుకొని గాబరాతో కేకలు పెడుతూ ముందు గదిలోకి వెళ్ళడమూ, ఫ్యానుగాలికి మంటలు ఉధృతమవడమూ చాటువించి చూస్తూనే ఉన్నాను.

'అయ్యో! కాలిపోతున్నానండీ! ఎక్క

దన్నారండీ! రండి! రక్షించండి!' అని ఆర్తనాదాలు చేస్తూ పెరటి నడవలో పడి దొర్లుతూ ఉండగా నేను తాపీగా బైటికి వచ్చాను.

'అయ్యో! అమ్మో! రండి! రక్షించండి! చచ్చిపోతున్నానండీ'

'చావు! నీ తండ్రి వాగ్దానం చేసిన డబ్బు ఇవ్వనందుకు నీ కిదే సరియైనశిక్ష' అన్నాను కర్కశంగా.

'డబ్బు.... కోసం నన్ను కాల్చేస్తున్నారా!'

'దాహం దాహం !'

'మంచి నీళ్ళు పొయ్యటానికి వస్తే నన్ను కూడ మంటల్లోకి లాగవచ్చు ననా? చచ్చేదానివి నీకు మంచినీళ్ళు కూడా ఎందుకులే.'

దీపావళి సంరంభంలో, బాణాసంచా వెలుగుల్లో, చప్పుళ్ళలో నా ఇంట్లో జరిగిన ఘోరం ఎవరూ గమనించే అవకాశం లేకపోయింది. ఆఖరిసారిగా నిస్సహాయత, దీనత్వం, అసహ్యం, కోపం నిండిన కళ్ళతో కమల చూసిన చూపు నన్ను భయభ్రాంతుణ్ణి చేసింది. గబగబ వీధి తలుపు తీసి, చేరవేసి మా ఇంటికి కొద్దిదూరంలో ఉన్న కిళ్ళీకొట్టుకు వెళ్ళాను. సిగరెట్టు కాలుస్తూ పదినిముషాలు గడిపి ఇంటివైపు నడుస్తూ ఉంటే మాకు పాలుతెస్తూ పోలయ్య కనబడ్డాడు. ఇద్దరం మాట్లాడుకుంటూ మా ఇంటి మెట్లు ఎక్కాము.

'కమలా! పాలు పోయించుకో,' అంటూ ఓరగా వేసిన తలుపు బార్లాతీస్తూ నేను లోపలికి వెళ్ళాను. మరుక్షణం 'పోలయ్యా ఇలారా' అని అరిచాను. వణికే గొంతుకతో నా కేక విని పోలయ్య లోపలికి వచ్చి బొగ్గుల కుప్పలాగా పడి ఉన్న కమలను చూసి నిశ్చేష్టుడైనాడు.

'కాఫీ పెట్టమని చెప్పి, సిగరెట్లు కొనుక్కుందామని వెళ్ళి వచ్చేలోపల యీ ఘోరం జరిగిపోయింది పోలయ్యా,' అంటూ చేతుల్తో ముఖం కప్పుకొని కూలబడ్డాను. పోలయ్య గబగబ బైటకు వెళ్ళి వలుగుర్ని పిల్చుకొచ్చాడు. గుంపులో ఎవరో మా అమ్మ, నాన్న లది, అత్త వారిది అడ్రసులు అడిగి పుచ్చుకొని టెలిగ్రాములు ఇవ్వడానికి వెళ్ళారు.

'అయ్యో! పండగపూట ఎంత ఘోరం జరిగింది!'

'ఇరవై ఏళ్ళయినా ఉన్నాయో లేదో, అప్పుడే నూరేళ్ళు నిండాయి.'

'ఈ స్టౌలు, నైలెక్సు చీరలు వచ్చాక ఆడవాళ్ళకు అగ్ని ప్రమాదాలెక్కువయాయి'

'ఎంత అన్యోన్యంగా ఉండేవారనీ, రోజూ సినిమాకో, షికారుకో వెళ్తూ కనబడేవారు కదా! దేవుడు ఓర్వలేక పోయాడు కాబోలు!' ఆ వ్యాఖ్యానాలు వింటూ నా మీద ఎవరికీ అనుమానం రాని విధంగా పథకంవేసి తగిన సమయంలో అమలు జరిపినందుకు నన్ను

నేనే అభినందించుకున్నాను. శెల్రిగ్రాము లందుకొని మరునాటికి అమ్మ, నాన్న మూడోనాటికి మా అత్తగారు, మామ గారు అతని బావమరిది రాఘవ వచ్చారు. అవలిస్తే ప్రేగులు లెక్కపెట్టగల నమ ర్ధుడైన రాఘవను చూచి నేను లోలోపల బెదిరాను. పెళ్ళిలో పేచీలకు రాఘవ మమ్మల్నెంత అసహ్యించుకున్నాడో నాకు బాగా గుర్తుంది.

'ఒకసారి చూపైనా లేకుండా చేసేవా అమ్మా!' అని మా అత్తగారు దీనంగా ఏడవసాగేరు.

'పెళ్ళయిన రెండేళ్ళకే చావొచ్చి పడుతుందని తెలిస్తే నా బిడ్డకసలు పెళ్ళే చేసేవాడిని కాదు.' అని మా మగారు ఏడిచారు.

'ఇది వచ్చిపడిన చావుకాదనీ, నువ్వు డబ్బు ఇవ్వలేదన్న కోపంతో, తెచ్చి పెట్టిన చావనీ నాకు అనుమానంగా ఉంది బావా!' అన్నాడు రాఘవ

'దసరాకు వచ్చినప్పుడు అల్లుడు తన నెంతో బాగా చూసుకుంటున్నాడని చెప్పింది బావా!'

'బలి యిచ్చేముందు పశువును బాగా మేపుతారని తెలియదా బావా? వీళ్ళ నసలు కోర్టుకెక్కించి మూడు చెరువుల నీళ్ళు త్రాగిస్తే అసలు సంగతి తెలుస్తుంది'

'ఏంచేసినా నా బిడ్డ తిరిగిరాదు కదా!'

'నీ బిడ్డ తిరిగిరాకపోయినా ఇలాంటి వాళ్ళు ఇకమీదట ఘోరకృత్యాలు చెయ్య డానికి భయపడతారు!'

'అయినా తప్పంతా నాదే బావా! రాబోయే డబ్బుమీద భరోసా పెట్టుకొని వాగ్దానం చెయ్యడం చాలా పొరపాటై పోయింది. వీళ్ళ ధనదాహాన్ని అనాడే అర్థంచేసుకొని సంబంధాన్ని ఒదులుకొని ఉంటే నాకీ కడుపుకోత ఉండేది కాదు.' అని మామగారు వలవలా ఏడ్చారు.

'డబ్బుకోసం పెళ్ళాన్ని చంపడానికి మావాడేం రాక్షసుడా? అకారణంగా నిందలు వేసి మా పరువు తియ్యకండి.' అని అమ్మ నాన్న కస్సుమన్నారు. పచ్చి మంచినీళ్ళు ముట్టకుండానే మా అత్త వారు ఏడుస్తూనే వెళ్ళిపోయేరు. నేను పదిహేను రోజులు సెలవు పెట్టి విజయ నగరం వెళ్లాను. స్నేహితులు, బంధు వులు పరామర్శకు వస్తే కడుపులో సంతోషం పిండుగా వుండగా గొంతులో దుఃఖం ప్రదర్శించలేక యాతనపడే వాడిని.

కమల పోయినప్పటినుంచి నాకు నిద్ర కరువైంది. ప్రక్కమీద అస్థిమి తంగా దొర్లితే ఏ తెల్లవారుజాముకో కళ్లు బరువెక్కి మూతలుపడేవి. కాని కమల గుండెలమీద కూర్చుని గొంతు పట్టుకున్నట్లో, దీనంగా ఆర్తనాదాలు చేస్తున్నట్లో కలవచ్చి ఉలికిపాటుతో లేచి పోయేవాడిని. నిద్రలేమి, పీడ కలలు భరించలేక నిద్రమాత్రలు అలవాటు చేసుకున్నాను. సెలవు పూర్తయి నేను

రాగానే ప్రొబేషనరీ ఆఫీసరుగా సెలక్టు అయినట్లు, ఢిల్లీకి బదిలీ అయినట్లు తెలిసింది. అదృష్టవంతుడివి కాబట్టే కమల పీడ వదిలిపోయిందనుకున్నాను. నాకు, మా వాళ్ళకు ధనవ్యామోహం ఇంకా పెరిగిపోయింది. పేరుకే రెండో పెళ్లి కానీ ఆఫీసరు హోదాలో ఉన్న నన్ను చూసి పాడిని కట్నం పాతికవేల కట్నంతోపాటు లాంఛనాలు జరిపే సంబంధాన్ని చేసుకోవాలని అనుకున్నాను. నేను ఢిల్లీకి వచ్చి కాయినయేను.

మీ అన్నయ్య ఆహ్వానంమీద మీ ఇంటికి వచ్చి నిన్ను చూసి, మీ వాళ్ళింటి ఐశ్వర్యంచూసి నేను, మా తల్లిదండ్రులు ఉప్పొంగిపోయాము. పాతికవేల కట్నం, లాంఛనాలు తానుగా ఇస్తానన్న మీ అన్నయ్య అడగకుండానే వరాలిచ్చే దేవుడిలాగా కనబడ్డాడు. ఆలస్యంచేస్తే తప్పిపోతుందేమోనన్న భయంతో పెళ్లి జరిపించమని తొందరపెట్టేము. నా మొదటిపెళ్లి గురించి ఎవ్వరం నోరు మెదపకూడదని నిశ్చయించుకున్నాము. మన పెళ్లి లక్షణంగా జరిగిపోయింది.

దాంపత్య జీవితానికి అదే తొలిరాత్రి అయినట్లు సంబరపడిపోతూ నిన్ను దగ్గిరకు తీసుకోబోయేను. అంతే! కమల గుడ్లురుముతూ, 'దుర్మార్గుడా! బ్రతికి ఉండగానే నన్ను కాల్చి బూడిద చేసి కొత్త పెళ్ళాంతో కులుకుదామనుకున్నావా!' అంటూమీదకువచ్చినట్లయింది. ఎంత ప్రయత్నించినా నిన్నింకా దగ్గిరకితీసుకోలేకపోయాను. ఆ క్షణంనుంచే నాకు మానసికంగా నరకం ప్రారంభమైంది. మంచంల్లో మసలుతున్న కమల నను క్షణం ఒంటరిగా ఉండనివ్వకుండా వేధించసాగింది. క్షణమాత్రమైనా నిద్రపట్టని దుస్థితి వచ్చింది. దుఃఖావేశంతో కమలను కాల్చి బూడిదచేసి బ్రతుకులోంచి తొలగించుకున్నాననుకున్నాను కాని నేను చేసిన ఘోరకృత్యం ఆరని అగ్నిహోత్రమై నా గుండెల్లో జ్వలిస్తూనే ఉంది, పశ్చాత్తాప జ్వాలగా మారి నన్ను దహించడం మొదలుపెట్టిందని, అందువల్లనే అందమైన భార్య, కోరుకున్న ఐశ్వర్యం అందుబాటులో ఉన్నా అనుభవించలేకపోతున్నానని అర్థంచేసుకున్నాను. నిజమైన సంతోషం, మనశ్శాంతి ఉన్నప్పుడే మనిషి బ్రతుకులోని సుఖాలను నిండుగా అనుభవించగలడు. పచ్చిలత, నవ్వునర్తన వినోదానికి, సంతోషం, మనశ్శాంతికి దూరమయ్యాను.

కొత్త కాపురంలోని తీపి కోరికలు తీరకపోవడంవల్ల నీ మోహంలో వ్యక్తమయే నిరాశ, బాధ చూస్తూ నీ దగ్గిరకు నేను రాలేకపోవడానికి కారణం ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక సతమతమయేవాడిని. డాక్టరు దగ్గరకు వెళ్ళమని నువ్విచ్చిన సలహా నాకో దారి చూపెట్టినట్లుంది. నా ఆరోగ్యం దాంపత్య జీవితం గడపటానికి అనుకూ

ంగానే ఉందని బాగులేనిదల్లా మనస్సే నని నాకు తెలుసు. కొన్నాళ్ళకయినా ఈ మానసిక నరకంనించి బయటపడగల నేమోనన్న ఆశతో, నేను డాక్టరు దగ్గరకు వెళ్ళినట్లు, దాంపత్య జీవితం ప్రారంభించొద్దని డాక్టరు రెండు నెలల గడువు పెట్టినట్లు చెప్పి నిన్ను నమ్మించాను. కానీ నా ఆశలు అడియాసలైనాయి.

అగ్నిసాక్షిగా నాతో బ్రతుకు పంచుకొని, నన్ను తండ్రిని కూడ చెయ్యబోయిన అమాయకురాలైన అర్ధాంగిని ధనదాహం తీరలేదన్న కసితో బ్రతికి ఉండగానే అగ్నిపాలుచేసి నేర్పుగా అగ్నిప్రమాదంగా చిత్రీకరించి దోషిగా చట్టానికి పట్టుబడకపోయినా, ఆ ఘోర కృత్యానికి ఏకైక సాక్షి అయిన నా మనస్సు చేసిన విచారణకు తలవంచి నేరాన్ని ఒప్పుకోవలసి వచ్చింది. నేనింక ఈ చిత్రహింసనించి, అశాంతినించి ఎప్పటికీ బైటపడలేను. నేరస్థుడిగా పట్టుబడని నేను ధీమాతో నిన్ను పెళ్లాడినందుకు నన్ను క్షమించు లక్ష్మీ! మన పెళ్ళి పీడకలగా భావించి మర్చిపో. నువ్వు అమాయకురాలివి. మంచి పిల్లవు. అందుకే నాలాంటి దుర్మార్గుడి చేతుల్లో నలిగిపోకుండా అదృశ్యంగా ఉన్న కమల తన ఉసురు నాకు తగిలేటట్లు చేసి నిన్ను కాపాడింది.

వరకట్నాన్ని కూతుళ్ల పాలిట శాపంగాను, కొడుకుల పాలిట వరంగాను భావించిన నా తల్లిదండ్రులు కళ్లు తెరిచి నా తమ్ముడి పెళ్లి విషయంలో మానవత్వంతో, మంచితనంతో నడుచుకుంటారని ఆశిస్తున్నాను. లక్ష్మీ! నా కోసం బాధపడకు. నీ అన్నావదినల అండదండలతో యోగ్యుడైన వరుడిని పెళ్లి చేసుకో. నీ వైవాహిక జీవితం చిరకాలం సుఖసంతోషాలతో వర్ధిల్లాలని కోరుకుంటున్నాను.

కమలను కాల్చి చంపి ఆమె తల్లిదండ్రులను కడుపు కోతకు గురిచేసిన నాకు బ్రతికే అర్హత లేదు. అందుకే మనస్సు వేసిన శిక్షను స్వీకరించి నీ బ్రతుకులోంచి, ఈ లోకంనించి వెళ్లిపోతున్నాను.

అభాగ్యుడు
వాసు

తన బ్రతుకును చీకటి దారుల్లోకి నడిపించుకొనిపోయిన ఆ ఉత్తరాన్ని చదివి మొదలునరికిన చెట్టులాగా కూలిపోతూ లక్ష్మి చేసిన ఆర్తనాదంతో ఇల్లంతా దద్దరిల్లిపోయింది.

సీరియల్

# అగ్నిశిఖ

వాసిరెడ్డి సీతాదేవి

(గత సంచిక తరువాయి)

"ఇక్కడ ఆ పేరు గలవారెవరూ లేరు. ఓ బహుశా ఇల్లు ఖాళీచేసినవారి ఇంటిఅమ్మాయి పేరు కావచ్చును." అన్నాడు ఆ యువకుడు.

"ఇల్లు ఖాళీ చేశారా?"

"అవునండీ టూలెట్ బోర్డ్ చూసి మేము ఈ ఇల్లు అద్దెకు తీసుకున్నాం. నిన్ననే వచ్చాం." అన్నాడు ఆయువకుడు

"సారీ! డిస్టర్బ్ చేశాను."

"ఫర్వాలేదులెండి."

రాహుల్ మనసు ఎలాగో ఉంది.

అందరూ చెప్పేది నిజమేనా?

నో! నో! భావన అలాంటిది కాదు.

మరి అంత అకస్మాత్తుగా ఊరు వదిలి ఎందుకు వెళ్ళిపోయినట్టు?

ఎవరో తలుపు తట్టిన శబ్దానికి రాహుల్ ఆలోచనలనుంచి బయటపడ్డాడు. తలుపు తీశాడు.

"ఏ రామూ! సినిమాకు వెళ్ళలేదా?"

"వెళ్ళాను."

"అప్పుడే తొమ్మిది దాటిందా?" చేతి గడియారం చూసుకుంటూ అన్నాడు.

"బాబూ భోజనం చేస్తారా?"

"రమేష్‌ను రానివ్వు."

"ఆ బాబుకు ఇవ్వాళ ఎక్కడో డిన్నర్ ఉన్నదట. మీకు భోజనం పెట్టమని చెప్పారు."

"అయితేనువ్వు భోజనంచేసిపడుకో."

"మీరు?"

"చెప్పింది చెయ్యి." విసుగ్గా అని మళ్ళీ టేబుల్ ముందు కూర్చున్నాడు.

గ్లాసులో సగం బ్రాందీ ఇంకా ఉన్నది.

గ్లాసు ఎత్తి రెండుమూడు గుక్కలు తాగాడు.

మెదడు మొద్దుబారుతున్నట్టు అనిపించింది.

భావన వెళ్ళిపోయి రెండేళ్ళు అయింది.

బి. ఏ. ఫైనల్ రాయకుండానే వెళ్ళిపోయింది.

ఏదో బలీయమైన కారణమే ఉండి ఉండాలని తనకు అనిపించింది.

అది నిజమేనని మూడురోజుల కిందటే తెలిసింది.

ఆ రోజు తను బాధ దిన్నట్టు అంతకు ముందెప్పుడూ బాధపడలేదు

భావనను ఎప్పటికైనా మరచిపోగలననుకోవాడు తను. తనకు అలా ఎందుకు అనిపించిందో తనకే తెలియదు.

ఆ రోజు— అదే తను మొదటిరోజు తాగినరోజు— తన పతనానికి నాందిగా మారిన రోజు తను ఒకసారి బట్టల షాపుకు వెళ్ళాడు. లుంగీలు చిరిగి పోయాయి. కొనుక్కోవడానికి వెళ్ళాడు.

అక్కడ భావన చీరెలు చూస్తూ నిల్చుని ఉంది.

అది కలో నిజమో అర్థంకానట్టు చూస్తూ నిల్చున్నాడు తను. భావన వెనుదిరిగి చూసింది.

“హలో రాహుల్! బాగున్నావా?” అతి మామూలుగా అడిగింది భావన.

భావన ముఖంలోకి చూశాడు తను.

ఆ ముఖంలో ఏ మార్పూ లేదు. అదే ఆత్మవిశ్వాసం.

ఆ చూపులు, అలాగే అగ్నిశిఖలా రెపరెపలాడుతున్నాయి.

“ఏమిటి అలా చూస్తావు. నన్ను గుర్తించలేదా?”

గుర్తించలేదా?

తను భావనను గుర్తించలేడా?

లక్షమందిలో ఉన్నా గుర్తిస్తాడు.

“ఏమిటి రాహుల్ మాట్లాడవేం?”

“నువ్వెందుకిలా చెప్పకుండా వెళ్ళిపోయావ్?”

కుచ్చిళ్ళు పట్టుకొని రబ్బరుబొమ్మలా తెల్లగా బొద్దుగా ఉన్న దాదాపు సంవత్సరం దాటిన పిల్ల “మ్మ్మ!” ఎత్తుకోమన్నట్టు చేతులు ఎత్తి ఒల్లికేసి తలెత్తి చూస్తూ నిల్చుని ఉన్నది.

“మమ్మీ!”

తృళ్ళిపడ్డాడు రాహుల్.

భావన పిల్లను ఎత్తుకుంది.

“ఎవరీ అమ్మాయి?”

“నా కూతురు.” నిర్లిప్తంగా అన్నది.

“నీ కూతురా?”

“ఏం అంత ఆశ్చర్యపోతావ్! నాకు కూతుర్ని కనే వయసు లేదా?” అదోలా నవ్వుతూ అన్నది భావన.

“నీకు నీకు పెళ్ళయిందా?”

భావన దుకాణంలోని మనుష్యుల్ని పరికించి చూసింది.

ఎవరి గొడవలో వాళ్ళున్నారు. అంత వరకూ తనకు బట్టలు చూపిస్తున్న సేల్స్‌మాన్ కూడా కొంచెం దూరంలో




మరొకరికి పట్టుచీరెలు చూపిస్తున్నాడు.

"పెళ్లా? కాలేదు."

"మరి?"

"పిల్లలు పుట్టడానికి పెళ్ళి కావాలా?"

భావన నిర్లిప్తంగా ఆ మాట అంటూ ఉంటే వెర్రిముఖం వేసి చూశాడు తను.

"నే నెవర్నో నీకు చెప్పానుగా?"

తల తిరిగిపోతున్నట్టు అయింది తనకు. భావన ఇంతే ఎక్కడలేని అసహ్యం వేసింది.

ఒక స్త్రీ ఇంత సిగ్గువిడిచి మాట్లాడగలదని తను అనుకోలేదు.

మరొక్క క్షణం అక్కడ నిల్చోలేకపోయాడు.

గిర్రున తిరిగి ఇంటికి వచ్చాడు

తనకు ఆరోజు పిచ్చెక్కిపోయేలా అన్పించింది. బ్రాందీ తాగాడు. మత్తులో ఉండగా సుమతి వచ్చింది.

"ఏరా ఇంకా అలాగే కూర్చుని ఉన్నావ్?" లోపలకు వచ్చిన రమేష్ అడిగాడు.

రాహుల్ సమాధానం ఇవ్వలేదు.

"నువ్వు ఇలా తాగడం నాకు ఇష్టం లేదు."

"సారీ! నువ్వు కొన్నావ్. నేను తాగుతున్నాను. నాకు స్కాచ్ కొని తాగే స్తోమత లేదు."

"ఛ! అవేం మాటలురా? అందుకు కాదు. నువ్విలా చెడిపోవడం నా కిష్టం లేదు"

"అవును. చెడిపోవడానికి కూడా డబ్బున్నవాళ్ళకే హక్కు ఉంది" ముద్దముద్దుగా అన్నాడు రాహుల్.

"అదికాదురా బాబూ నేను అనేది."

"ప్లీజ్! ఇప్పుడేమీ అనకు!" అంటూ తూలుతూ తన మంచం దగ్గరకు వెళ్ళి, మంచానికి అడ్డంగా పడిపోయాడు.

* * *

"అమ్మగారూ! ఎక్కడికి వెళ్ళాలి?" రిక్షావాడు భావనను అడిగాడు

రిక్షాలో పిల్లను ఒళ్ళో కూర్చోపెట్టుకొని యాంత్రికంగా కూర్చుంది. ఆమె బుర్ర మొద్దుబారిపోయినట్టుగా ఉంది. రాహుల్ తను అన్నమాటకు, అదే— 'పిల్ల పుట్టడానికి పెళ్ళి కావాలా?' అన్నందుకు స్థాణువులా నిలబడిపోయాడు. అతని నోటివెంట మాట పెగల్లేదు కళ్ళప్పగించి నిల్చున్న రాహుల్‌తో ఒక్క మాట మాట్లాడకుండా తను బయటికి వచ్చి ఖాళీ రిక్షా ఎక్కి కూర్చుంది.

"అమ్మగారూ! ఎక్కడికి వెళ్ళాలి?" నెహ్రూపార్కు దగ్గరకు వచ్చాక రిక్షా ఆపి అడిగాడు.

"అరే ఇక్కడకు తీసుకవచ్చావా?" అన్నది భావన విస్మయంగా.

"మరి తమరు ఏం చెప్పకపోతే"

"పదే పద! పాతపేటలో కుమ్మరి వారి వీధి" అన్నది భావన.

భావనవాళ్ళో స్రవంతి నిద్రపోతున్నది.

నిద్రపోతున్న బిడ్డ ముఖంలోకి ఒకసారి చూసి నిట్టూర్చింది.

వర్షానికి ముందు ఉండే తూనీగల్లా గత స్మృతులు తిరుగుతూ అలజడిని లేపుతున్నాయి బుర్రలో.

రాహుల్‌ను తను ప్రత్యేకమైన వ్యక్తిత్వం గలవాడుగా భావించింది.

అతనూ మామూలు మగవాడే!

ఆనాడు తను గంగాజలం లాంటి దాన్ని కాదన్నప్పుడు అతని ముఖంలో కదిలిన భావాలను తను ఇప్పటికీ మర్చిపోలేదు.

తను ఒక వేశ్య కూతుర్ని అని చెప్పినప్పుడు కళ్ళప్పగించి చూసాడు.

కొందరు రచయితలు వేశ్యావృత్తిలో ఉన్న యువతుల్ని వివాహం చేసుకొని ఉద్ధరించినట్టు రాస్తారు. మరి తన తల్లి వేశ్య అని విన్న రాహుల్ అలా అయ్యాడేం?

ఆలోచించుకోవడానికి టైం కావాలన్నాడు.

వారం తిరక్కుండానే ఒక విషనాగు కాటుకు తను గురి అయింది తన జీవితానికి గ్రహణం పట్టింది. ఊహ తెలిసినప్పటి నుంచీ జీవితంలో చేదునే రుచి చూసింది ప్రతి నిముషం తన మనస్సు జుగుప్సతో నిండిపోతూనే ఉండేది.

జుగుప్స కన్నతల్లిని చూస్తే జుగుప్స మానవజాతి అంటేనే ఒక విధమైన ఏవగింపు.

మనిషి బాధపడుతూ బతకడంకంటే, జుగుప్సను అనుభవిస్తూ బతకడం మహా దారుణమైన పరిస్థితి

ప్రతి మనిషి లోపల మరో మనిషి ఉన్నట్టు తనకు అనిపిస్తుంది. ప్రతి వ్యక్తి ముఖంమీద అసలు రూపం కన్పించకుండా మాస్కు తగిలించుకొని తిరుగుతున్నట్టే తనకు అనిపిస్తుంది తనచూపులు తీవ్రంగా ఉంటాయంటారు. తను ఎవర్నయినా చూస్తున్నప్పుడు, వాళ్ల ముఖంమీద తగిలించుకున్న మాస్కును చీల్చుకొని అంతరాంతరాల్లో ఉన్న అసలు రూపాన్ని చాలావరకు తనకు కన్పించినట్టే ఉంటుంది.

"అమ్మగారూ!" రిక్షావాడు రిక్షా ఆపాడు.

భావన ఈ లోకంలోకి వచ్చింది.

"ఆ చివర ఇల్లు— కొత్తగా సున్నం కొట్టిన గోడలు ఉన్నాయి అదే ఇల్లు" అన్నది.

రిక్షా ముందుకు కదిలింది

రిక్షా ఇంటిముందు ఆగింది.

రిక్షావాడికి రెండు రూపాయలు ఇచ్చింది

వాడు కదల్లేదు.

"ఇంకా ఏమిటి?"

"చాలా చుట్టు తిరిగానమ్మా!"

మరో రూపాయి తీసి అతని చేతిలో పెట్టి నిద్రపోతున్న స్రవంతిని భుజాన వేసుకొని లోపలకు నడిచింది. అది ఒక చిన్న పెంకుటిల్లు. రెండు భాగాలు. ఒక భాగంలో భావన అద్దెకు ఉంటున్నది. రెండు గదులూ, ఒక వంట ఇల్లు. ఇంటికి వెనక కొద్ది ఖాళీ స్థలం. రెండువాటాల వాళ్ళూ ఆ ఖాళీస్థలం వాడుకుంటారు.

దగ్గరగా వేసిఉన్న తలుపుల్ని తోసింది ఎదురుగా కన్పించిన దృశ్యాన్ని చూస్తూ గడపలోనే నిలబడిపోయింది.

తల్లిముందు బ్రాందీగ్లాసు ఉన్నది. ఎదురుగా పాపారావు కూర్చొని ఉన్నాడు.

"బాగున్నావా అమ్మా!" ఆప్యాయం ఉట్టిపడే కంఠంతో అడిగాడు పాపారావు.

భావన అతనికేసి ఏవగింపుగా చూసింది.

అమ్మట! అమ్మ!

ఎంత ఆత్మద్రోహం.

ఛండాలుడు!

"అలాగే నిల్చున్నావేం!" బాబాయి నీ సంగతి విని ఎంత బాధపడుతున్నాడో తెలుసా!" అన్నది తల్లి.

"పాప నిద్రపోతోందా!" అడిగాడు పాపారావు.

భావన విసురుగా లోపలకు వెళ్ళింది.

పాపారావూ, తల్లీ ఏదో మాట్లాడుకుంటున్నారు. స్రవంతిని నిద్ర లేపితే ఏడుస్తుంది అన్నం తినిపించినా పిల్లని లేపి అన్నంపెట్టే ఓపిక లేదు భావనకు. పక్కమీద పడుకోబెట్టింది. తను బట్టలు మార్చుకొని స్రవంతి పక్కనే పడుకుంది.

"అమ్మాయ్!" తల్లి పిలుపు.

భావన పలకలేదు.

"విన్నావే ఏమిటా నిర్లక్ష్యం!" అరిచింది తల్లి.

భావన విసురుగా లేచింది.

"ఏమిటి?" అన్నది వాళ్ల ఎదురుగా నిల్చుని విసుగ్గా.

"వంట చెయ్యవూ?"

"చెయ్యను. నాకు ఓపిక లేదు.

"అదేమిటే? బాబాయికి — రాకరాక వచ్చాడు. అన్నం పెట్టవా?"

"పర్వాలేదు. నేను వెళ్ళి హోటల్లో భోజనంచేసి, క్యారియర్లో మీ ఇద్దరికీ తెస్తాను. భావనా! క్యారియర్ ఇలా ఇవ్వు!" అన్నాడు పాపారావు.

"ఇవ్వే ఎందుకూ! అదే వంట చేస్తుంది" అన్నది గ్లాసు తాగేస్తూ.

"నేను వండనని చెప్పాను. అసలు నువ్వెందుకొచ్చావ్? ఆ సీసా తెచ్చింది నువ్వేనా!" పాపారావు కేసి కసిగా చూస్తూ అన్నది భావన.

"నీకు మరీ పెద్దా చిన్నా లేకుండా పోతుంది. ఇంటికొచ్చిన పెద్దమనిషిని ఇలాగేనా మర్యాద చేసేది?"

"హుం! పెద్దమనిషి, మీ ఇద్దరూ పెద్దమనుషులే!" నిరసనగా అన్నది భావన.

"తల్లిని పట్టుకొని ఆ వేం మాట లమ్మాయ్!" అన్నాడు పాపారావు.

"హుం తల్లి!" ఈసడించింది భావన.

"అది నన్ను తల్లిగా చూస్తున్నదా? దిక్కులేని ముండకు ఆశ్రయం ఇచ్చి ఇంత ముద్ద పడేస్తున్నట్టు, ఇంత తిండి పెడుతున్నది.

నన్ను అది అమ్మా అని పిలిచి ఎంత కాలం అయిందో తెలుసా? పైగా పేరు పెట్టి నాగమణి అంటుంది" అన్నది తల్లి నాగమణి.

భావనకు కోపం వచ్చింది. పెదవులు వణుకుతున్నాయి. ఇద్దర్నీ గొంతు పిసకాలనిపిస్తున్నది.

"దాన్ని ఎంత గారాబంగా పెంచానో నీకు తెలియదా?"

"అవును, పెంచావ్! చాలా గారాబంగా పెంచావ్! సిగ్గులేదూ అలా చెప్పడానికి?" అంటూ, ఇక అక్కడ ఎక్కువసేపు నిలబడలేనట్టు భావన తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది.

"అదీ దీని వరస! చూస్తున్నావుగా" అన్నది నాగమణి పాపారావు ముఖంలోకి చూస్తూ.

అతను మాట్లాడలేదు.

"నువ్వు లేకపోతే మేము ఏమైపోయేవాళ్లం? దానికి ఆ కృతజ్ఞత కూడా లేదు" అన్నది నాగమణి.

"ఇన్నిటికీ ఆ బిడ్డ ఎవరికి పుట్టింది?"

భావన తలుపులు తెరుచుకొని చిరుత పులిలా బయటికి దూకింది.

"నోరు మూయ్యండి. నా గురించి మీ ఇద్దరూ మరో మాట మాట్లాడితే ఇంట్లో

నుంచి బయటికి వెళతాను." భావన దాదాపు అరిచినట్టే అన్నది.

"వెళతావే! నువ్వు ఎప్పుడో ఆ పని చేస్తావని నాకు తెలుసు. నా కర్మ. ఆయన పోబట్టి నాకీ అవమానాలు."

"ఆయన గురించి తల్చుకునే అర్హత కూడా నీకు లేదు. ఆయన విన్నూ-పెంటకుప్పమీద పారేసిన చిరిగిపోయిన పుస్తకంలాంటి నిన్నూ- అపురూపంగా అందుకొని అందలం ఎక్కించాడు. మురికి పుస్తకాన్ని భగవద్గీతలా చూశాడు. నువ్వు చేసింది ఏమిటి? ఛీ! ఛీ! నీతో మాట్లాడటం అంటేనే నాకు అసహ్యం" అంటూ వచ్చినంత ఉసిగా లోపలకు వెళ్ళి తలుపు ధడాలున వేసుకుంది గడియ పెట్టుకుంది.

భావన మంచానికి అడ్డంగా పడుకుంది. దుఃఖం ఆగడంలేదు,

అలా ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే తెలియదు.

స్రవంతి ఏడుస్తూ లేచి కూర్చుంది.

భావన లేచి అలమారులో నుంచి బిస్కెట్లు తీసి పిల్లకు ఇచ్చింది. పాలు వెచ్చబెట్టి తాగించింది.

అప్పటికే తల్లి బాగా తాగేసి వళ్ళు తెలియకుండా నిద్రపోతున్నది.

పాపారావు గురక వినిపిస్తోంది.

భావన మనసు జుగుప్సతో నిండిపోయింది. ఎత్తి మంచంతో సహా అతన్ని రోడ్డుమీదకు విసిరిపారెయ్యాలన్నంత ఆవేశం కలుగుతోంది.

భావన మంచినీళ్ళు తాగి పడుకుంది.

నిద్రపట్టడం లేదు.

వీడు మళ్ళీ ఎందుకువచ్చాడు?

ఎన్ని రోజులు తిష్ట వేస్తాడు?

తన జీవితాన్ని నాశనంచేసినా కన్నతల్లిని బజారుపాలు చెయ్యలేకపోయింది. ఆమె ఉనికినే తను భరించలేదు. ఆమెను 'అమ్మా' అని పిలవలేదు. ఆమె కంఠం వినిపిస్తే తనకు చెవుల్లో వేడినూనె పోసినట్టు ఉండేది. అయినా భరిస్తున్నది.

ఎందుకని?

ఆమె తనను నవమాసాలూ మోసిన కన్నతల్లి కనుకనా?

భావనకు తండ్రి గుర్తొచ్చాడు.

ఆయనే ఉంటే? తనను వళ్ళోకూర్చోబెట్టుకొని "నా చిట్టితల్లిని డాక్టర్ని చేస్తాను" అనేవాడు.

అప్పుడు తన తల్లి కూడా తనను అపురూపంగా చూసుకొనేది.

తనకు పదేళ్లు వచ్చాయి. అకస్మాత్తుగా తండ్రి గుండె ఆగి చనిపోయాడు.

ఆ తర్వాత .... .... ...

## 14

శ్రీమన్నారాయణ కాంట్రాక్టులు చేసి డబ్బు బాగా సంపాదించాడు. అతను తల్లిదండ్రులు ఎంత చెప్పినా పెళ్ళి చేసుకోలేదు. అలాగని బ్రహ్మచారిగానూ లేడు. అనేకమంది ఆడవాళ్ళతో అతనికి సంబంధాలు ఉండేవి.

ఒకసారి పనిమీద కాకినాడ వెళ్ళాడు.

అతని స్నేహితుడు శ్రీమన్నారాయణను బరంపురం తీసుకెళ్ళాడు. నాగమణి ఇంటికి తీసుకెళ్ళాడు.

నాగమణి సౌందర్యానికి ముగ్ధుడై తనతో వచ్చెయ్యమని అడిగాడు. ఆమె వెంటనే అంగీకరించింది. నాగమణి వృత్తిచేత వేశ్య అయినా, ఆమెకు వివాహం చేసుకోవాలనీ, నలుగుర్లో గౌరవంగా బతకాలనీ కలలు కనేది. నాగమణి తల్లి పేరు పద్మాయి. ఆమెకు పిల్లలు లేరు. ఆసుపత్రినుంచి పిల్లను తెచ్చుకొని పెంచుకుంది.

నాగమణికి పద్నాలుగేళ్ళు వుండక మునుపే వృత్తిలోకి దించింది.

శ్రీమన్నారాయణ పదివేలు తల్లికిచ్చి నాగమణిని తెచ్చుకున్నాడు.

అతన్ని బంధువులంతా వెలివేశారు.

పల్లెటూరు వదిలి గుంటూరులో మేడ కొని నాగమణితో కాపురం పెట్టాడు.

నాగమణి ఎంతో ఒద్దికగా, మంచి గృహిణిగా మెలగసాగింది.

అతను నాగమణిని రిజిష్టరు మేరేజ్ చేసుకున్నాడు.

రెండేళ్ళకు భావన పుట్టింది.

భావన ఆ తల్లిదండ్రులకు కంటి పాపలా వుండేది.

శ్రీమన్నారాయణకు ఉన్న బలహీనతలు మాత్రం అలాగే ఉన్నాయి. తాగి క్లబ్బుల్లో అర్ధరాత్రిదాకా చీట్లపేక ఆడేవాడు. గుర్రపు పందాలకు మద్రాసూ, బెంగుళూరూ వెళ్ళేవాడు. నాగమణి ఇల్లు దాటి బయటికి వచ్చేది కాదు.

శ్రీమన్నారాయణ తను తాగుతూ అప్పుడప్పుడు సరదాకు భార్యచేత తాగించేవాడు. మొదట్లో ఆమె తాగడానికి ఇష్టపడేది కాదు. క్రమంగా ఆమెకూ అలవాటయింది. ఆ తర్వాత భర్త ఆమె చేత తాగుడు మాన్పించలేకపోయాడు.

అయినా ఆమెను పల్లెత్తుమాట అనే వాడు కాదు.

అతని ఆరోగ్యం క్షీణించింది. ఉన్నది ఖర్చుచెయ్యడం తప్ప, సంపాయించడం లేదు.

అప్పుడు భావనకు ఏడేళ్ళు.

ఒక రోజు రెండతస్తుల మేడ వదిలి చిన్న డాబా ఇంట్లో ప్రవేశించారు.

భావన చాలా రోజులు ఆ యింటికి వెళ్ళనని మారాం చేసేది. కష్టసుఖాలు తెలియని వయసు.

కార్లో స్కూలుకు వెళ్ళే భావన రిక్షాలో వెళ్ళనని కారు కావాలని కొంత కాలం మారాంచేసింది. పెరుగుతున్న పిల్ల, రకరకాల గౌనులు తొడుక్కున్న భావన మంచి బట్టలకోసం మారాంచేసి తల్లిచేత దెబ్బలు తినేది.

తండ్రి మాత్రం భావనను ఏనాడూ కొట్టలేదు. తండ్రి ఉండగా తల్లి కూడా కొట్టేది కాదు.

ఐదో క్లాసు చదువుతున్నప్పుడు తెల్లవారుఝామున తల్లి గోలగా ఏడవడం

విని భావన తృప్తిపడి నిద్రలేచింది.

తండ్రి శరీరం చాపమీద ఉన్నది. అతని కాళ్లమీద తల ఆనించి నాగమణి గోడుగోడున ఏడుస్తున్నది.

చుట్టూ జనం ఉన్నారు.

భావనకు కూడా ఏడుపు వచ్చింది. చావుబతుకుల మధ్యఉన్న భేదం అంతగా తెలియని వయసు.

శ్రీమన్నారాయణ చనిపోయాక అప్పులవాళ్లు ఇల్లు వేలం వేశారు.

కట్టుబట్టలతో కూతుర్ని తీసుకొని బయటికి వచ్చింది నాగమణి.

పాత గుంటూరులో చిన్న పాటా అద్దెకు తీసుకొని కూతుర్ని పెట్టుకొని కాలక్షేపం చేస్తున్నది. సంవత్సరం తిరక్కుండానే ఉన్న బంగారం కరిగి పోయింది. నాగమణికి రాత్రి అయేసరికి బ్రాందీ కావాలి. బ్రాందీ నాటుసారాలోకి దిగింది.

ఇల్లు గడవడమే కష్టంగా ఉన్నది.

ఒక రోజు నిద్ర లేచేసరికి ఒక మగ వాడు వంటింటి గడపలో కూర్చొని తల్లితో కబుర్లుచెప్పడం చూసింది భావన.

"ఇదేనా నీ కూతురు?"

"అవును। బాబాయికి నమస్కారం చెయ్యి తల్లీ।" అన్నది నాగమణి.

భావన నమస్కారం చేసింది.

అతను భావనను వళ్ళోకి లాక్కున్నాడు.

భావన "ఛీ। వదులు।" అంటూ విదిలించుకున్నది.

"అబ్బా! నీ కూతురు చాలా గట్టిదే!" అన్నాడు అతను.

నాగమణి నవ్వుతూ "మరి ఎవరిబిడ్డ!" అన్నది. కూతురికేసి గర్వంగాచూసింది.

నాగమణి చిన్నప్పుడు నాగమణి తల్లిని 'అప్పా! అప్పా!' అంటూ ఆ ఇంట్లోనే ఉండేవాడు.

ఆయనే పాపారావు.

నాగమణి భర్త పోయాడని తెలిసి చూడటానికి వచ్చాడు

"ఇంకా ఇక్కడేం చేస్తావ్? పద మన ఊరు వెళ్దాం?" అన్నాడు.

నాగమణి అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటే అలా చూస్తావ్?"

"మళ్ళీ ఆ మురికిలోకి రమ్మంటావా పాపారావ్!" బాధగా అన్నది నాగమణి.

పాపారావు అదోలా నవ్వాడు.

"నేను ఎక్కడికీ రాను. నా బిడ్డను చదివించుకుంటాను. నా బిడ్డకు ఆ మురికి అంటనివ్వను" అన్నది నాగమణి.

"సరే నీ ఇష్టం। నీకు నా అవసరం ఉన్నదనుకున్నప్పుడు ఒక కార్డుముక్క రాయి. రెక్కలు కట్టుకొని వాలిపోతాను" అన్నాడు.

నాగమణి "నీఅవసరం నాకుఉండదు. ఉండకూడదు" అన్నట్టు చూసింది

పాపారావు వెళ్ళిపోయాడు.

(సశేషం)




"...మీ అమ్మాయి మా అబ్బాయికి నచ్చలేదు కనుక తెలియజేయడమైనది..."

నాన్నగారో ఉత్తరం అక్కడ చదివి వినిపిస్తూంటే తలగడలో ముఖం దాచి నిశ్శబ్దంగా కన్నీళ్లు తుడుచుకుంటుంది నిర్మల.

పెళ్ళి చూపులపటం ముస్తాబు అవటం. ఆ తతంగం ముగిశాక వాళ్ళ దగ్గర్నుంచి వచ్చే ఉత్తరంకోసం ఎదురు చూస్తూ కాదనుకుంటూనే కమ్మని కలలు కానివ్వటం నిర్మలకు సర్వసాధారణమైపోయింది.

ఆమె తోటి ఆడపిల్లలు ఏదో ఒక హోదాల్లో ఇల్లాళ్లు అయిపోయారు కాని ఆ అదృష్టం ఆమెకి చేరువకావటం వట్టి ఊహగా మాత్రమే మిగిలిపోయింది.

మొదట్నుంచీ నిర్మలకి ఈ పెళ్ళి చూపులనేది ఒక ఫార్సు అయిపోయింది.

మొట్టమొదటిసారిగా కోటి ఆశలు మూటగట్టుకొని ముస్తాబై పెళ్ళివారి ముందుకు వెళ్ళింది నిర్మల.

సింపులైన అలంకరణతో వెళ్తే వారి కళ్ళకు ఆకర్షణీయంగా కనబడొచ్చునని

పట్టుచీర కట్టుకొని.... కుచ్చుల జడ వేసుకుని.... తలనిండా పూలు పెట్టుకుని వెళ్ళింది.

ఆ అలంకరణ మోటుగా గంగిరెద్దుని గుర్తుకు తెచ్చేదిలా వుందని మధ్యవర్తిగా వెళ్ళిన పెద్దమనిషి దగ్గర అన్నాడట ఆ పెళ్ళికొడుకు. ఆమె నచ్చక పోవటానికి అదో కారణం అయ్యింది. నిర్మల బాధపడింది. ఏమోలే తనా మరీ పల్లెటూరిదానిలా కనిపించిందేమో నను కుని సరిపెట్టుకుంది. పైగా లోకంలో ఇతనొక్కడేనా మగధీరుడని అహంకారంతో అంతగా దాన్ని పట్టించుకోకుండా మరచిపోయింది.

రెండోసారి పెళ్ళికూతురిగా ముస్తాబయ్యేటప్పుడు నిర్మల అంతకు పూర్వం అనుభవం గుర్తుండటంచేత నాజూగ్గా అలంకరించుకోవా లనుకుంది

ఇప్పుడున్న జారిపోయే అమెరికన్ జార్జెట్టు చీర కట్టుకుని.... రెండు జడలు వేసుకుని ఒక దానిలో గులాబీ తురుము కుంది.

పెళ్ళికొడుకు కాస్త మోడరన్ భావాలు వున్నవాడు.... అతను అమ్మాయిని ఏకాంతంగా ఇంటర్వ్యూ చేయాలనుకుంటున్నాడు అన్నారు.

ఆమాట ఆమెకు మరింత వూపిరి పోసి ఆశలు రేపింది. తను అతనికి తప్పకుండా నచ్చుతుందనుకుంది. ఎన్నో ఆలోచించుకుంది. ఎంతో ఊహించుకుంది.

తీరా అతని ముందు కూర్చోగానే అంతటి మోడరన్ భావాలున్నవాడు తనను గురించి చేసిన వ్యాఖ్యానం విన గానే నివ్వెరపోయింది.

ఆ చీరలోను.... ఆ అలంకరణలోనూ తను సంసారపక్షంగా లేదట. మరి.... అతని మాటల్లో అర్థం బోధపడగానే మనసు వికలమైపోయిం దామెకు.

ఏమిటి వీళ్ళ ఉద్దేశ్యం? ఏమిటి వీళ్ళ అంతర్యం? నిండుగా అలంకరించు కుంటే అమ్మవారిలా వున్నావనేనా అంటారు.... లేకా కొనసాగితే అతి హీనమైన బజారు మనిషితోనైనా పోలుస్తారు.

పోనీ ఏ అలంకరణా లేకుండా సాధారణంగా ఉన్నవాడు ఎడ్డిగా వున్నావనీ... ముష్టెత్తుకునే మొహంలా వుందనీ పేర్లు పెడతారు.

అంతే.... అతని ముందు నోరు మెదిపి మాట్లాడలేకపోయింది. అతనన్న మాటకు అభిమానం.... పౌరుషం ముంచుకురాగా క్రింద పెదవిని నెత్తురు వోడేలా కరిచిపెట్టి వుండిపోయింది. అయినా నిర్మలకు పెళ్ళిచూపులు అన గానే ఆశ చచ్చేది కాదు. ఎప్పటికైనా తనని మెచ్చేవాడు రాకపోతాడా అని వోపిగ్గా ప్రతీ పెళ్ళిచూపులకూ బొమ్మలా తయారయ్యి కూర్చునేది. నిర్మలకు ఒకటి తలుచుకున్నప్పుడు మాత్రం నవ్వొచ్చేది. బజార్లో షోకేసులో

పెట్టిన బొమ్మని చూసి ముచ్చట పడ్డవాళ్ళు ఆ బొమ్మకు ఇంత ఖరీదు చెల్లించి కొనుక్కుపోతారు.

చివరకు సంతలో అమ్ముడుపోయే పాడిపశువుకి కూడా ధర చెల్లించి కొలుక్కు పోతారు.

ఈ సమాజంలో ఆడదాని బ్రతుకే అయోమయంగా అవిపిస్తుందామెకు ఆ రెండింటితో పోల్చుకుంటే.

మగాడికి సేవలు చేస్తుంది మగాడి సుఖానికి కారణమౌతుంది మగాడి వలన తల్లయి అష్టకష్టాలు పడి పిల్లల్ని కని, పెంచి పెద్దచేస్తుంది అనుక్షణం మగాడి పాదాలదగ్గర బ్రతుకు వెళ్ళబోస్తుంది.

అలాంటి ఆడపిల్ల పెళ్ళిళ్ళ బజార్లో బొమ్మలానిలబడితే ఆబొమ్మను మెచ్చిన మగాడికి ఎదురు మూల్యం చెల్లించి అమ్ముడుపోవాలి.

ఆడదాని పాలిట పాపంగా మారిన ఈ సమాజం. . ఈ వివాహ వ్యవస్థ ఎన్నోసార్లు నిర్మల తిట్లకూ, శాపాలకు గురయ్యాయి. నిర్మల గుమ్మందగ్గర నిలబడి ఎదురుచూస్తోంది పోస్టుమేన్ కోసం.

అంతక్రితం నాలుగు రోజుల ముందు పదిహేనోసారి పెళ్ళికూతురిగా ఓ పెళ్ళి కొడుకు ముందు కూర్చుందామె. తల్లీ తండ్రీ, మరో ఇద్దరు పెద్దమనుష్యులూ ...నలుగురు అక్కచెల్లెళ్ళూ వెంటరాగా తరలివచ్చాడా అబ్బాయి ఆమెని చూసు కుందుకు.

నిర్మల తల్లి పార్వతమ్మ ఓపిగ్గా ఫలహారలు అమర్చి అడుగులకు మడుగు లొత్తుతూ వాళ్ళకు సకల మర్యాదలూ చేసింది.

తండ్రి ఇంక చెప్పక్కర్లేదు ఈ గుండెల మీద కుంపటి దించే దయార్ద్ర హృదయుడు అతనేమో నన్నంత ఆశతో వాళ్ళముందు వొంగి వొంగి . వొదిగి వొదిగి నిలబడ్డాడు. నిర్మల అంతకు ముందుసారి ఏ దేవతలనైనా . దేవుళ్ళనైనా మరిచిపోతే వాళ్ళని కూడా గుర్తుకుతెచ్చుకుని అందుకు అపరాధంగా చెంపలు వేసుకొని ఈసారైనా తనకీ కన్నెచెరనుంచి విముక్తి కలిగించమని మొక్కుకుంది.

కాని ఆమె నచ్చలేదు. వాళ్ళకి కూడా నచ్చలేదు.

నిర్మల కళ్ళు తుడుచుకుని గదిగుమ్మం దగ్గరకివచ్చి అస్పష్టంగా వినపడుతున్న తల్లితండ్రుల మాటలు వినడానికి ప్రయ త్నించసాగింది.

"ఏమండీ మరో అయిదొందలు ఇస్తే ఒప్పుకుంటారేమో !" - పార్వతమ్మ అంటోంది.

"మరో అయిదొందలా ? ఎక్కడ నుంచి తెస్తాం ? అయినా అందుకు ఆశపడతారంటావా !" తండ్రి అంటు న్నాడు.



'పదివేలకు కూడా తన బ్రతుకు మార్చటంలేదు'—నిర్మల మనసులో దిగులుగా అనుకుంది.

తను పూర్వజన్మలో ఏ పాపం చేసుంటుంది? వెయ్యి ఖూనీలు చేసుంటుందా?....లక్షలకు లక్షలు

దొంగతనాలు చేసుంటుందా? అంతకు మించిన హింసకు పాల్పడివుంటుందా? ఎంతటి ఘోరం చేయటంవలన తనకి ఆడపుట్టుక పుట్టి వుంటుంది?

గంటసేపు తర్జనభర్జన జరిగిన తర్వాత నిర్మల తండ్రి పెళ్ళివారి దగ్గరకు బేరసారాలకు వెళ్ళటానికి నిశ్చయమైంది. ఆయన వెళ్ళిన క్షణంనుంచి నిముషం కూడా శాంతిలేకుండా వాళ్ళ దగ్గర్నుంచి వచ్చే సమాధానం కోసం ఎదురుచూడసాగింది.

కుదిరితే బాగుండును—ఈ పెళ్ళయితే బాగుండును! పదేపదే అనుకుంది

ఆడపిల్లగా పుట్టడమే తప్పు అందులోనూ ఒక్క మగాడినీ ఆకర్షించలేని రూపవిహీనంగా పుట్టడం మరో శాపం!

'ఛీ ఛీ' అనుకుంది తనని తాను నిందించుకుంటూ ఆమె.

"ఏమిటా ఆ తెలికటం? నాలుగు మెతుకులు తినకపోతే చిక్కిపోవూ?" అని భోజనం దగ్గర తల్లి అన్నప్పుడు ఆవిడ ఆప్యాయతకూ-ప్రేమకూ నిర్మల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కూతురుకళ్ళల్లో నీళ్ళు చూసి ఆవిడ-"ఛ.. ఎందుకా కన్నీళ్ళు పిచ్చితల్లీ నాన్నగారు వెళ్ళారుగా? మా ట్లాడి వస్తారు ఈ సంబంధం తప్పకుండా ఖాయమౌతుంది" అంటూ ధైర్యంచెప్తూ కూతుర్ని వూరడించిం దావిడ.

ఆ మాటలకు మరింత ద్రవించి పోయింది నిర్మలమనసు. తను కొడుకై పుట్టివుంటే ఎంత బాగుండును?...వాళ్ళకి ఏసమస్యలూ లేకుండా హాయిగా వుండును కదా?

కూతురై పుట్టి. అందులోనూ అనాకారి కూతురై పుట్టి వాళ్ళ నెంత అరడి పెడ్తోంది...ఎంతభారమై బాధ పెడుతోంది.

అయినా ఆ బాధనీ-తన పట్ల ఉన్న బెంగనీ బయటపెట్టకుండా ఎంత అభిమానం చూపిస్తున్నారు?

నిర్మల తన దురదృష్టానికి నుదురు బాదుకుంది

కూతుర్ని చూస్తూ ఆవిడ కూడా కన్నీళ్ళు దాచుకోలేకపోయింది. రెండ్రోజుల తర్వాత తండ్రి రావటంతో ఆయన ఏం కబురు తెచ్చుంటాడో అని అతృతగా ఎదురుచూడసాగింది నిర్మల.

తండ్రి వచ్చిన అరగంట వరకు మాట్లాడకపోవటం-

తల్లి ఆ తర్వాత బరువుగా నిట్టూరుస్తూ తనవైపు జాలిగా చూసిన చూపు నిర్మలకు ఫలితాన్ని విడమర్చి చెప్పేశాయి.

నిర్మలకు ఆరోజు కంటిమీద కునుకు లేకుండా పోయింది. ఏమిటి తన బ్రతుకు? ఎన్నాళ్ళు తనిలా అదృష్టం కోసం ఎదురుచూస్తూ కూర్చోటం?

భగవంతుడు ఎవర్నీ వంటరిగా ఈ లోకంలోకి పంపడనీ ఎక్కడో అక్కడ

ఒక జంటని కుదుర్చి వుంచుతారని అంటారు.

మరి తనకోసం కుదిర్చిన ఆ మనిషి ఎన్నాళ్ళకు తారసపడతాడు? ఎన్నేళ్ళకు తననీ వంటరితనం నుంచి తప్పిస్తాడు? అసలా అదృష్టం వుందా తనకి!

నిర్మలకు మరో సంబంధం వచ్చింది.

వాళ్ళకి కూడా నచ్చలేదని ఉత్తరం వచ్చింది. అయిపోయింది. తనిక ఎవరికీ నచ్చదు. తన కిక కల్యాణ యోగం లేదులా వుంది

ఆమెకు అంతులేని నిరుత్సాహం వచ్చింది.

తన అదృష్టంమీద ఆమెకు నమ్మకం పోయింది. దానికి తోడు ఆమె స్నేహితురాలు ఒకరోజు హాస్యానికి అన్నమాట నిర్మల హృదయాన్ని తీవ్రంగా గాయపర్చింది.

నిర్మల చూడటానికి వచ్చిన ఆ స్నేహితురాలు పెళ్ళి ప్రస్తావన రాగా-"పోన్లేవే నా కూతురి పెళ్ళి నీ పెళ్ళి ఒకేమాటు జరుగుతుంది ఏం బాధపడకు" అంది.

ఆ స్నేహితురాలు నిర్మల ఈడుదే... ఆమెకు చాలా తొందరగా పెళ్ళయిపోయింది. ఒక కూతురు కూడా.

నిర్మల ఆ మాటలకు చాలా కలవరపడిపోయింది ఆ మాటల్లో ఆమె కిక పెళ్ళవ్వదనే అర్థం స్ఫురించింది. అందుకోసం ఎదురుచూడటం కూడా వ్యర్థమని హేళనగా అన్నట్లు అనిపించిందామెకు.

పెళ్ళికాని కన్నెగా ఉండి తన తల్లి తండ్రుల బాధలకు ఎందుకు కారణం అవ్వాలి!

తొమ్మిది మాసాలు తనని మోసి కన్న తల్లిని ఇంకా ఎందుకు కష్టపెట్టాలి?

ఇరవైతొమ్మిది సంవత్సరాలు తన కోసం శ్రమపడిన తండ్రిని మానసికంగా ఎందుకు బాధపెట్టాలి? నిర్మలకు బ్రతుకంటే అంతులేని విరక్తిపుట్టింది. ఆమెక జీవితంమీద ఆశ చచ్చిపోయింది.

ఉత్తరాల కోసం ఎదురుచూడటం ఆమెకు విసుగుపుట్టించింది ఆ ఉత్తరాల్లో తనకి కావల్సిన జవాబు రాదు. తన బ్రతుక్కి అర్థంచెప్పే ఉత్తరాలు రావు

నిర్మల సమాజాన్ని తిట్టుకుంది. సమాజంలో ఉన్న మగపిల్లల్ని మరో జన్మ వుంటే ఆడపిల్ల లుగాపుట్టండని శపించింది. ఒక ఆడపిల్లని జంటలేకుండా పుట్టించిన భగవంతుని దూషించింది.

తనపట్ల అంతులేని సహనం-అనంతమైన ఓర్పు చూపించే తల్లితండ్రులకు మనసులో నమస్కరించుకుంది.

ఆ రాత్రి అర్ధరాత్రి అందరూ గాఢనిద్రలో వుండగా నిర్మల తన గదిలో దూలానికి చీరకొంగుతో ఉరేసుకుని కన్నె బ్రతుకుని ముగించుకుంది.

కాని-తర్వాత రోజు ఉత్తరం వచ్చింది అంతకు ముందె ఆమె నచ్చలేదంటూ ఉత్తరం రాసిన పెళ్ళివారు ఆమెని చేసుకోటానికి ఇష్టపడుతూ [illegible] ఉత్తరం రాశారు!




**వాన**

టపటమని చెప్పాపెట్టకుండా వచ్చి పడింది 'మాయదారి కాలం! వానలు వానాకాలంల పడ్తలేవు, ఎండాకాలం మట్టుకు ఎన్నడూ ఎరుగని ఎండలు. 'ఏందయ్యా ఈ కాలం?' అని అడిగితే ఆ సదువుకున్న పంతులేమో 'అడవులు నరికితే యింతే' అంటడు. దానికీ వానకీ ఏంది సుట్టరికం? —ఏందో— మా పక్కింటి అమ్మమ్మ మట్టుకు ఊర్కె 'కలికాలం—కలికాలం' అని గొణుక్కుంట కూసుంటది.

వాన జలజలమని అల్లరి చేస్తుంది.

వానల తడిసిపోయిన రవిక గిలిగిలి పెడ్తుంది. సీరా, రవికా యిప్పేసి సిన్నప్పటి లాగా వానల గెంతులు పెట్టాలనిపిస్తుంది. ఈ కూలిపోతున్న యింటిల నిలబడితే తప్పు కూల్తదేమో నని బయంబయం గుంది.

ఊరి బయట వున్న పువ్వోళ్ళ బాయి కాడ నీళ్ళు తెచ్చుకుందమని కుండతో వస్తే ఈడ నిలబడాల్సి వచ్చె.

జుయ్యిమని గాలి ఈసింది

గాలికి వూగిన వాన తెర మా వూరి

'సారాపంచు' బిడ్డ కట్టే మెత్తని పంచ
నని సీరలాగుంది. అందరూ సర్పంచు
అంటే పంతులేమో అయన్ని 'సారా
పంచు' అంటడు. ఒకొక్కొక్కసారి మారి
'సర్పం—గు' అంటడు.

ఏందో. ఎన్ని సార్లు జెప్పిన
అయనకే ఓటు ఏస్తిని. పరి ఓటేసి
నందుకు ఐదురూపాలు సేతిలో పెట్టిండు
గద. మీదికెళ్లి అయనే మా కులపెద్ద.
ఊళ్ళ మా కులపోళ్ళే ఎక్కువ
కాబట్టి అయనే సారాపంచు-అయన్దే
యాపారం. అయనే మా బ్రామ్మసాల
కులపెద్ద.

వాన తగ్గేట్టు కనపడ్తలేదు.

దూరంగ వున్న కొండ మసక
మసకగ కనపడ్తంది. ఆ కొండమీద
నుంచే సూరీడు దిగి అవతలి ఒడ్డుకి
పోతడు. ఇంకో రెండు జాములైతే
సీకటి పడతది. ఎట్టనో మరి- ఇయ్యా
ల్టికి తాగ నీళ్ళులేకుంటే ఆయె. ఉన్న
సీళ్ళతో గడపొచ్చు గాని ఇంటికి
పొయ్యేదెట్ట-

వాన- వాన-

వానపడితే మనయ్య యాదికొస్తడు.
అదు యాదికొస్తే చాలు ఒళ్ళంత ఝల్లు
మంటది. అది మాటలు ఎండిపోయి
బీడలువారిన పొలంల పడే వానసినుకులు,
వానసినుకుల్లాంటి సక్కిలిగింతలు అది
సూపులు వానసినుకుల్లాంటి సూదులు.

అద్ని సూసినప్పుడల్లా మల్లి మల్లి
అది వంకనే సూడాలని మనసు, కాని
సూడటం తప్పని సరిపెట్టుకుంట.

మరాదికి పెళ్ళయింది గదా?

అది కద్దను పిల్లలున్నారు గదా?

అది పెళ్ళాం బంగరు బొమ్మలా
గుంటది గదా?

కాని—ఎంగకో అద్నే సూడాలని
అనిపిస్తది మనసుకి. ఎవరూ పిలవా
పెట్టకుండానే సూరీడు తూర్పుకొండ
మీది కొచ్చినట్లు-ఊకే అదే మనసు
లోకి ఒచ్చి కూకుంటది. అదు నా ఎంక
సూత్తేనే సిగ్గు కమ్ముకొచ్చేస్తది.

ఈ ధిబాగోతంలో అప్పుదెవడో
చెప్పినట్టు ఎనక జలమలుంటయ్యేమో.
అప్పుడు అదే నా మొగుడేమో!

సంబడమే- ఈ మాట ఎవరేనా
యింటే నవ్వుతరు.

అయినా మనసుకి నచ్చిన మొగోడ్ని
సేసుకుంటానికూడా ఈ లోకంలో
ఈల్లేదు. అపుడెపుడో కిష్టయ్యని సత్తె
బామ ప్రేమించి మనువాడిందట. నే
నిప్పుడు మనయ్యను సేసుకుంటనని
అంటే అది పెళ్ళాం ఊకుంటదా?
-మా అన్న ఊకుంటడా?

కాని అడంటే నా కెందుకంత ఇది?
ఏమో?- సినిమాల్లో నేన్సూసిన ఈరో
ల్లాగా ఉంటడా? అట్లనే వుంటడు-
కాకీ పొక్కా పంట్లాం లేవు. అంతే.
ఈరోలాగనే కోఅమీస ముంది. పెద్ద
కళ్ళున్నాయి. రాయిలాంటి ఒళ్ళుంది.

ఎన్నెల్లాంటి మాటలున్నయి. ఒకరు బాదపడితెసూడలేని మనసుంది. (ఉందా?)

అందుకే అవంటే నాకు సానా సావా.

'ఇయ్యాళ్రేపు ఆడపిల్లల్ని సినిమాలు సెడగొడ్తన్నయి. ఆళ్ళకు ఎదుటి మడిసిని తెలుసుకునే గుణమే లేదు. రాబోయే మొగుడి గురించి సరైన గ్యానమే లేదు. అదే ఒంపెద్ద సోకడ' అంటడు పంతులు.

ఏమో పంతులు మాటలు నా కర్థం కావు. కాని నేను గడిగడికి పక్కనున్న పట్నమెల్లి సినిమాలు సూసేది మాత్రం నిజం.

మనయ్యాను మనువాడితే—?

'ఓస్. ఊకోవే. నీకు మెదడు లేదు' అంది మనసు.

వాన తగ్గుముకం పట్టింది.

ఆ పాడుబడిన ఇల్లొదిలి బయటి కొచ్చిన.

ఇల్లు వద్దనే వుంది.

'ఏందే పిల్లా నువ్వీడ నిలబడ్డవని వానలి తడుసుకుంట ఈడదాక వస్తే నువ్వేమో పోతన్నవు?'

ఝల్లుమంది గుండె. సేతిలోని కుండ కిందపడి ముక్కలైంది.

ఎనక్కి తిరిగి సూడకుండనే సెప్పొచ్చు. ఆ గొంతు మనయ్యాదే. నా గుండెలు రైలుబండిలాగ నడిసి గొంతుకలోకి వచ్చి ఆగింది.

'అరెరె—' అని అడు ముందుకొచ్చిండు 'కుండ పగిలిపోయె' అని నా కళ్ళలోకి సూసిండు. నా కళ్ళు వాలిపోయినయి. అడు నా సెయ్యి పట్టుకున్నడు. అంత వానల సెమటలు పట్టినయి. ఒళ్ళంత నా సేతిల లేకుండ అయింది. ఎట్ల నడిసినో ఏమో— తెల్వది. అడె నడిపించిండు నా సెయ్యి పట్టుకుని. సల్ల ఆ పాడుబడ్డ యింటిలోకి వచ్చిన.

మనయ్యా ఊపిరి నా మొకం వెచ్చగ తగుల్తుంది. నా గుండెలు ఎగసెగసి పడ్తన్నయి.

నా నడుం సుట్టు మనయ్యా సేతు లున్నయి.

నాకేం ఎరికలేకుండ పోయింది.

కాని ఎటుక్కున విదిలేసింది మనయ్యని. పులి వాసన పసిగట్టిన జింకలాగ పరుగెత్తిన. ఎనక్కి తిరిగి సూడకుండ వానలో తడుసుకుంటూ పరుగెత్తిన.

ఒక్కమారే ఐదురల తెల్లి తేసి నట్టఇంది నాకు. ఊపిరి బరువుగ వస్తుంది. కళ్ళు పూరాగ విచ్చుకొని మరీ సూసిన.

మా అన్న నాకు నాలుగడుగుల దూరంల వున్నడు.

ఏ మర్థంకాలే. అది ఎంకనే ఎర్రిది సూసినట్లు సూసిన.

అడు రెండడుగులేసి నా సెంప మీదికెల్లి ఒక్కటే దెబ్బ కొట్టిండు.

కొరడా దెబ్బలాగ తగిలింది. కళ్ళ



బైర్లు కమ్మినయి. కింద పడేదుండె కాని గోడ తగిలి నిలబడిపోయిన.

సినిమా ఊరో సాన దూరంపోయిండు.

రెండు ఛనాలయితే నా ఊపు బద్దలై పోతది.

'నా కెరికలే_ అడ్డేదో అన్నడు. అడ్ని నేనే కొట్టేదుండె' అనేసిన ఒణుకుతున్న గొంతుతో.

'నువ్వింటికి నడువు_'

నడిసిన_ కాగ నీళ్ళు లేకుంటే మాయె_ నడవాలె, నడవాలె. జల్లులేదు, ఏంలేదు_ వానసినుకుల్లోనే నడిసిన_

బురదలోనుంచి నడిసిన- నా కాళ్ళకింద వున్న భూమిలాగనే వున్న మనసుతో నడిసిన- ఇంటిదాక ఒణుకుతున్న గుండెల్తో నడిసిన.

నా కెరికనే. మా అన్న యియ్యాల పంచాయితి పెడ్తడు.

ఊళ్ళె పెద్ద రాగిసెట్టు కాడ కుల పోళ్ళంత జమ అయితరు. పంచాయితి పెడ్తరు. పంచాయితి- పంచాయితి- ఎవరిది తప్పయితే అళ్ళకు జరిమాన ఏస్తరు. ఆ జరిమానతో జల్సా పేస్తరు.

బగమంతుడా- నా కిష్టమైన మొగోణ్ని ఎంచుకొనే అదికారం లేకుండ పేసినవు. ఇష్టమైనోడు కాకున్న ఎవడికో ఒకడికి ఎదురు పైసలిచ్చి అమ్ముడుపోయే ఆడజాతిల పుట్టించినవు నా కిష్టమైనోడెవడైన ఉంది అడికి పెళ్ళయితే నేను తన్నెత్తి సూట్టానికి లేదు. అడు నా కులం కాకుంటే మరింత సెప్పటాని కూడ లేదు.

మనువాడినంక మగడు పసువని తెలిత్తె వదలటానికి లేదు.

మనువాడాల్నంటే- పైస కావాల, మనువాడినోడిని వదలాల్నంటే- దాని కూడ పైస కావాల. అసలు మా కాడ పైసవుంటే పంచాయతి వుండదు. పైసలు బాగున్నోడిని పంచాయితికి కూసోమని అడగాల్నంటే ఎవరికేనా దమ్ములుండాల,

ఇ టికి పేరేలోపల నాకు సిత్రమైన దయిర్నం వొచ్చింది ఎక్కడేమన్న ఎవరన్న మాట్లాడితే మనయ్యానే మమ వాడ్తనని సెప్త.

ఏమన్న కానీ—

సీకటిపడింది-

సిమ్మసీకటి-సుక్కలు లేని సీకటి-ఆకాసం నిండ మబ్బులు సీకట్ని మరింత సిక్కగా పేసినయి.

మా అన్న తిన్నగ కులపెద్దలకాడికే పోయిండు. ఆడేం సెప్తడో నాకు ఎరికనే. మన్నయ్య మా సెల్లె పెయ్యి పట్టిండు. మా పెల్లి అరిపేసరికి వదిలి పరుగెత్తిండు నేను సూసిన అనిసెప్తడు.

ఇట్ల తలుసుకున్నంక నాకు నవ్వొచ్చింది

కులపెద్దలు నన్నడిగితే ఏం సెప్పాల? తప్పు నాదే అని సెపాల్నా? రెండు పేతులు కలిత్తె నేకదా సప్పట్లు. నాకూడ యిష్టమేనని సెప్పాల్నా?

మా అన్న పుర్రెల ఏమున్నదో నా కెరికనే. మా అన్నకు మనయ్య పెల్లెలిమీద మనసు. —అది నీలమ్మ పొగరుమోతు ముండ దానికి మా అన్నను సూత్తెనే అరికాలి మంట నెత్తిమీద కెక్కుతుంది. మా అన్న అగ్గిరాముడే అయితడు.

ఇప్పుడు సందు దొరికింది —ఏం పేస్తడంటే కులపోళ్ళకు పురెక్కిస్తడు. అసలు మనయ్య మా కులం కాకపోతే ఏం పేసెటోడో?

ఆసలే వాన ..ది. నేలంత సిత్తడి.

మా కులపెద్దల మనసులు గూడ సిత్తడి సిత్తడి అయితుంటయి. ఆ సిత్తడిమీద ఎచ్చగా మందుపడాల. మందుపడాల్నంటే యింతోటి పంచాయతిఒక్కటైనాఉండాల.

చప్-పాకువూరు.

వూర్నని ఏం లాబం?

ఎన్నో ఏళ్ళ కాడికెల్లి వస్తున్న పద్ధతి వనాలగావి.

అంతోయింతో మా అన్న మంట రాజేస్తడు. అది సిన్నికి సిన్నికి సిటపటలాడి పెద్దగయితది. మంట రాజేయల్నంటే ఇద్దరు ముగ్గురికి మందు కొట్టించాల-కొట్టిస్తడు. అందర్ని ఉచకాయించాల-ఉచకాయిస్తడు.

పెద్ద రాగిసెట్టు జడలు యిరబోసుకున్న దయ్యంలాగ నిలబడింది. సివమెత్తిన అమ్మోరిలాగ ఊగుతున్నది.

నాకు మా అమ్మ నాన్న లేరు. గుడిసెల నేనూ, మా అన్న యిద్దరమే.

మల్ల గుడిసెకాడికొచ్చి మా అన్న నన్ను పిల్సుకపోయిండు రాగిసెట్టుకాడికి.

అలోసనలన్ని వానపడితే అణిగి పోయిన దుమ్ములాగ అయినయి.

కులపోళ్ళంత సెట్టుకాడ జమ అయింద్రు. సానమంది మందు మీదనే ఉన్నారు. సుట్టలు కాలుస్తన్నరు. ఎక సెకాలాడ్తన్నరు. అంతమంది ముంగల నిలబడితే గుండె దిగజారిపోయింది. బేజారు బేజారుగ వుంది. అంత తడి లోనూ నోట్ల తడారిపోయింది.

మా పెద్ద బుడ్రమీసాల్తో నా వంక సూసింది. ఆయన మాట్లాడినా ఆ మీసాల్లోనే మాట్లాడ్తడు. మీసం మెలేసిండు.

'ఏంటే పిల్లా! మనయ్య విన్ను ఊరి బయట పాకుపడ్డ గొంపకాడ నీ సెయ్యి పట్టుకున్నాడే-' అని అడిగిండు.

తలెత్తిసూసిన. అది తప్పులేదని పెద్ద మనుకున్న. నే విచ్చిన అలుసుతోనే ఆడు నా దగ్గరి కొచ్చిండని సెప్పాలనుకున్న. కాని దయిర్నం సాలలే.

కాకి తలూపిన-అంతనే.

'నువ్వేమన్న అన్నావే?' మల్ల అడిగిండు.

'నేను—'

మా అన్న అందుకున్నాడు. 'అది అరిసింది మావా! నేనే యింతలో—'

'నువ్వు నోర్ముయ్యాల్! నే నడుగు తంది నీ సెల్లిని. అది సెప్తది'

'అరిసిన—'

'పోయి ఇంగ ఆ దొంగెదవని ఈడికి ఈడుసుకుని తీసుకురండెహె-పిల్లా! నువ్వు గూడ అళ్ళతోటి ఎల్లి ఆడ్ని పట్కరావే.' అని హుకుం జారీచేసిండు బుడ్రమీసాలు.

నే నెట్ల నడిసిన్నో నాకు యాదికిలేదు.

నా ఎనకాల గుంపు-

నా పక్కన గుంపు-

గుంపుల వున్నగని నేనొక్కదాన్నే-

గుంపుల ఆడోళ్ళు గూడ వున్నరు గని నేనొక్కదాన్నే-

మా కులపెద్దల మనసులు గూడ సిత్తడి సిత్తడి అయితుంటయి. ఆ సిత్తడిమీద ఎచ్చగా మందుపడాల. మందుపడాల్నంటే యింకోటి పంచాయతిఒక్కటైనాఉండాల.

చప్-పాడువూరు.

వూర్కని ఏం లాబం?

ఎన్నో ఏళ్ళ కాడికెల్లి వస్తున్న పద్ధతి వనాలగావి.

అంతోయింతో మా అన్న మంట రాజేస్తడు. అది సినికి సినికి సిటపటలాడి పెద్దగయితది. మంట రాజేయల్నంటే ఇద్దరు ముగ్గురికి మందు కొట్టించాల- కొట్టిస్తడు. అందర్ని ఉచకాయించాల- ఉచకాయిస్తడు.

పెద్ద రాగిసెట్టు జడలు యిరబోసుకున్న దయ్యంలాగ నిలబడింది. సివమెత్తిన అమ్మోరిలాగ ఊగుతున్నది.

నాకు మా అమ్మ నాన్న లేరు. గుడిసెల నేనూ, మా అన్న యిద్దరమే.

మల్ల గుడిసెకాడికొచ్చి మా అన్న నన్ను పిల్సుకపోయిండు రాగిసెట్టుకాడికి.

ఆలోసనలన్ని వానపడితే అణగిపోయిన దుమ్ములాగ అయినయి.

కులపోళ్ళంత సెట్టుకాడ జమ అయింద్రు. సానమంది మందు మీదనే ఉన్నారు సుట్టలు కాలుస్తన్నరు. ఎకపెకాలాడ్తన్నరు. అంతమంది ముంగల నిలబడితే గుండె దిగజారిపోయింది. బేజారు బేజారుగ వుంది. అంత తడిలోనూ నోట్ల తడారిపోయింది.

మా పెద్ద బుర్రమీసాల్తా నా వంక సూసిండు. ఆయన మాట్లాడినా ఆ మీసాల్తోనే మాట్లాడ్తడు. మీసం మెలేసిండు.

'ఏంతే పిల్లా! మనయ్య నిన్ను ఊరి బయట పాడుపడ్డ గొంపకాడ నీ సెయ్యి పట్టుకున్నాడే-' అని అడిగిండు.

కలెత్తిసూసిన. అది తప్పులేదని సెప్పదమనుకున్న. నే నిచ్చిన అలుసుతోనే ఆడు నా దగ్గరి కొచ్చిండని సెప్పాలనుకున్న. కాని దయిర్నం సాలలే.

కాశీ తలూపిన-అంతనే.

'నువ్వేమన్న అన్నావే?' మల్ల అడిగిండు.

'నేను—'

మా అన్న అందుకున్నాడు. 'అది జరిసింది మావా! నేనే యింతలో—'

'నువ్వ నోర్మూస్కోవ్! నే నడుగుతుంది నీ సెల్లిని. అది సెప్తది'

'జరిసిన—'

'పోయి ఇంగ ఆ దొంగెదవని ఇటికి కుడుసుకుని తీసుకురండె హో-పిల్లా! నువ్వు గూడ అక్కకోటి ఎల్లి ఆడ్ని పట్కరావే-' అని హుకుం జారీచేసింది బుర్రమీసాలు.

నే నెట్ల నడిసిన్నో నాకు యాదికిలేదు.

నా ఎనకాల గుంపు-

నా పక్కన గుంపు-

గుంపుల వున్నగని నేనొక్కదాన్నే-

గుంపుల అందోళ్ళుకాడ వున్నరు గని నేనొక్కదాన్నే-

ఒంటరిని.

నడుస్తున్నట్లనిపిస్తన్నది.

నా ఎనక అన్న మాట్లాడ్తంద్రు.

నా పక్కన అన్న మాట్లాడ్తంద్రు.

ఏయి బుర్రకెక్కతలేవు.

మనయ్య గుడిసెకాడ ఆగినం.

ఆది పెళ్ళం గుడిసెల నుండి బయటి కొచ్చింది.

అది నాకంటే బాగుంటది. నా కెరికనే.

కాని దాని మొకం ఎలఎలబోతున్న చందమామ లాగుంది. గుంపుని సూసి తొత్తరపడతంది. దాని సెయ్యి పట్టు కొని దాని అయిదేళ్ళబిడ్డ ఏడుపు లంకించు కుంది.

దాని ఎనకాల్నే నిలబడివుంది మనయ్య సెల్లెలు, నీలమ్మ.

ఒదినని పక్కకి జరిపి ముంగల కొచ్చి నిలబడింది.

'ఏంది? ఎందుకొచ్చింద్రు?'

మా అన్న అన్నడు 'మనయ్య కావాల.'

'ఎందుకు?'

'ఎందుకంటవేందే దొంగముండా! పక్కకు తప్పుకోవే-నీయక్క- అడు నా సెల్లె సెయ్యి పట్టుకుంటాడే?'

'నీ సెల్లెనే అడ్డి రమ్మన్నదేమో- ఎవడి కెరుక?'

'నీయక్క-' అని రంకెపెట్టి ఒక్క టందుకున్నడు మా అన్న.

ఆ దెబ్బకి అది కెవ్వున కెకపెట్టింది

ఆ దెబ్బకి అది దూరంగ బోయి బురదల పడ్డది.

'ఓలమ్మో-' అని అళ్ళ ఒదిన నీలమ్మ కాడికి పరుగెత్తింది.

'అమ్మో-' అని అరుస్త దాని బిడ్డ కూడ దాని ఎనకాలనే అత్తకాడికి బోయింది.

అన్న గుడిసెలోకి బోయిండు. కొంత గుంపుకూడ అది ఎంట లోనకెల్లింది.

నీలమ్మ నావంక మండుతున్న కళ్ళ తోటి సూసింది.

మనయ్య లేనట్టుంది. అన్న బయటి కొచ్చిండు.

నీలమ్మ, మనయ్య పెళ్ళం కలసి నన్ను బూతులు తిడ్తన్నరు.

మాఅన్న కర్రలేపి అడిగాడు 'ఎక్కడికి బోయిండే నీ అన్న?'

'నీకు దొరుకుతడా అడు-' అని మల్ల తిట్లు మొదలేసింది నీలమ్మ.

అగో-అ మాటనే తప్పు చేసింది నీలమ్మ.

'అయితే నీ కెరికనే మీ అన్న ఏం జేసిండో-మీ అన్నను నువ్వే పరుగెత్తి కొనిపోయి ఏడనన్న దాగుకొమ్మని సెప్పివుంటవే-రాయే-రా! నిన్ను పట్టు కుని సెట్టుకు కట్టేస్తేగాని నిజం బయట పడదు. అప్పుడుగాని అడు ఏడవున్నడో తెలియదు.' అని మా అన్న నీలమ్మ జుత్తు పట్టుకున్నడు.

'వదులు-ఎద్దుమొహమా-' అని గింజు కున్నది నీలమ్మ-అడ్డి రక్కబోయింది

నీలమ్మ-కాళ్ళా సేతులు తన్నుకున్నది నీలమ్మ. అయినగాని మా అన్న ఒదిలి పెట్టలే.

గుంపుల అందరు 'గుంజుకరా దొంగ ముండని' అని అన్నరు.

అంతనే-పూనకం ఒచ్చినోనిలాగ దాని పట్టుకుని రాగిసెట్టుకాడికి బురదలో కెల్లి బరబర గుంజుకుంట, తన్నుకుంట లాక్కొని ఒచ్చిండు మా అన్న-

పస్-అద్ని మా అన్నని పిలవలేను-

మనయ్య సేసిన తప్పుకి నీలమ్మను లాక్కొని రావటానికి ఎవరికేం అధికారం వుంది? రజాకారోళ్ళు-పోలీసోళ్ళు యిట్ల సేత్తరని మా యింటి పక్క-వుండే అవ్వమ్మ కతలు సెప్పింది తప్పొకరి దయితే దానికి అం-దర్ని తంతరని సెప్పింది. కాని మా అన్నలాటోడు కూడ యిట్లనే సేత్తడని నాకు ఎరికైంది. అదు సేసినంక రజాకారోళ్ళయితేనేంది-పోలీసోళ్ళయితేనేంది-ఇంకెవరైతేనేంది-ఇట్లనే సేసివుంటరు-ఇట్లనే సేత్తరు.

రజాకారోళ్ళు-పోలీసోళ్ళు-కులపోళ్ళు-డబ్బులున్నోళ్ళు-అంత ఒక్క మూసల కెల్లి ఒచ్చిండ్రు.

తప్పెవరిది? సిచ్చెవరికి?

మా కులపెద్ద బుర్రమీసాలు సారా కాయ ఒక పట్టు పట్టినయి.

'అయితే పిల్లా-మనయ్య ఎటు పోయిందో నీకు ఎరికనే గాదే?'

'ఎరికనే-'

పిచ్చిముండ! ఎందుకే - ఎందుకట్లంటవే? మీ అన్న సినిమా ఈరో అనుకున్న గాని అదు ఆడబిడ్డ ఎదవ-పంచాయతి పెత్తరని పారిపోయిండు. నువ్వేమో దయిర్నంగ నిలబడి మీ అన్నది తప్పుకాదని సెప్పటానికి తెగించినవు?

'మా అన్నదేం తప్పు? తప్పంతా అది సెల్లెదే-' అని గాండ్రించింది నీలమ్మ.

'ఊకోవే- నీలిముండా! ఇంతమంది పెద్దలమున్నం. మాకెరికే ఎవ్వరిది తప్పో ఎవ్వరిది కాదో- అదేదో మేము సెప్పాలె. నువ్వినాలె. అంతేగాని నువ్వన్నదే తప్పయితే మరి మేమంత ఎందుకే'

'గాడుదుల గాసెటందుకు' కాండ్రించి ఉమ్మింది నీలమ్మ.

బుర్రమీసాలు లేసి నిలబడినయి. ఆకాసం భళ్ళుమని ఉరిమింది.

'ఒరేయ్-దీన్ని సెట్టుకి కట్టెయ్యండ్రా'

మా అన్న నీలమ్మను జుత్తు పట్టుకుని లాగి ఒకడిసేతిలోని మోకు గుంజుకుని దాన్ని సెట్టుకి కట్టేసిండు.

మెరుపు మెరిసింది.

ఆ ఊరిల కులపెద్ద సెప్పిందే సెల్లుబాటవుతుంది.

రజాకారోళ్ళు- పోలీసోళ్ళు- కులపోళ్ళు- డబ్బునోళ్ళు- అళ్ళదేరాజ్యం. బగమంతుడుంటే అదుమాత్రం తీర్పు సెప్పటానికి దిగిరాలేదు.

మనయ్యా గాని నేను గాని తప్పు సేసివుంటే ఆడేమో పారిపోయిండు. నేనేమో నోరిప్పలేదు.

మల్ల సన్నగ మొదలైన వాన సినుకుల్ల తడిసిపోతు అడుకూతుప ఆ రాగి సెట్టుకి కట్టేసి వున్నది.

'వస్తడే- మీ అన్న వస్తడే- వాదొచ్చి ఇడిపించెదాక ఈ సెట్టుకే- యిట్టనే ఉంటవే' అంటండు మా అన్న- అంటండ్రు కులపోళ్ళు.

ఇదేం న్యాయం ?

పైనల్లవి మనయ్యా పైసఇన్న బుర్రమీసాల కాడికి వస్తడా ?

అన్నా- అమ్మా- అయ్యా- ఇదేం న్యాయం ?

'తప్పు నాదికూడ వుంది. ఒద్దు- నీలమ్మ నొదిలేయ్యండి' అని అరుద్దామను కున్న. మల్ల ఒక్కసారి ఆకాసం ఉరిమింది. నా మాటలు నా లోపల్నే వుండిపోయినయి-

నా కెకెకెనే ఈ రాత్రికి ఆ సినుకుల్లో వల్లని సలికి ఒణుక్కుంట నీలమ్మ నిలబడ్తది. రేపు ఒళ్ళుమండే జొరంతో సెట్టుకే అంటుకుని ఉంటది. అళ్ళ అన్న మనయ్యా ఒచ్చి జరిమాన కడ్తే ఇంటికి పోతుంది. లేకుంటే-? అట్టనే ఉంది తన కంటిసీరే వరదసీరై, అందుల మంట పుడితే ఆ మంటల్లో కట్లు ఇప్పుకుంటదా?

ఇప్పుకుంటదా ?

సీతమ్మోరిని సెఱబట్టిన రావణా సురులు- అప్పటినుంచి యిప్పటిదాక సీతమ్మలకు సెఱలే.

నాలాంటిది సూస్తనే ఊకుంటది. మనయ్యలాంటి ఎదవలు మాటలు సెప్పి కనబడకుండ పోతరు- ఎవర్నో యిరికి స్తరు- సెల్లెలయినా సరే- మరి నీలమ్మ ఒక్కతే కట్లు యిప్పుకుంటుందా ?

నీలమ్మా- నీలమ్మా- అన్నీ కట్లే నీలమ్మా-

ఆడదానివై పుట్టినవు, అందుల పేద దానివై పుట్టినవు.

సంతల పసువులాగ నిలబడ్డవు-

ఈళ్ళంత నిన్ను కొంటరు- నరుకు తరు- తింటరు.

నీలమ్మా- నీలమ్మా- నీలమ్మా-

నువ్వే కట్లు యిప్పుకుంటవా నీలమ్మా ?



# ప్రయాణం



ప్లాట్‌ఫారం మీద నిలబడిన సుజాత అవతల లైను ప్లాట్‌ఫాం మీదికి అప్పుడే ప్రవేశించిన రవిని చూసింది. పొడుగ్గా, బలంగా ఉన్న రవి చేతిలో చిన్న బ్రీఫ్‌కేసు ఉంది. తనని అతనొక క్షణం చూశాడని కూడా అనిపించింది సుజాతకి. "ఇటు వస్తాడేమో" అని ఆశపడింది కూడా. అయితే అంతలోనే పాంటుజేబు తడుముకుని గబగబ వెనక్కి— తిరిగి మళ్ళీ బయటికి వెళ్ళిపోవడం కనబడిందామెకు. "పర్సు కాని పోలేదు కదా!" అని కంగారుపడింది.

"అంతెత్తు మనిషి దగ్గర పర్సు కాజేసేందుకు ధైర్యం ఉండనక్కర్లా" అని నవ్వుకుంది.

"...పటికన్న [illegible] ...చ్చాడు— లెక్క[illegible] ఉ[illegible] చేస్తున్నాడని ఎవరో క్లాసుమేట్సు చెప్పారు. ఆడపిల్లకు పెళ్ళయితేను, మగవాడికి ఉద్యోగం వస్తేనూ పెద్దతనం వస్తుంది తనని అందరూ అనరూ— ఇదివరకటికన్నా ఇంకా చాలా బాగున్నావని! అలాగే అతనూను. కాలేజీలో చదివే రోజుల్లోనే బాగుండేవాడు. ఎందువల్లనో తన కెప్పుడూ అతనంటే ఎటువంటి భావం కలగలేదు." అంతలోనే సుజాతకి నవ్వొచ్చింది "ఎందువల్లనేమిటి — బావ ఉండటంవల్ల. పెద్ద టెన్నిస్ ప్లేయర్‌లా ఉండే బావ ఉండగా మిగిలిన తన

సింగరాజు రామచంద్రమూర్తి

క్లాసుమేట్స్ మాత్రం రవిని గురించి ఏదో ఒకప్పుడు మాట్లాడుకునేవారు. తనకి చింతగా ఉండేది. అతను తన వంక ఎప్పుడయినా దొంగచూపులు చూస్తుంటే. ఈ ఆడపిల్లలు కనీసం గంటకో సారయినా తన గురించి మాట్లాడుకుంటున్నారని అతనికి తెలిస్తే? ... అతని కెలా ఉంటుందో మగాడయితే తనకి తెలిసేది!

ఒకసారి మాత్రం అందరూ కలిసి అతణ్ణి విసిరారు. "మాలో ఎవరమయినా మగపిల్లల్ని రెచ్చగొట్టేలా బట్టలు వేసుకుంటున్నామా రవిగారు" అనడిగారు. అతను ఒక్కడూ తాము పదిమందిదాకా ఉన్నారు.

"ఎవరన్నారండి ఆ మాట?" అన్నాడతను ఖంగారుగా.

"పరిశీలనగా చూసి మరీ మాట్లాడండి" అంది తను.

"ఏమిటి చూసేది?" అన్నాడతను ఖంగారుగానే.

"అంటే— మా డ్రస్ గురించి అడిగాము కద! సరిగా చూడకుండా ఏదో అనేస్తే ఎలా? చూడండి మమ్మల్ని" విలేసినట్లు అంది తను. అవునులేమరి, అతనంటే ఎటువంటి "ఉద్దేశం" లేనిది కనుక తను తడబడకుండా మాట్లాడగలదు. మిగిలినవారికి అతనొక గ్రీక్ గాడ్!

ఒక్కసారి అందరివంక చూసి "లేదండి" అన్నాడతను.

"మరయితే మమ్మల్ని మీ బాయిస్ నానా మాటలూ ఎందు కంటున్నట్లు?" మళ్ళీ తనే అడిగింది.

"ఏమోనండి. నా కేం తెలుసండి? అయినా సుజాతగారూ, అందరికీ నేనే ప్రతినిధిలా నన్నా ప్రశ్న అడిగితే నేనేం చెప్పగలనండి?" అన్నాడు.

తనూ నవ్వేసింది. "చెప్పగలరని అనుకోలేదులెండి. వేసుకునే వారు ఉన్నారు కద అని ఇష్టంవచ్చినట్లు రాయగలరు. 'ఆడదే మగవాడిని రెచ్చగొట్టేలా ప్రవర్తించడంవల్ల, బట్టలు వేసుకోవడంవల్ల మగవాడు ఆడదాని పట్ల చెడ్డగా ప్రవర్తిస్తున్నాడు.' అదేగా మీ సిద్ధాంతం! అదేగా పేపర్లో మీ రీ రోజు రాసిన ఉత్తరం సారాంశం!" అడిగింది తను.

"నా ఉద్దేశం —"

అతని మాట పూర్తికాకుండానే మళ్ళీ తనే అంది "ఈ రోజు మేమందరం మంచిగా, పూర్వకాలపు ఆడవాళ్ళలా బట్టలు వేసుకోవడంవల్ల మా మానాభిమానాలు రక్షింపబడ్డాయంటారు" అని.

"లేక రవిగారే ముందు మనమీద పడిపోయేవారేమోనే పాపం!" ఎవరో అంటే అందరూ నవ్వేశారు.

అతని ముఖం ఎర్రబడటం గమనించి "మగవాళ్ళకి ప్రతినిధిలాగానే గద మీ రది వ్రాసినది! మీకు మంచిగా

అలా ఎడంగా నిలబడ్డారంటే అది మీ గొప్పతనం కాదు; మా మంచితనమే కాని!" అంది తను.

"నేను అటువంటివాడిని కానండి. కాని చాలా కేసుల్లో మాత్రం అది నిజమని మాత్రమే రాశాను".

"అంతేకాని పురుషుడిలోని పశుత్వానికి ఆడది బలిఅయిపోతోందని ఒప్పుకోరు. సిగ్గు, అవమానం భరించలేక కుమిలిపోతోందని, ఆత్మహత్య చేసుకుంటోందని గ్రహించుకోరు.

"పశుత్వమే మగవాడిలో ఉంటే ఆ పశుత్వాన్ని ఆడవాళ్ళు రెచ్చగొడుతున్నారు. అదీ అందరి మగవాళ్ళలోనూ కాదు" అన్నాడు అతను.

నవ్వింది తను. "కనుక మీ కంటె మేమే చాలా గొప్పవాళ్ళ మన్నమాట! మీలో పశువులు దాక్కొని ఉంటాయి. వాటిని రెచ్చగొట్టాగం, మంచిగా ఉంచాగం! మీ రిలా బుద్ధిగా నిలబడ్డారంటే మేమే కారణం!

"పొరబడుతున్నారు. నే నటువంటివాడిని కాను అని మరీమరీ మనవి చేస్తున్నాను."

అతని మాట పట్టించుకోకుండా "రండే బాబూ ప్రమాదం! ఏ గాలికి ఏ బట్ట కొంచెం తొలిగినా కవిగారిలోని పశువు బయటికి వస్తుందేమో! ఈ లోపలే పోదాం" అన్నా రెవరో. అందరూ నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

ఇదంతా స్త్రీలపై పురుషుడి అత్యాచారాలు గురించి పేపర్లో ఉత్తరం వ్రాసినందు కన్నమాట.

ఏమిటో అదొక సరదా! ఇప్పటికీ తన కటువంటివి సరదానే. కన్న ప్లాట్‌ఫాం మీదనే కనబడ్డాడు రవి. తన వద్దకు రావడమా, మానడమా అన్న సందిగ్ధంలో ఉన్నాడని గ్రహించి పలకరింపుగా నవ్వింది సుజాత.

ధైర్యంగా వచ్చేశాడు. "చాల్లే, చాలా కాలానికి చూశాను మిమ్మల్ని" అంది సుజాత.

నవ్వి ఊరుకున్నా డతను.

"ఎందాకా వెళుతున్నారు?" అంది సుజాతే.

"తణుకు".

"తణుకా... ఏం పనిమీద?"

"కాలేజీలో చిన్న పనుండి. అందుకని!"

"అవునవును, మీరు కాలేజీలో పని చేస్తున్నారని విన్నాను. మాదురి చెప్పింది — తనూ మీ ఊళ్ళోనే పనిచేస్తోంది గద! . అదుగదిగో ట్రయిన్ వచ్చేస్తున్నట్లుంది."

ఇద్దరూ గబగబా ట్రయిన్ వైపుకి నడిచారు. కిటికీ పక్కనవున్న సీటొకటి ఖాళీ అవుతుంటే గభాలున తన బ్రీఫ్ కేసు కిటికీలోంచే అందులో పడేశాడు రవి.

"మీ కోసమే వేశాను సీటు,

"కూర్చోండి" అన్నాడు లోపలికి వెళ్ళాక.

"మరి మీరో?"

నవ్వేశాడు రవి. 'నా కలవాటే కదండీ— గంటసేపు లెక్చర్ కొట్టడం! ఒకసారి నిలబడ్డానంటే గంటదాకా కూర్చోవాలన్న ధ్యాసే రాదు. అప్పుడొక్క అయిదునిముషాలు మీ సీటివా రంటే మళ్ళీ గంటా నిలబడగలను, మరొక క్లాసులో లెక్చరు మొదలన్న మాట!"

సుజాత కూడా నవ్వింది. అతను వెళ్ళి డోరు పక్కన నిలబడ్డాడు. "పోనీ ఇక్కడే నిలబడితే కబుర్లయినా చెప్పుకునేవాళ్ళం" అనుకుంది సుజాత. అయితే గాలి హాయిగా పీల్చుకుంటూ నిలబడిన అతన్ని పిలవబుద్ధి కాలేదు. రివ్వున వీస్తున్న గాలికి అతని శరీరానికి అతుక్కుపోతోంది షర్ట్. "బలమయిన శరీరం, అంతెత్తు పొడుగు, శిల్పం లాంటి ముఖం" తన క్లాసుమేట్ శశి అంటుండే మాటలు గుర్తుకొచ్చాయి సుజాతకి. నవ్వుకుని పుస్తకం తెరిచింది. కాసేపటికి అందులో లీనమయిపోయింది.

"రైలు ఏదో ట్రబుల్ ఇచ్చినట్లుంది" అన్నాడు రవి.

పుస్తకంలోంచి తలెత్తి "ఎక్కడున్నట్లు మనం ఇప్పుడు?" అంది సుజాత.

"భీమవరంకి దగ్గర్లోనే! ఇదేదో హాల్టు స్టేషన్. అసలు రైలిక్కడ ఆగదు. అటువంటిది ఆ స్టేషన్ దాటాక ఆగిపోయింది."

తల బయటికి పెట్టి చూసింది సుజాత. అందరూ ఇంజను వైపుకి వెళుతున్నారు. "నిజమే మీరన్న మాట. ఏంపాడయిందో కదులుతుందో లేదో కదండీ" దిగులుగా అంది.

"చూసి వస్తాను ఆగండి" అన్నాడు.

"నేనూ వస్తాను వన్ మినిట్" అంటూనే గబగబ బాగ్ మెడలో వేసుకుని బయలుదేరింది. అతనుకిందకిదూకి "జాగ్రత్తగా దిగండి. సాయం చేయమంటారా— నేల చాలా దిగువగా ఉంటుంది, ప్లాట్ ఫాం లేదుకద" అంటూనే చేయి చూపాడు ఆమెకోసం.

"నో. దిగతాను-తప్పుకోండి మీరు" అంటూనే రెండవ మెట్టునుండి ఒక్కదూకు దూకేసింది.

ఇద్దరూ కలిసి ఇంజనువైపు నడిచారు. అక్కడ డ్రయివర్ వగయిరా అందరూ కింద కూర్చుని ఉన్నారు. ఒకరెవరో బాగుచేస్తున్నట్లు కనబడింది.

"ఏమయింది?" అడిగాడు అక్కడ ఒకరిని రవి.

అతను ముందు విసుగ్గా చూసి తరువాత పక్కన అందమయిన అమ్మాయి నిలబడి ఉండటం చూసి "అదుగో ఆ కడ్డీలాంటిది ఉంది చూశారా అది ఊడిపోయింది. అదే చక్రాలని తిప్పుతుంది. అది కొత్త ఊడి పడిపోయింది. కనబడుతోందా?" అనడిగాడు.




"కనబడింది, కనబడింది" అని రవి అంటున్నా సుజాత కూడా "అవునండి కనబడింది" అని అనేదాకా అతను దాన్ని చూపిస్తూనే ఉన్నాడు

"మరిపుడెలా?" అంది సుజాత.

నవ్వాడు అతను. "అలా బెంగ పడితే ఎలా? అదుగో ఆ రైలు గేటునుంచి భీమవరంకి ఫోన్ చేశాడు డ్రయివరిప్పుడే. అక్కడినుంచి వేరే ఇంజన్ గాని, మనిషి గాని రావాలట. ఒక్కరగంట అలా చక్కగా ఆ చెట్టు పీడన కూర్చుంటే ఇట్టే కాలక్షేపం అవుతుంది" అని సలహా కూడా ఇచ్చాడతను

"ఏం చెదదామా" అంది సుజాత

"ఎందుకు, కంపార్ట్మెంట్లో కూర్చుంటే పోలా?"

"సరదాగా గాలి పీల్చుకోవచ్చునుగద. జీవితమంతా ఫ్యానుగాలిలో విసిగిపోయిందండి బాబు. దేవుడిచ్చిన అవకాశం ఇది!"

"పదండి" అన్నాడు రవి.

వాళ్లిద్దరూ వెళ్లినవైపు చూస్తూ నిలబడ్డాడు వాళ్ళకి ఇంజను గురించి వివరించినాయన.

దారిలో పంటకాలువ వస్తే దానిని దాటాడు రవి. సుజాత దూకబోయి "అమ్మో" అని వెనకంజ వేసి చేయి చాపింది సాయానికి రవివైపు.

అతనొక్క క్షణం సందేహించి చేయి అందించాడు. చెంగున దూకి అతని మీద పడి "సారీ" అంది సుజాత.

నిట్టూర్చి, మళ్లీ ఇంజను వైపుకి చూపు తిప్పుకున్నాడు ఇందాకటాయన.

"ఇక్కడ కూర్చుందాం. అటు రోడ్డు కనబడుతోంది. ఇటు ఇంజను" అంటూనే కూర్చుని రవివంక చూసి "ఏమిటి సందేహం? నేల బాగానే ఉంది బాబూ.

ఆడదాన్ని నేను కూర్చోగా లేనిది" అని అతని చేయి పట్టుకుని ఒక్క గుంజు గుంజింది. గబాలుని అతను కూలబడి సుజాత వంక చూశాడు.

"చాలా కాలానికి మళ్ళా సరదాగా ఉంది నా కీరోజు చదువుకునే రోజులే సుఖమయినవి రవిగారూ, అవునా" అంది.

అతను మాట్లాడకుండా ఆమెవంక చూశాడు. మళ్ళీ సుజాతే అంది "అవునండి. అవే మంచివి! ఎవరినో ఒకరిని ఆటపట్టిస్తూ, మగపిల్లలు ఏమయినా మాట అంటే బయటికి ఉడుక్కున్నా లోపల ఆనందపడుతూ" అని పకపక నవ్వి "నిజం. మా గరల్‌స్టూడెంట్స్‌కి బోయిస్ ఏమన్నా అంటే చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది అయితే ఆ ఆనందం అందం గురించి అయుండాలనుకోండి! ఉదాహరణకి నన్ను 'బ్యూటీ క్వీన్' అనేవారు కదా-నాకు అదెంతో బాగా ఉండేది" అంది.

అతను తలవంచుకుని గడ్డివంకే చూస్తున్నారు.

"ఇప్పుడు చూడండి, జీవితం ఏర్జివంగా అయిపోయింది?"

"అదెందువలన" అన్నాడతను గబాలున తలెత్తి.

"ఎస్ నిజం. పెళ్ళికాని ముందు అదొక సస్పెన్స్. ఎలా ఉంటాడో, ఎలా చూస్తాడో అన్న ఊహలు మధురంగా ఉంటాయి. ఆ సస్పెన్స్ పోతే విధి మనల్ని వెక్కిరిస్తే-ఏం చూసుకుని బ్రతకాలి రవిగారు?"

"మీ మాటలు నాకర్థంకావడంలేదు అన్నాడు రవి నిజంగానే అర్థంకాక.

"నాకు పెళ్ళయిందని ఈ పాటికి మీరు గ్రహించే ఉంటారు నా మంగళ సూత్రం చూసి. అయితే అక్కడ నేను అతి క్రూరంగా మోసగింపబడ్డాను."

"నా కర్థం కావడంలేదు."

"చెబుతాను మీలాంటివారికి చెప్తుంటే కాస్త మనశ్శాంతి ... దొరుకుతుంది. ఒక్కమాట చెప్పనా సూటిగా? మీ పక్కనిలా కూర్చుంటే ఎందుకో పోయిన ధైర్యం అంతా వచ్చినట్లవుతోంది. నేను దారుణంగా వంచించబడ్డాను రవిగారు. చేసుకున్న అయినవారినే. నేనంటే తనకి ఎంతో ఇష్టం అనేవారు చేసుకునే ముందు. 'ఇప్పటికి మాత్రం ఇష్టం కాదని ఎలా అనుకుంటున్నావు? ఎందు కనుకుంటున్నావు' అని అడిగాడు నన్నొకసారి ఈ మధ్యన.

"మరో మనిషిని మీరు ఆ విధంగా ప్రేమిస్తున్నానని చెబుతూ మళ్ళీ నేనంటే ఇష్టం అని మీరనే మాటల నెలా నమ్మమంటారు" అని అడిగాను.

నవ్వారు. ఎలా నవ్వగలిగారో నా కిప్పటికీ ఆశ్చర్యంగా ఉంది! "అదేమిటి సుజీ, అంత చిన్నవిషయం నీ కెందుకు అర్థంకావడంలేదో నాకు ఆశ్చర్యంగా ఉంది! 'నువ్వంటే ఇష్టం. చాలా







మంజు, ఒక సుందరమైన రాగం
లాంటిది. లక్స్ ఆమె సౌందర్యానికి
మెరుగులు దిద్దేది.
మంజు భార్గవి అంటోంది
"నా శరీరాన్ని మృదువుగా
అందంగా ఉంచేది లక్స్".

శుద్ధమైన, సౌమ్యమైన లక్స్.
సినీమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు.

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

ఇష్టం!' అని అన్నాను. అంటాను. అయితే మనిషన్నాక చాలా ఇష్టాలు ఉంటాయి. ఆ ఇష్టాలలో నువ్వు ఒక ఇష్టానివి! మాధవి మరొక ఇష్టం!

"నువ్వంటే ఇష్టం" అన్నానే కాని నువ్వంటేనే ఇష్టం. ఇంకెవరూ లేరు నాకీ లోకంలో అన్నానా" అనడిగారు.

"మాధవి ఎవరు?" అడిగాడు రవి.

"మావారు నాటకాల్లో వేషాలు వేస్తారు అది కాలేజీ రోజులనుండీ అల వాటు. అనాటినుండీ ఈయనకి హీరోయిన్ ఈ మాధవి! నిజ జీవితంలో కూడా నా పాలిట రెండవ హీరోయిన్ అయి కూర్చుంది. దానికి ఆయన ఏమంటారో తెలుసా—

"పొరపాటు సుజీ. నీకన్న ముందు నుంచీ మాధవి నన్ను నమ్ముకుంది. అయితే నీకు పెద్దవాళ్ళ ఆశీర్వాదం ఉందిఅందువల్ల పట్టపురాణి హోదాఉంది! అంతమాత్రాన నన్నే నమ్మి నాకు తన సర్వస్వం అర్పించిన మాదవిని అన్యాయం చేయమనడం సాటి ఆడదానిగా నువ్వు చేయవలసిన పనేనా?" అన్నారు.

"ఆ మాధవి విషయంలో మీ కింత ప్రేమ ఉన్నపుడు నా దగ్గర మొదటి నుంచి ఎందుకు దాచారు? అప్పుడే చెప్పకపోయారా? మీరంటే అప్పటికే ఇష్టపడి చేసుకుని ఉంటే నోరెత్తకుండా పడిఉండేదాన్ని కదా!" అన్నాను చిరాకెత్తి. అవును అలా ఎవరితోనో నా భర్తని పంచుకోవలసిన ఖర్మ నాకేమిటి?

"అంటే ఆ విషయం ముందే తెలిస్తే నన్ను చేసుకునేదానివి కాదన్న మాటేగదా!" అనడిగారు.

నేనేమీ మాట్లాడలేదు అవును మరి, ఆ ప్రశ్నకి సమాధానం చెప్పడమంటే నా సంసారబంధాన్ని తెంచుకోవటమే కదా! అయితే వేరే నా ప్రయత్నం లేకుండానే మా బంధం తెగిపోయే ఘట్టం కూడా రానే వచ్చింది.

ఆ మాధవిగారికి, మా వారికి నా కన్న ముందునుంచే పరిచయం అని చెప్పాను కద. అందువల్లనే నా కింకా పిల్లలు లేకుండానే ఆవిడకి ఒక మగ పిల్లాడు కలిగాడు. ఈయనకి పసిపిల్లలంటే విపరీతమయిన ముద్దు. అందువల్ల "వేరే వేరే ఉంచడంవల్ల నాకు చాలా టైము, డబ్బు దండుగవుతోంది సుజాతా! నువ్వు కొంచెం సర్దుకుంటే అందరం కలసి ఉండొచ్చు" అన్నారు ఒకరోజు.

నా సహనానికి అదే ఆఖరి పరీక్ష అయింది. "పూర్తిగా బయటికి సర్దుకుంటాను. నేనూ చదువుకున్నదాన్ని— నా కాళ్ళమీద నేను నిలబడలేకపోను" అని చెప్పి చూశాను.

"ఆలోచించుకో. తెంపుకోవడం తేలిక. కలపడం మాత్రం కష్టం. నీ కేనాడూ లోపం చేయలేదు నేను" అన్నాడాయన.

"మగవాడు ఆడదాన్ని మరొకరితో పంచుకోగలడా? నాకూ అంతే నాకు

## జిడ్డు పట్టిన పళ్ళెమా?

## విమ్ వాడటంలేదా ఏమిటి?



## శుభ్రంచేసే మరే యితర పౌడర్‌కన్నా జిడ్డును తీసేసే శక్తి మరింతగా వుంది విమ్‌లో

శుభ్రం చేసే సాధారణమైన పౌడర్లు జిడ్డును సరిగ్గా తీసెయ్యలేవు. మీ పింగాణీ, గాజు, స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర సామగ్రి పైన పౌడర్ తాలూకు అవశేషాలూ, మచ్చలూ, మరకలూ మిగిల్చేస్తాయి అవి.

విమ్‌లో జిడ్డును తీసేసే శక్తి మరింత ఎక్కువగా ఉంది. అది మీ టేబుల్ మీది పళ్లాలనీ, పాత్రలనీ ఎంతగా శుభ్రపరుస్తుందంటే, అవి తళతళ మెరుస్తాయి.

మీ ఇంట్లోని పాత్రలకి ఇక విమ్ మెరుపును ఇవ్వండి




# విమ్

## తళతళ తప్ప ఏమీ మిగల్చదు.

LINTAS V 69-1810 TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

పూర్తి భర్త కావాలి- సగం భర్త కాదు" అని బయటికి వదిచాను.

"ఇప్పుడు మా పుట్టింట్లో ఉంటున్నాను. ఖర్మకొద్దీ అదీ ఆ ఊళ్ళోనే. అందువల్ల ఎక్కడయినా ఉద్యోగం వెతుక్కోవాలి. పురుషుడు 'తప్పు' చేస్తే అది శీలం పాడవడం కాదు. ఆడది అదే 'తప్పు' చేస్తే అది శీలంచెడిన ఆడది! ఇదేం న్యాయం? ఇన్నాళ్ళూ పురుషుల అధికృతగల సంఘం మనల్ని శాసించింది ఆ రోజులు మారాలి. శీలం వాడికి లేకపోతే దానికీ అక్కరలేదు" అంది సుజాత ఆవేశంగా.

రవి ఏమీ మాట్లాడకుండా ఉండి పోయాడు. అంతలో తమకి కొంచెం దూరంగా రోడ్డువైపు పోతున్నవాళ్ళని చూసి పెద్దగా అడిగాడతను "వెళ్ళిపోతున్నా రేమిటి? రైలు బయలుదేరదా?" అని

"ఇంజను రావాలట. భీమారం నుంచి! చాలా టైము పడుతుందట. అక్కడ డ్రయివరు దొరకలేదట ఇంకా! లారీ దొరికితే పోదామని.." అని అంటూనే వెళ్ళిపోయారు వాళ్ళు.

"ఏమండీ రవీ, మనమూ పోదామా?" అడిగింది సుజాత.

కాసేపు తటపటాయించి "ఆడవాళ్ళని లారీ ఎక్కించుకోరు" అన్నాడు రవి.

"ప్రతిచోట ఆడ- మగ ఎందుకా తేడా! మగవాడేం చేస్తే ఆడది అవన్నీ చేస్తుంది. కదల్తున్న లారీ ఎక్కగలను. అందులోంచి దూకే గలను తెలుసా!"

రవి నవ్వి "నేను కాదుగా- ఆ లారీ డ్రయివర్లు ఎక్కించుకోవాలి! పదండి" అని లేచి నిలబడ్డాడు

"హెల్ప్." అంటూ చేయి చాచింది సుజాత. చాచిన ఆ చేయిపట్టుకొని ఒక్క ఊపున లాగాడు.

"చూడండి, చీర కెక్కడయినా మరక లయినాయేమో- నేలమీద కద మనం కూర్చున్నది" అంటూ వెనక్కి తిరిగింది వెనకభాగం దులుపుకుంటూ.

పాలనురగలాంటి చీర ఎత్తయిన ఆమె శరీరానికి అతుక్కుని ఉంది. "ఏపీ లేవు" అన్నాడు రవి

"అయితే యిక పదండి" అంది.

ఇద్దరూ రోడ్డెక్కేవేళకి లారీ వెళ్ళి పోయింది. "ట్రాక్టరు వస్తోంది" అంటూ చేయెత్తాడు, ట్రాక్టరతను ఆపి "రైలు ఇంజను పాడయిందటగా సార్" అనడిగాడు.

"అవునండి. ఎందాకా పోతుంది మీ బండి" అడిగాడు రవి

"భీమారం. కాని మట్టి తోలుతున్నాం సార్. అమ్మగారు కూర్చోలేరు" అన్నాడు నవ్వుతూ.

ట్రాక్టరు ట్రక్కులో నలుగురు కూలీలున్నారు అడామగా కలిసి. "వాళ్ళు కూర్చుండగా లేనిది నేనెందుకు కూర్చో లేను" అంటూనే వెనకనుంచి ఎక్కేందుకు ప్రయత్నించి "కొంచెం

హెల్ప్ చేయాలి రవీ" అంది.

అతను ఆమె వెనకభాగం మీద రెండు చేతులు వేసి మెల్లగా నెట్టాడు. ట్రాక్టరులో కూర్చుని "ఇదొక కొత్త అనుభవం బ్రహ్మాండంగా ఉంది" అంది సుజాత. రవి కూడా ఎక్కి కూర్చున్నాడు.

"ఇదేమి టిలా కుదిపిపారేస్తోంది!" అంది సుజాత ట్రాక్టరు నడుస్తుంటే. కూలీలు వాళ్ళిద్దరినీ మార్చి మార్చి చూస్తున్నారు వింతగా!

దారిలో నేరేడుపళ్ళు తీసుకెళుతున్న అబ్బాయిని చూసి "ఏ ఊర్పి అమ్ముతావా" అనడిగింది. వాడు అమ్ముతాననే సరికి "రవీ, రవీ, డ్రయివర్ గార్ని ఒక్కసారి ఆపమనండి! ప్లీజ్. నాకు చాలా ఇష్టం" అంది.

ఆ మాట విని డ్రయివర్ ఆపేశాడు.

"ఆ దబ్బా ఎంత? అందరికీ తలొక దబ్బా పొయ్యి" అంది హేండ్‌బ్యాగ్ లోంచి డబ్బులు తీస్తూ.

"మాకందరికీ ఎందుకమ్మా?" అంటూనే డ్రయివర్ చేయి జాపాడు

"మా రెండు దబ్బాలు ఇటు పొయ్యి" అంటూ పమిట తీసి పట్టింది

"చీర పాడయిపోతుంది. మరకలు వదలవు" అన్నాడు రవి

నవ్వింది సుజాత. "లెటిట్ గో టు హెల్! ఈ రోజు ఎరవాగా ఉంది నాకు మళ్ళీ లేత ఎద్యార్థి జీవితం గుర్తు కొస్తోంది కనుక టునంటి పనులు చేయాలి" అంటూనే పోయించుకుని ఆ మట్టిమీద పమిట పరిచి "తినండి. ఇందులోకి ఉప్పు ఉంటే బాగుండేది తెలుసా మీ కా రుచి!" అంది.

కూలీల్లోని ఒక ఆడమనిషి ఇంచు మించు పమిట లేకుండా సుజాత కూర్చున్న తీరుచూసి పక్కనున్న మగాడివంక చూసి నవ్వింది.

"సినీమాల్లో సూట్టం లేదేటి?" అన్నాడు వాడు మెల్లగా ..

"ఊళ్ళోకి తీసుకెళితే నేను రాస్తా రమ్మా. అందుకని" అంటూ ట్రాక్టరు ఊరి మొదట్లోనే ఆపాడు డ్రయివర్ గారు "ఆ బండిరిక్షా ఎక్కి వెళ్ళిపోండి సార్" అని సలహా చెప్పడంతోపాటు అతనే ఆ రిక్షాని కేకేశాడు కూడా.

ట్రాక్టరులోంచి గభాలున దూకేసి "చూశారా!" అంది సుజాత.

రిక్షావాడిని "బస్టాపుకి వస్తావుటోయ్!" అనడిగాడు రవి.

"బస్సుల్లేవుగదయ్యగారు. స్ట్రయికుంది ఈయాళ" అన్నాడు వాడు.

"హతోస్మి. అన్నీ అడ్డంకులే."

"వెరీగుడ్! మరో థ్రిల్! ముందు హోటలుకి పోనీయండి రవీ భోజనం చాలా అవసరం. అసలు చూశారా, మీరు తోడుఉండబట్టి నాకు బాగా ఉంది. లేకపోతే నేనేమయిపోయేదాన్నో ఈ రోజు!" అంది సుజాత.

హోటల్లో భోజనం అయినాక

అక్కడనుంచే స్టేషన్‌కి ఫోనుచేశారు.

"ఇంకా ఇంజను వెళ్ళలేదు. బండి ఇక్కడికి చేరేసరికి రెండు గంటలు పడుతుంది" అన్నారు వాళ్ళు.

ఆ మాట విని "మీకు ఊళ్ళో ఎరుగున్నవారెవరూ లేరా? కాసేపు రెస్టు తీసుకుందాం" అంది సుజాత.

కాసేపు ఆమె వంకవే చూసి "పదండి" అన్నాడు అతను.

"నడవలేనండి బాబు, రిక్షా పిలవండి."

"ఇందాకటి రిక్షా అంటే నలుగురు కూర్చోవచ్చు. ఇప్పుడు బస్తీ రిక్షాలు- ఇకటి కుదరదు, రెండయితే. ."

"అమ్మో ఒద్దు- నాదొక దారి మీదొక దారి అయితే? అయినా ఒక్క రిక్షా అత్యంతరం ఏమిటి. హైదరాబాద్ సిటీ బస్సుల్లో కావలించుకుంటున్నట్లు ఎక్కేయరూ." నవ్వింది సుజాత.

క్షణం ఆమెవంక చూసి రిక్షా పిలిచాడు. తనకా కావలసిందదే కూర్చొని ఇల్లు గుర్తు చెప్పాడు. ఇంటిముందు రిక్షా ఆగగానే దూకేసి "శంకర్" అని పిలిచాడు.

కుర్రాడొకడు గబగబ బయటికి వచ్చి "మీ పేరేమిటి సార్?" అన్నాడు.

"రవి. బందరు, లెక్చెరరు" అన్నాడు

"శంకర్‌గారు ఊరెళ్ళారు. మీరు ఈరోజుగాని ఎల్లుండిగాని వస్తారని చెప్పారు. ఎల్లుండికి ఆయనే ఉంటారు. మీరూ ఆయనా ఏం చదివారు సార్?"

"ఎమ్మెస్సీ. వైజాగ్."

"కరెక్ట్" అని నవ్వి, "మీ ఫొటో- ఎమ్మెస్సీలోది చూపించారు లెండి" అని సుజాతవంక చూసి "ఒక్కరే వస్తారన్నట్లు గుర్తు సార్. ఇవిగోండి తాళం చెవులు. పైన గది" అన్నాడు

రవి గబగబ మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడు.

సుజాత కిందనే నిలబడిపోయింది.

తాళాలు తీసి మళ్ళీ బయటికి మెట్ల కిందికి వచ్చి "కమాన్" అన్నాడు రవి.

"గుర్తుంటుందా?" అడిగింది కుర్రాడిని సుజాత మెల్లగా.

"ఓ" అన్నాడు వాడు ఉత్సాహంగా

గబగబ పైకి వెళ్ళిపోయింది సుజాత. గదిలో ప్రవేశించి "అబ్బ, ఎంత హాయిగా ఉంది! గాలీ, వెలుతురు! ఓహ్ స్నానంచేసే వీలుంటే . పోనీ వద్దులేండి మీరు ఒక అయిదు నిమిషాలు అలా బయట నిలబడితే చీర మార్చుకుంటాను" అని పమిట మొత్తాన్ని తీసి "చూశారా, ఎలా పాడయిపోయిందో మట్టి అంటుకుని" అంది సుజాత.

రవి మాట్లాడకుండా బయటికి వెళ్ళిపోయాడు.

తలుపు కొంచెం ఓరగా వేసి కూనిరాగాలు తీస్తూ బట్టలు మార్చుకుంది సుజాత. పదినిమిషాలయినాక "లోపలికి రండి" అని అతనికి ఎదురుగా నిలబడి

చూడండి...
సర్వోత్తమ తెలుపుకోసం రానిపాల్®

బట్టలను ఆఖరుసారి జాడించే [illegible] కొంచెము [illegible] వేయండి.
అప్పుడు చూడండి... బట్టలపై మెరిసే తెలుపు! [illegible]
తెల్లటి బట్టలు ఏవైనా కానీ—నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ
బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...**
**తెలుపు చూడండి, చూపండి!**







నూలు దుస్తులకు
రానిపాల్®
సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు
రానిపాల్®-ఎస్

Shilpi SG-2A/78 Tel

"ఫ్రెష్- మల్లెపువ్వులా ాగున్నానా?" అంది నవ్వుతూ.

కిందినుంచి పైదాకా చూసి "మీ రెప్పుడు బాగుండలేదూ?" అన్నాడు రవి

"థాంక్స్. నేను కాసేపు పడుకోవాలి. మంచం ఆహ్వానిస్తున్నట్లుగా ఉంటే పడుకోవాలనిపిస్తోంది" అని నవ్వి "నాది మొద్దునిద్రండోయ్. మీద ఏం పడిపోతున్నా ఒళ్ళు తెలియదు ట్రెయిన్ టయిమ్‌కి లేపవలసిన బాధ్యత మీదే!" అంటూనే మంచానికి అడ్డంగా పడుకుంది సుజాత. కాసేపటికే కళ్ళు మూసేసింది.

కాసేపు ఆమెవంకే చూసి ఫాను స్పీడు కొంచెం తగ్గించాడు రవి- ఆ గాలి వేగానికి ఆమె ముంగురులు చిందరవందరగా ముఖమంతా పడుతుంటే తరువాత తనొక కుర్చీ లాక్కుని గుమ్మంలో కూర్చున్నాడు.

"సరిగా ట్రెయిన్ టైమవుతోంది సుజాతగారు" అంటూ ఆమెని పిలిచాడు కాసేపటికి.

కదలలేదు సుజాత.

"సుజాతగారు" మెల్లిగా ఆమె భుజం పట్టుకుని కుదిపాడు.

"ఊఁ" అంటూ జరిగి పడుకుంది.

గభాలున అతను వెనక్కి తిరిగి టేబుల్ మీదనున్న అలారమ్ గడియారం తీసి దానికి కీ ఇచ్చి ఆమె చెవి దగ్గర పెట్టాడు.

వెంటనే లేచి కూర్చుని "అదేమి టండి బాబూ, చెవి పగిలిపోతే!" అంది.

"అవతల ట్రయిన్ వెళ్ళిపోతోంది" అన్నాడు రవి.

"తట్టి లేపొచ్చునుగా – అంటరాని తనమా?"

"తట్టడాలు, కుదపటాలు అయినాకనే ఈ పని! లేవండి. మళ్ళీ ముఖం కడగకండి- ఎంతో అందంగా ఉన్నారు. అయినా మీకసలు మేకప్ ఎందుకండీ?

నేను రోడ్డుమీద ఉంటాను. అయిదు నిముషాల్లో తాళంవేసి కిందకు రావాలి" అని వెళ్ళిపోయాడు.

నవ్వుకుంటూ లేచింది సుజాత.

కిందికి దిగివచ్చిన సుజాతని ఆశ్చర్యంగా చూశాడు రవి. నిండుగా పమిట కప్పుకుంది. పెద్ద బొట్టు పెట్టుకుంది. "పదండి నడిచివెళదాం-రిక్షా వద్దు" అంది

కుర్రాడికి తాళంచెవులు ఇస్తూ "ఎల్లుండి వస్తానని చెప్పు" అన్నాడు రవి.

తరువాత సుజాత వాడిని దగ్గరకు పిలిచి పర్సులోంచి ఏదో తీసి వాడి చేతిలో పెట్టి గుప్పెడు మూసి నవ్వింది

రైలు తణుకు చేరేవరకూ ఇంక ఏమీ మాట్లాడలేదు సుజాత. స్టేషన్ రాగానే గుమ్మంలో నిలబడి చేయి ఊపింది ప్లాట్‌ఫారం వైపు. రైలాగగానే దగ్గర కొచ్చి ఆమెని చేయిపుచ్చుకు దింపాడు శ్రీనివాసరావు. "ఇంతాలస్యం అయిందేమిటోయ్ రాణీ- రు నువ్వువస్తున్నావని గడ్డంచేయించుకుని వచ్చినవాడివి

చూడు ఎలా మారిపోయానో" అన్నాడు.

అతని గడ్డంమీద తట్టి "మీకేం చక్కగా, పండులా ఉన్నారు" అంది సుజాత.

వెనకనే దిగిన రవి శ్రీనివాసరావుని చూసి "నమస్కారం రావుగారు! నేను సుబ్బారావు తమ్ముణ్ని- రవిని! బందరులో లెక్చరర్ని".

"అర్ని, ఇద్దరూ ఒకే కంపార్టుమెంటులో ఉన్నారన్నమాట!" అన్నాడు రావుగారు.

మొదట తెల్లబోయి అంతలోనే ఫకాలున నవ్వేసింది సుజాత. "ఎరుగుదురా మీ రితన్ని" అనడిగింది.

"చూడటం ఇదే మొదటిసారి! మా సుబ్బారావని చెప్పనూ- వాడి తమ్ముడు. నువ్వు ఎరుగుదువా?"

"నర్లెండి. మేం క్లాసుమేట్సుమి!" అని పకపక నవ్వింది.

రవి కూడా నవ్వుతూ "మీ మిసెస్ మిమ్మల్ని గురించి పెద్ద కథ చెప్పారండి. అందులో మీరు కోరలు లేని రాక్షసుడు" అన్నాడు.

"లాభం లేదోయ్, నువ్వు సాక్షిగా నిలబడు. ఈవిడ్ని కోర్టు ద్వారా వదిలేయాలి" అని నవ్వాడు రావు. వాళ్ళిద్దరూ కూడా నవ్వేశారు.

"ఈ రవి కాలేజీలో ప్రగల్భాలు పలికాడు- రెచ్చగొట్టినా విగ్రహంకోల్పోను-అని. అందుకు పరీక్ష పెట్టాను. రైలు ఆగినప్పటినుంచి రూము వదిలే దాకా! అదంతా మీకు చెబుతాను. రండి రవీ"అంటూ కారువైపు నడిచింది.

అంతా విని "మంచి కుర్రాడు కనుక సరిపోయింది. లేకపోతే!- నువ్వు క్లాసుమేటు సుజాతవేకాని శ్రీనివాసరావు భార్యవని తెలియనివాడు కద!" అన్నాడు రావుగారు.

"కరాచే తెలిసిన యువతినండి! నా ఇష్టం లేకుండా నన్ను మీరే ముట్టుకోలేరు తెలుసా" అని నవ్వి "రూములో మాత్రం కింద కుర్రాడిని కాపలా పెట్టాను. ఇప్పుడు మనకి రవి బంధువు కాబోతున్నాడు. మా చెల్లెలి అందం చూసి ఎవరయినా పెళ్ళిచేసుకుంటారు. కాని వాళ్ళు ఎటువంటివాళ్ళో మనకి తెలియాలి కద! అందుకు రవిని పరీక్షించాను- నిప్పులా నిలబడ్డాడు" అంది.

"మీ చెల్లెల్ని చేసుకుంటాడని అంత నమ్మకమా ఏమిటి?"

"అదుగో గేటులోనే నిలబడి ఉంది. చూసి కాదనమనండి" అని నవ్వింది సుజాత.

ఏజంగానే అవాక్కయిపోయాడు రవి! అచ్చం సుజాతే- అంత అందమయినదీను!!

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

